

సర్వధారి సం.
ఫాల్గునము

# భారతి

సంపుటము 26
సంచిక 3

# విరాగి

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

౧

పుట్టుచు జచ్చుచున్ మరల
బుట్టుచు జచ్చుచు జచ్చి పుట్టుచున్
గొట్టుకొనం దొడంగెదవు
కోరిక లీరికలెత్త లోకముల్
దొట్టి మహాప్రవాహముల
తో జెలరేగు భవాబ్ధిలోపలన్;
గట్టలుకట్టి కాంతులను గాల్చి
తరింపు భవాబ్ధి మిత్రమా!

౨

బహుజన్మంబుల భోగభాగ్యములు సం
పాదించి భోగించి నీ
విహాలోకంబున దృష్టి గాంచగలవా?
యేశోకమందైన నీ



బహుయత్నంబులు బుగ్గిగాను క్షణముల్
భావించితే నీవు ప్ర
త్యహముల్ వ్యర్థమొనర్చు జీవితము మూ
ర్ఖాగ్రేసరత్వంబునన్.

3

ఆలుంబిడ్డల దల్లిదండ్రులను మి
త్రా! మొన్ని జన్మంబులన్
వేలుంగోటల గాంచినాడవొగదా!

నేడైన సద్బుద్ధితో
నాలోచింపవె మూర్ఖబాంధవజన
త్యాగోన్నతిన్, వెంటనే
యాలాపింపు విరాగగీతము పవి
త్రానూనహృద్వల్లకిన్.

౪

తుచ్ఛాస్వచ్ఛనికృష్టహేమవనితా
దుష్కామదూరుండవై
స్వేచ్ఛానందతరంగమాలికలపై
దేల్యాంది వర్తించి నీ
వచ్ఛిన్నంబగు మోక్షరాజ్యపదవీ
వ్యామోహముం జెందుచున్
స్వచ్ఛంబౌ భరతార్యధర్మమును ని
ల్పంబూను మో మిత్రమా!

౫

ముల్లోకంబుల మ్రింగజూచుచు మహా
మోఘంబునౌ మృత్యుసం
ఫుల్లక్రూరముఖంబునం బడక ని
ర్మోహంబుగా దాని న
త్యుల్లాసంబున గెల్చి మోక్షరమ కే
లూనం గృతార్థుండనౌ
ఫుల్లాబ్జాక్షుడ వో విరాగి త్రిజగ
త్ప్రాజ్యుండ వత్యంతమున్.

---

# నన్నయ్యగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి

[3. సౌకన్యోపాఖ్యానము]

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆదిపర్వములోని యయాతికథ వెంటనే యీ సౌకన్యోపాఖ్యానమును గురించి వ్రాయుటకు కారణము కథాకథనశిల్ప మీ రెంటియందును నన్నయ్యగారొక్క తీరువనే నెఱపియుండుటయే.

ఈ సౌకన్యోపాఖ్యాన మరణ్యపర్వములోనిది. శర్మిష్ఠకథ వ్రాయునపుడు నే నూరక విశేషధ్వనులు నిరూపించుచు కథాప్రసన్నత పాఠకులే గ్రహించునట్లు వ్రాసితిని. ఇచట మరియొక రీతిగా వ్రాసెదను. నన్నయ్యగారు చెప్పిన కథ యేది? ప్రసన్నమయ్యెడు కథ యేది? అది యెట్లు ప్రసన్నమగుచున్నది? ఈ మూడు తెరగులుగా వ్రాసినచో పాఠకులకు మరికొంత సులభముగా నుండునని యిట్లు వ్రాయుట యగుచున్నది.

## నన్నయ్యగారు చెప్పిన కథ

"ఇక్కొలనిసమీపమున భృగుసుతుడు పెక్కగు వేలేండ్లు తపము నొనరించెను. అమ్మునిదేహము వల్మీకమున కప్పబడి నికటవల్లీగుల్మములు పైప్రాకిన నేర్పడక యుండెన్. అంత పెద్ద కాలంబునకు సంయాతి యను రాజు తత్సరోవరంబున విహరింపనరిగిన నాతని కూతు రవ్వల్మీకంబునందు విద్యుల్లతాంగి భార్గవునుద్యన్నయనములు మెఱయుచున్నన్ సద్యస్సంజాత బుద్ధిసం[illegible]గను యగుచు నప్పుట్ట గ్రొప్పించిన నలిగి నిమీలిత[illegible]ండై చ్యవనుండు రాజసైన్యంబులకు కొంత నిరోధంబు చేసిన రాజు చింతాపరుండైయున్న సుకన్య వచ్చి యిట్లనియె. "ఒక పుట్టలో రెండు మిడుగురులై మెఱయుచున్న నెఱుగక నేను పుట్ట గ్రొప్పించితి. ఈ నిరోధమున కిది నిమిత్తం బగును." అనిన సంయాతి పుట్టయొద్దకు వచ్చి యతివృద్ధు భార్గవునకు నమస్కరించి "నీతపముమహిమ యెఱుగక యిది యిట్లు చేసె. ఎఱుకగలరె తరుణులు ధరణిన్" అనిన ముని "అతిశయరూపయౌవనగర్వితయైన యీ కన్యన్ పరిగ్రహించిగాని క్షమింపను" అనగా రాజు తనకూతు నమ్మునివరున కిచ్చి తన సైన్యనిరోధంబు పాచికొని చనియెన్." ఇచ్చటి కొక కథ.

మరియు—సుకన్య పతికి పరిచర్య చేయుచు నొనరగా నామెకడ కాశ్వినులు వచ్చి తమ్మెఱుగజెప్పి యిట్లనిరి. "అవ్వా నివ్వెవ్వని కూతుర వెవ్వని భార్య" వని. సుకన్య "నేను సంయాతికూతురను, భార్గవు భార్య"నని చెప్పినది. వారు విని నవ్వి కామభోగబాహ్యుడగు వృద్ధు వరియించి నీ జవ్వనంబు వృథ చేసితి యింకనైనను నీవయోరూపంబులకు తగినవరు వరియింపు, మేము వాని దెచ్చెద మనిన నప్పలుకులు సహింపక అప్పుడె పోయి తన భర్తతో వారి పలుకులు చెప్పెను. చ్యవనుడు దాని పతివ్రతాత్వంబునకు సంతసిల్లి వారల పలుకుల కొడంబడు మనెను. సుకన్య వారికడకు చని నాకు యౌవ్వనవరుం గాలింపు డనెను. వారక్కొలను సొచ్చిరి. భార్గవుండును వారితోడన సొచ్చె. మువ్వురు నవయౌవ్వనులై మాయందు నీ వలచువానిని వరియింపుమనిన నది తనపతియైన భార్గవుని వరియించె. చ్యవను డయ్యాశ్వినుల కతిప్రీతుండై వారిని సోమపీథుల జేసెను.

ఇది నన్నయ్యగారు చెప్పిన కథ. ఇది వట్టి కథగా నున్నది. లోనారసి చూచినచో బహు విశేషములు కనిపించి యూరకే విడివిడిగా నున్న వస్తువుల

కొక సమీచీనత యేర్పడును. అప్పు డొక దివ్యమైన కథ ప్రసన్నమగును.

## ప్రసన్నమయ్యెడు కథ

ఆ కొలనుదగ్గర చ్యవనుడు తపస్సుచేయుచుండెను. పెక్కువేలేండ్లు చేసెను. అతని శరీరము పుట్టచేత కప్పబడెను. చుట్టు నాకు లలములు కప్పి పుట్ట గూడ కనిపించుటలేదు. అంత చాలకాలమునకు సంయాతియను రాజచ్చోటికి విహారింపవచ్చెను. అతని కూతురు సుకన్య యనునది తన చెలికత్తెలతో నచట విహరించుచుండెను. ఆమె యతిశయరూపయౌవ్వన గర్వితి. అందుచేత కొన్ని సాహసపుకార్యములు చేయును. ఆమె పోయి చ్యవనుడు తపస్సుచేయు పుట్టలో చూచెను. చూచుటకు చుట్టున నున్న పొద లన్నియు జెలిక్రోసి లాగి పీకి యా పుట్టనద్దకు పోయెను. ఆమె కంత యవసరమేమి పట్టినది? ఒక విధమైన యల్లరిపిల్లయని యర్థము. వయసులో నున్నది. తాను గొప్ప యందకత్తెనని గర్వము. ఆ పుట్టలో చ్యవనుడు కనులు తెరచుకొని తపస్సుచేయుచుండెను. ఆమె యవి మిణుగురుపురుగు లనుకొనెను. అనుకొనిన సరే. ఆ పుట్ట త్రవ్వించెను. ముని కనులు మూసికొనెను. ఆమె కేమియు కనిపించలేదు. ఋషియు కనిపించలేదు. కనులు మూసికొనెను. కనుక మిణుగురుపురుగులు కనిపించలేదు సరే, ఋషి యెందుకు కనిపించలేదు? చ్యవనుడు సుకన్యను వివాహమాడవలెనని భావించెను. అందుచేత నా ఋషి యిట్లు చేసెను. ఆ కన్యను వివాహమాడుట యెట్లు? ఆమెతండ్రియైన సంయాతియే నా కూతు నీకిచ్చెదనని చెప్పునట్లు చేయవలెను. నిజముగా సుకన్య చేసిన పనికి మునికి కోపము వచ్చినచో నామె కపకారము చేయవలయును. ఆమెను శపింపవలయును. రాజు సైన్యమును శపించుట యెందులకు?

సుకన్య రూపయౌవనగర్వితయే గాని చాల సద్గుణవతి. తన సైన్యమునకు జరిగిన మూత్రపురీష నిరోధమునకు రాజు కారణ మెరుగక చింతించుచుండ సుకన్య వచ్చి "నాయనగారూ, నేనొక పుట్టత్రొప్పించితిని. అందులో రెండు మిణుగురులవలె మెరయుచున్నవి. నేను పుట్ట త్రొప్పించినను నాకేమియు కనిపించలేదు. దీని కది కారణమేమో" అన్నది. మన కెందుకు తండ్రి కోపపడునేమోయని యూరకుండక తానే తండ్రియొద్దకు పోయి యిట్లు చెప్పినది. ఆమె చాల మంచిబాలిక. రాజు పుట్టనద్దకు పోయెను. ఆ పుట్టనద్ద రాజునకు చ్యవనమహర్షి కనిపించెను. అతడు తపస్సుయొక్క క్లేశముచేత చర్మము బొమికలు మాత్రమే మిగిలిన శరీరము గలవాడు. అతనిని రాజు ప్రార్థింపగా ముని "అతిశయరూపయౌవనగర్వితయైన నీ కూతును పరిగ్రహించి గాని క్షమించ"నన్నాడు. చ్యవనమహర్షి తన తపోదృష్టిచేత నిదివరకే సుకన్య తనకు భార్యగా నుండదగినదనియు, నామెను వివాహము చేసికొనవలయుననియు నిర్ణయించుకొనెను. అందుకనియే సైన్యమునకు నిరోధము కల్పించెను. సైన్యనిరోధము చేసినచో రాజెట్లును తనవద్దకు వచ్చును. అప్పుడు నీకూతు నాకిమ్మని యడుగ వచ్చును. చ్యవనుడు వేసిన పథక మిది. మరి తా నడిగినచో రాజిచ్చునా? ఆ రాజుయొక్క స్వభావ మెట్టిదో కూడ మహర్షికి తన దివ్యశక్తిచేత తెలియును. ఆ రాజు మిక్కిలి తపశ్శాలి. మహర్షుల మహిమలు తెలిసినవాడు. అచట చ్యవనుడు తపస్సు చేయుచున్నాడని యతనికి తెలియును. చ్యవనుడు మహా మహిమవంతుడనియు తెలియును. అందుకనియే "నీ తపముమహిమ తెలియక నా కూతు రిట్లు చేసెను. తరుణులు ఎఱుకగలరా?" అనియెను. వయసులో నున్నవారు కన్నుమిన్నుగానక ప్రవర్తింతురని చెప్పినాడు. తన కూతునం దొక్క వయోదోషమే తప్ప మరి యే దోషము లేదని చెప్పెను. మునికి పరిగ్రహయోగ్య యని చెప్పెను.

ఇట్లీ కథ ప్రసన్నమైనది. మరియు తరువాతి కథ ప్రసన్నమైన తెర గెట్టి దనిన? సుకన్య చ్యవనునకు పరిచర్య చేయుచుండెను. ఋషి [illegible] అతనియందు సుకన్య కామోపభోగముల ననుభవించుట లేదు. ఆమెమన సెట్లున్నదో? ఆమె తనకంటె నన్యుని వరించుచున్నదో? యౌవనవంతుని వరించుచున్నదో? సౌందర్యవంతుని వరించుచున్నదో?

ఋషికి తెలియదు. అందుచేత నత డశ్వినీదేవతలను సుకన్యవద్దకు పంపించెను. వారు సుకన్యకడ్డకు వచ్చి నీ వింత యందకత్తెవు. వృద్ధుని పెండ్లాడి నీ యౌవ్వనము వృథాచేసితివి. నీయౌవనమునకు, నీసౌందర్యమునకు తగినవరుని వరియింపుము. మేము వాని తెచ్చెదమనిరి. ఆమె కోపించి పోయి భర్తతో చెప్పెను. ఋషి యాశ్వినులమీద కోపించలేదు. వారిని తానే పంపించినాడుగా! అందుచేత భార్యతో నీవు పోయి యాశ్వినులమాటల కొప్పుకొనుమని పంపించెను. వారన్నమాట లేమి? ఆమె యెవ్వనినో కోరుచున్నచో వానిని తెచ్చిపెట్టుదుమనికదా? ఈమె పోయి యెవ్వనినో కోరలేదు. నాకు యౌవ్వనవరం గావింపుమని కోరుకొనెను. నాభర్తను యౌవనవంతుని జేయుమని యర్థము. అశ్వినులతో చ్యవనుడును చెరువులో ప్రవేశించెను. ముగ్గురు నవయౌవ్వనులై వెలికివచ్చిరి. అశ్వినులదివరకే నవయౌవనులు. చ్యవను డొక్కడే యిప్పుడు నవయౌవ్వను డైనది. అట్లు వచ్చి మా ముప్పురిలో నీవలచు వానిని వరియింపుమనిరి. మెట్టమెందట నాశ్వినులు నీవయస్సునకు, రూపమునకు దగినవానిని కోరుకొమ్మనిరి. ఆమె తనకు నః యౌవనవరునే కోరెను. అశ్వినీదేవతలు మహాసౌందర్యవంతులు. చ్యవనుడు సౌందర్యవంతుడు గాడు. అప్పుడు యౌవ్వనవంతుడు మాత్రమయ్యెను. తనభర్తకు నశ్వినీదేవతలు సౌందర్యమును తెచ్చిపెట్టలేరు. వారికి చేతనైనది తన భర్తకు యౌవ్వనముమాత్రము కల్పించుట. ఆమెకు సౌందర్యమునందాశ లేదు. తనభర్త యౌవ్వనవంతుడు కావలెనని కోరిక. అతనికి యౌవ్వనము లేకపోయినను తనకు దిగులు లేదు. ఎట్టివాడైనను తన భర్త భర్తయగుటయే యామెకు కావలెను. ఆతనిని తాను సేవించుచుండును. వారు ముప్పురు నేకాకృతులు కాలేదు. నవయౌవనులు మాత్రమే యయిరి. తనభర్త తెలియుచునే యుండెను. ...కంటె యాశ్విను లెక్కువ యందగాండ్రనుట కనుపించుచునే యున్నది. కాని తనభర్తనే కోరెను. అంత చ్యవనము ర్షి యాశ్వినులను సోమపీథులను చేసెను. తన మామగారిచేత నొక యజ్ఞముచేయించి వారిని సోమార్హులనుగా చేసెను. తనకు భార్యనిచ్చిన రాజునందు వానిచేత యజ్ఞముచేయించి తన దయ చూపించెను. తన భార్యయొక్క పాతివ్రత్యము తెలిసికొనుటకు తన కుపయోగపడి తనకు యౌవ్వనము ప్రసాదించిన యాశ్వినులను సోమార్హులను చేసెను.

ఇది ప్రసన్నమైన కథ. ఈప్రసన్నత యెట్లు సంపాదింపబడినది? ఈకథయంతయు పదునాల్గు పద్యములలో నున్నది. దీనినే నిరాదరత పెడ ద్రోవ యాభిముఖ్యముతో శాఠకులు జాగ్రత్తగా చూడవలెనని మనవి. కాదనిన దేనినైన కాదనవచ్చును. కథను వేయివిధములుగా చెప్పవచ్చును. ఇతర కథాకథనములయొక్క వైఖరినుండి యీ వైఖరిలోనున్న విశేషము భావించవలయునని ప్రార్థన. కథను చెప్పికొని పోవుచు కథలోని స్థూలాంశములు మాత్రమే పైకి కనిపింపజేయుచు జాగ్రత్తగా చదివినచో వెనుక నెంతయో యుండుట తెలియునట్లు నిర్మించిన యొక విచిత్రమైన శిల్పము నన్నయ్యగారిది. ఊరకే కథ చదువుచుపోవుచుండగా చ్యవనఋషి సుకన్యమీద కోరికతో నిట్లు చేసెనని స్ఫురించదు. కథాగతభిన్నాంశములు సమకూర్చికొన్నచో నది వ్యక్తమగును. ఋషి కట్టి కోరిక లేనిచో నాకోరిక యీ పద్ధతిగా సాధించుకొనవలయునని తలంచనిచో సుకన్యను శపించియుండును. ఆమెకు కనిపించియుండును. పుట్టత్రవ్వించి యేమియు కనిపించక యామె వెడలిపోయెను. రాజు వచ్చునప్పటికి ఋషి యెదురుగా కూర్చుండి యుండెను. కూర్చుండి రూపయౌవనగర్వితయైన యామెను పరిగ్రహించిగాని క్షమింపననెను. రాజు తన కోర్కెను పెడచెవిపెట్టువాడు కాడని తెలియును. ఇందువలన చ్యవనుడు సుకన్యను పెండ్లియాడనెంచి తదనుకూలముగ నిది యంతయుసంతరించెనని యనుమీయమాన మగుచున్నది.

మరి యీకథయొక్క రెండవభాగమునందు నిట్లే యశ్వినీదేవతలు చ్యవనుని ప్రోద్బలమువలననే సుకన్యను పరీక్షించుటకు వచ్చిరనికూడ నచట చెప్పిన భిన్నాంశములచేత వ్యక్తమగుచున్నది. ఆమె నేను శర్యాతికూతురను, చ్యవనుని భార్యనని చెప్పగా వారు నవ్వి "యిట్టి రూపవిభ్రమంబులు గలసి యీ ముసలివానికా వరించునది? నీ వయోరూపములకు తగినవానిని వరి

యుంపుము. మేము వానిని తెచ్చెద" మనిరి. అంతియే కాని "మేము యౌవ్వనవంతులము. మేము సౌందర్యవంతులము. మమ్ము పెండ్లాడు" మనలేదు. వారు యాదృచ్ఛికముగా రాలేదు. ఆమెయందమును చూచి మోహించి రాలేదు. చ్యవనునిపంపున నామెను పరీక్ష చేయుటకు వచ్చినవారు. మరియు నీ వయోరూపములకు తగిన వరుని కోరుకొమ్మనిరి. కాని నీకు తగిన వరుని కోరుకొమ్మనలేదు. అట్లనవచ్చును. ఇట్లనవచ్చును. ఇట్లనుటచేత నామెకు తన జీవునియందు దేహభ్రాంతిగాని, దేహగతావస్థాభ్రాంతిగాని లేదని తెలియుచున్నది. ఇచట నొక సంగతి చెప్పవలయును. ఇట్టి యర్థములు చెప్పినప్పుడు కొందరు పేరు విజ్ఞులైన వారుకూడ నీవు చెప్పెడు నర్థములు గాని కవి యుద్దేశించినవి కావందురు. ఇట్లన్నచో కాళిదాసాదు లందు చెప్పెడు విశేషము లన్నియు వ్యర్థము లగును. వట్టి తాత్పర్యమే నిలచును. వ్యంగ్యాదులకు, ధ్వనులకు ప్రసక్తి లేకుండ పోవును. కవితారచన యన్నది యొక విద్య కాకపోవును. బహువిధములైన శిల్పముల ప్రసక్తి లేకపోవును. తెలిసి చేసెడు శిల్పమునకు విలువ తక్కువ యగును. ఇంగ్లీషు నేర్చినవారుకూడ *'conscious artist'* అనియే వాడుదురు.

అంత సుకన్య భర్తకడకు పోయి యశ్వినుల మాటలు చెప్పెను. లోకసామాన్యముగా నైనచో తన భార్యతో నిట్లన్న వారిమీద భర్తకు కోపము రావలయును. ఆయనకు కోపము రాలేదు సరిగదా, వారు చెప్పిన మాటల కొప్పుకొను మనెను. దీనిచేతగూడ నశ్వినీదేవతలు చ్యవనునిపంపుననే వచ్చినవా రనిగూడ తెలియుచున్నది. వారు చ్యవనునిపంపున వచ్చి రనుట యుపలక్షకమైన మాట. అట్లు రాకపోయినను చ్యవనుని యందు భక్తి కలవారై యతనిచేత నేదో లాభము పొందుటకు వచ్చి రనియు, నది చ్యవనునికిగూడ లాభమే యనియు నా దేవతలు నా ఋషియు పరస్పర మంతరంగమునందు తెలిసినవా రనియైన నిస్సందేహముగ జెప్పవచ్చును. కానిచో నిట్లు జరుగదు. వారు సుకన్యతో నవిస్పష్టమైన మాట యనిరి. ఆమె భర్తతో చెప్పుటకు వెళ్లెను. ఈలోపుగా వారు భయపడి పారిపోవలయును. "ఒడంబడు మని పంచిన"అని నన్నయ్యగారు వ్రాసిరి. అశ్వినులు సుకన్యతో మాట్లాడినది చ్యవనుని యింటిముంగిట కాదు. మరి కొంత దూరముగా నని యర్థమగుచున్నది. అందుచేత వారు పారిపోవచ్చును.

ఈ రీతిగా నన్నయ్యగా రొక పథకము వేసికొని తాను వేసికొనిన పథకము తాను చెప్పునట్టి వైఖరిచేత, నందులో మాటలాడు పాత్రలయొక్క యల్పములైన మాటలచేత వారి శీలము మొదలైనవి స్ఫురింపజేయుచుండును. ఇది కథాధ్వని యనవచ్చునేమో? ఏ కవియందైనను నే కావ్యమునందైనను నా పాత్రలయొక్క ప్రసంగముచేత వారి శీలము తెలియు నని చెప్పవచ్చును. అది యంగీకార్యమే. కాని నన్నయ్యగారియందు నీ విషయమునందు గూడ నొక వైలక్షణ్యము, విశేషము గూడ గలవు. ఇచ్చట పాత్రలు చాల కొద్దిగా మాట్లాడుదురు. వానినుండి బహ్వర్థములు స్ఫురించును. వీరంద రెవరో దేవతాంశములైన యొక నియమసంయుతులు, నియమితవాక్కులు. ఒక పాత్ర మాట్లాడినదానివలన నా పాత్రయొక్క శీల మితరుల శీలమునుగురించి యా పాత్రలయొక్క యూహా లితరమహాకవులయందు కన్పించుట యున్నది. నన్నయ్యగారియం దట్లు కాదు. ముగ్గురు నలుగురు కలిసి కొద్ది మాటలు మాట్లాడెదరు. దానివెనుక నొక పెద్ద కథ, యొక పథకమెంతయో పెట్టుకొని ప్రవర్తించిన ప్రవర్తనయంతయు నీ కొంచెపు మేరలో ప్రకాశించుట. ఇది యున్నది. ఇదియే యీయనలో నారయవలయు ననుటలో నిదియు ప్రసన్నకథాకలితార్థయుక్తి యనుటలో నిదియు నై యుండవలయును.

ఇట్లు తా నొక పెద్ద కథ వేసికొని యా కథకు పీఠికగా నేదియు చెప్పడు. మరి యెవ్వరైననో చెప్పుదురు.

ఈ పది పద్యములలో సుకన్య చేసిన యొక్క పని, యామె యనిన మూడు మాటలు, నామెనుగురించి యితరు లనిన మూడు మాటలు—వీనితో నొక విచిత్రమైన సుకన్యాసృష్టి చేసెను.

ఆమె చేసిన పని యొకటియే. చ్యవనుడు తపస్సు చేయుచున్నచోట పుట్ట పెరిగెను. దానిచుట్టు తీగలు, పొదలు పెరిగి యా పుట్టయే కన్పించుట లేదు. అటువంటి చోటికి సుకన్య పోయి యా తీగలు, పొదలు లాగివేసి పుట్టలో తొంగిచూచినది. చూచిననే కదా, మునికన్నులు మిణుగురులవలె కన్పించుట. వనములో విహరించు రాచకన్యకు నా తీగలు పొదలు కదలించి లోనికి పోయి పుట్టకన్నములో తొంగి చూచుట యెందులకు? ఇది యౌవనగర్వము. సౌందర్యగర్వము. కొంచెము చిలిపితనము. నిర్భయత్వము. సాహసము. ఈమె ఇట్టిదని నన్నయ్య చెప్పడు. ఆమె రూపయౌవన గర్విత, యని ముని యామెతండ్రితో ననును. ఆ యొక్క మాటయే యీ కథకంతకు పునాది. మరి యింకొక కవి యైనచో "రూపయౌవనగర్వితయైన యక్కన్య యౌవనమదముచేత నా వల్లీగుల్మములు తొలగించి నిర్భయముగా నా వల్మీకరంధ్రములలో చూచినది" అని వ్రాసియుండును. నన్నయ్యగారట్లు వ్రాయక పాఠకు డూహించుకొనుటకే వదలిపెట్టును. అట్టి పని యొక బాలిక చేయుచున్న దనగా పాఠకు డూహించుకొనవలయును. ఆ పాత్రయొక్క స్వభావమును తాను చెప్పడు. ఆ పాత్రయొక్క మాటలచేత నామెస్వభావము నూహింపజేయుటయే సుచరితపథము. ఇచట నట్లు కాదే. ఆ పాత్ర యొక పనిని జేయును. అది లోకసామాన్యముగా కనిపించును. విచారించినచో నొక యసామాన్యతగూడ భాసించును. ఈ యసామాన్యత నన్నయ్యగారిచేత నుద్దిష్ట మైనది. పైగా నది కథకు ప్రాణభూతమైనదిగా చేయబడును. అది పాఠకునకు ప్రసన్న మగుటకు సాధనములుగా పై కథలో పెలుచోట్ల కొన్ని వాక్యములు నిక్షేపించును. వీని యన్నిటియొక్క సమాహారభావనచేత నాయన చెప్ప దలచుకొన్న కథలో నున్న రహస్యము ప్రసన్న మగును.

ఇట్లామె నిర్భయురాలు, యౌవనగర్వము చేత సాహసములు చేయునది. కాగా సైన్యనిరోధకారణ మెరుగక తండ్రి విచారించుచుండగా, తానే పోయి యిట్లు చేసితి, నిది కారణ మగునేమో యని చెప్పుచున్నది. తా నొక పుట్ట చూచి యందులో మిణుగురు లేమో యని గ్రొప్పించుట, యచట నేమియు కన్పింపకపోవుట యిది యంతయు లోకసామాన్యమైన విషయము. సైన్యనిరోధకార్యమునకు దీనియందు కారణత్వ మెట్లు? ఏదో కాకూడదా యనుకొన్నదా? లేదా, యది యే ఋషియొక్క యావాసమో, యొక దేవవాసమో యనుకొన్నదా! అనుకొన్న దనుట సమంజసముగా కనిపించుచున్నది. అట్లనుకొనుట న్యాయ్యముకూడను, ఆమె యట్లనుకొన్న దని యీయన చెప్పడు. కాని యామె తండ్రితో వచ్చి యిట్లు చెప్పుటచేత దానిని మన మూహించవచ్చును. ఊహించినచో సుకన్యశీల మెట్టి దనుచున్నది? ఆమె యౌవనముచేత సాహసక్రియలు చేయునదే గాని ఋషిదేవతాగతనిరాదరణబుద్ధి కాదు. తనతండ్రిసైన్యము దుఃఖిత ముగుచుండగా నూరకుండు బుద్ధిహీనురాలు కాదు. చెప్పినచో తండ్రి కోపపడునేమో యని భయముచేత నల్పమైనదైన నొక సంగతి దాచునది కాదు. యథార్థమైన ప్రవర్తన గలది. దైవభీతి గలది. ఋషులయందు భక్తి గలది. తండ్రి యెంత చెప్పిన నంత చేయును. పరమోత్తమురాలైన స్త్రీరత్నము. ఆ ముసలివానికి తండ్రి తన్నీయగా పోయి తత్పరిచర్య చేయుచు నుండి పోయినది. ఈమెయందు కొక్క రూపయౌవనగర్వము తక్క మరి యొక్క దుష్టగుణమే లేదు. ఆ గర్వము కూడ యా సౌందర్యగుణము నీ యౌవనావస్థను విడి విడిగా చూచి తన యాత్మవస్తువునకు వానికిని సంబంధము లేనంత విస్పష్టముగా తెలిసికొన్నదా యన్న యూహా కల్పించెడి యొక యోగినివంటిది.

ఆమెతండ్రికూడ నీ తపప్రమహిమ తెలియక చేసినది, తరుణి యెరుకగలదా? యనుటలో కూడ సద్గుణము తెలిసినవాడే. ఆమె తనమాటకు జవదాటదని, ఋష్యాదులయందు భక్తి గల దని యతనికి తెలియును.

అశ్వినీదేవతల కథాభాగములో నామె ప్రవర్తన మరియు చిత్రముగా నున్నది. వారట్లనగా నామె సహింపక "చ్యవనునందు నాకు సంతత ప్రీతియై యుండ నిట్లు పలుకు టుచిత మగునే!"

యనియే యన్నది. భర్త వారిమాటల కొప్పు కొనుమనగా "అది యేమయ్యా, నాకు నీయందే ప్రీతి" యనలేదు. వివేకవతి; భర్తయభిప్రాయము తెలిసి కొన్నది. అవతలివారు దేవతలు. తన భర్త యౌవన వంతు డగుట తన కిష్టాపత్తి. పోయి వారితో నాకు "నవయౌవనవరుం గావింపు" డన్నది. ఒక మహర్షి భార్య కావుటకు తగిన యాత్మజ్ఞానము, వివేకము ఎంతవరకు రుచితమో యంతవరకే మాటాడుట మొదలైన లక్షణములు భాసించుచున్నవి.

ముగ్వురు నవయౌవనులను చూచి తనభర్తనే వరియించుట యామెపాతివ్రత్యము, భర్తృగతేతరగుణ మిథ్యావాంఛలేని యచ్ఛమైన శీలము చెప్పుచున్నది. ఆమె భర్తనే వరియించిన దనుటచేత నామెకు సౌందర్యగుణమునందు నిష్ఠ లే దన్నది వ్యజ్యమాన మగు చున్నది. మరి యౌవనమం దెందు కుండవలయును. ప్రజాసంతునవ్యవచ్ఛిత్తి విషయము. అందుచేత నున్నది.

ఆమె పుట్టలో మునికనులు చూచి మిణుగురు పురుగు లేమో యనుకొనువేళ నన్నయ్యగారు పద్య మారంభించుచు కందపద్యమును 'విద్యుల్లతాంగి' యని యారంభించెను. ఇట్లే యేల యారంభింపవలయును? ఈ సంశ్లిష్టాక్షరప్రాస మెందులకు? ఒకటి యామె సౌందర్యగర్వ మిందు భాసింపజేయుటకు; రెండ వామె యున్నచోట నుండలేదు; అధిక యౌవనోత్సాహము చేత నటునిటు తిరుగును; ఏదియో యొక పని చేయు చుండు ననుటకు.

'సద్యస్సంజాతబుద్ధిసంభ్రమ యగుచున్' అని వ్రాసె. అప్పుడే పుట్టిన బుద్ధియొక్క సంభ్రమము కలది. అందుకనియే పుట్ట త్రవ్వించినది. వయసులో నున్న బాలిక. రాచకూతురు. ఎప్పు డేది తోచిన నది చేయుట యలవాటు. కాని సహజముగా దివ్యశీలవతి. పట్టి యవస్థావికారముమాత్రమే చెప్పబడినది.

ఇట్లు బహువిషయము లూహగమ్యములై యేమియు లే దనుకొనుటకు వీ లున్న పది పద్యముల లోని కథలో ననంతవిషయములు నొక విచిత్రమై కథయు లో నారసినకొలది దేదీప్యమానముగా ప్రసన్న మగుచున్నది. అందు కనియే కాళిదాసాదులుకూడ నిట్లు చేయలే దని చెప్పసాహసించుట.

కథాకథనము దీనివి పోలినది మరి యొకచోట కనిపించ దేమో అని సందేహము. కొద్దిలో నాకు నిశ్చ యము. కథను అనేకవిధములుగా చెప్పవచ్చును. వాని కంటె నీ కథాకథనపై ఖరి చాల యుత్కృష్టమైన దని నాకు తోచినది మరి యెప్పుడో వ్రాసెదను.



# శ్రీనాథుని జాతీయములు

శ్రీ బండారు తమ్మయ్య

శ్రీనాథకవిసార్వభౌమునకు హృదయంగమమగు కవితాస్వరూపము భీమఖండావతారికలో నాతడు రచించిన యీ క్రింది పద్యమువలన దెలియనగును :

"హరచూడాహరిణాంకవక్రతయు గా
    లాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీ
    పర్యంతకాఠిన్యముల్
సరసత్వంబును సంభవించె ననగా
    సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండు గవిరా
    జీగేహరంగంబులన్"

కొందఱాలంకారికులు వక్రోక్తిని వ్యంగ్యార్థప్రదంబగు నొక యలంకారముగా నిర్వచించిరి. కుంతకు డను మఱియొక యాలంకారికుడు దాని కొక విలక్షణతను గల్పించి—

"లోకోత్తరచమత్కార
కారి వైచిత్ర్యసిద్ధయే,
కావ్యస్యాయ మలంకారః
కోఽప్యపూర్వో విధీయతే.

శబ్దార్థౌ సహితౌ వక్ర
కవివ్యాపారశాలినీ,
బంధే వ్యవస్థితౌ కావ్యం
తద్విదాహ్లాదకారిణీ.

ఉభా వేతా వలంకార్యౌ
తయోః పున రలంకృతిః
వక్రోక్తిరేవ వైదగ్ధ్య
భంగీ భణితి రుచ్యతే.

కవివ్యాపారవక్రత్వ
ప్రకారాః సంభవంతి షట్
ప్రత్యేకం బహవో భేదా
స్తేషాం విచ్ఛిత్తిశోభినః.

వాగ్వల్ల్యాం పదపల్లవాస్పదతయా
    యా వక్రతోద్భాసినీ
విచ్ఛిత్తిః సరసత్వసంపదుచితా
    కాప్యుజ్జ్వలా జృంభతే
తా మాలోచ్య విదగ్ధషట్పదగణై
    ర్వాక్యప్రసూనాశ్రయం
స్ఫారామోదమనోహరం మధునవో
    త్కంఠాకులం ప్రీయతాం."

మున్నగు శ్లోకములలో దాని స్వరూపమును వివరించియున్నాడు. కుంతకుని మతముప్రకారము కావ్యమునకు శోభను, జాజ్వల్యమును గూర్చు యమకానుప్రాసాది శబ్దాలంకారసామగ్రి యించుమించుగ వక్రోక్తిక్రిందనే గణింపదగును. శ్రీనాథుడు పై పద్యమున జేర్కొన్న వక్రత కుంతకమతము ననుసరించినదే యని కొందఱ యభిప్రాయము. అత డుద్దేశించిన కాఠిన్యము గాఢసమాసబంధ మని గణింపదగును. అది శ్రీనాథుని కృతులలో బలుమాఱులు ప్రత్యక్షమగుచుండును. ఇక మూడవ పాదమున నాతడు వచించిన " సరసత్వము " సర్వజనాహ్లాదగ్రాహకము. అది బహుముఖ మయినది. ఇట్టి దట్టి దని నిర్వచింపరానిది. కావ్యమునకు రసమే జీవముగదా! అది బ్రహ్మానందసదృశ మయినది. శ్రీనాథుని కవిత్వమున నీ సరసత్వము పరిపరివిధముల వెల్లివిరియుచుండును. "పలుకునుడికారమున నాంధ్ర భాష యండ్రు" అని సంస్కృతపద సంభరితమయిన యీ మహామహుని కవితకు సాంగ్రత్వమునుగూడ సాంద్రముగ సంఘటించిన తెలుగునుడికారంపు సొంపులతో నింపులుతులకించు జాతీయములుగూడ ప్రధానస్థానమలంకరించుచున్నవని చెప్పదగును. లోకసమ్మోహనకరములగు నీతని పద ప్రయోగముల విన్నాణంపు మెఱుంగులను సముచితస్థలముల సరసతరంబుగ మేళవింపబడు తీరుతీయములు గల జాతీయములుగూడ వెనలేని శోభ నొనగూర్చుచుండును. ఉపలబ్ధములయిన శ్రీనాథుని

కృతులలో నించుమించుగ స్వతంత్రరచన మని చెప్ప దగినది హరవిలాసము. తక్కినవి చాలవఱకు సంస్కృత గ్రంథముల కనువాదములు. అయినను శ్రీనాథుని నేర్పుకలిమి నివిగూడ కేవలానువాదములుగ గాక స్వతంత్రరచనములవలెనే మూలమునకు వన్నెపెట్టు పలు తెఱంగులను మెఱుంగులతో దుఱంగలించుచుండును. జాతీయతను వెల్లార్చు జాతీయములు హరవిలాసమునందు గొంత హెచ్చుగ గానవచ్చినను శ్రీనాథు డట్టి వానిని దక్కిన కృతులలోగూడ సుచితస్థలముల వెలయించియున్నాడు. అట్టి జాతీయములను, గొనబుందనము మెఱయ వాని వాత డుపయోగించిన తావులను గొన్నింటిని దిలకింతము.

మాయాజంగమరూపమును దాల్చిన శివుడు నిజవ్రతోద్యాపనమునకయి చిఱుతొండని నరమాంసము నర్థించు ఘట్టము

"అందునదిభూతిదొలుత నీ యనుగుభార్య
యందుకొనువాడ వీవు వనంతరమున
నాలు మగడును నొక కత్తు కైనగాక
యిట్టిధర్మంబు మిన్నక యేల కలుగు ?
పాడయినట్టి చిత్త మొక
పాటున నిల్వక మాటిమాటి క
ట్టాడుచు నుండుగాన తన
యాత్మయు నుం దన కిట్టిదో నవం
గూడునో కూడదో యెందిరి
కోర్కి యెఱుంగుట యెట్టుకట్టితూ
చూడగ దోసకాయలె? వి
శుద్ధయశోధన యన్యచిత్తముల్."
(హర. ౨-౬౩)

ఈ రెండవది పలనాడుపాకనాటిసీమలలో నిప్పటికిని వాడుకయందున్నది.

పాకశాలయందున్న సిరియాలకుమారునిం గాంచి యా మాయావేషధారి వచించునది—

"దానవుడుగాక వాడేటి తండ్రి చెపుమ !
చెక్కుగీటిన వసపల్కు చిఱుతవాని
బత్తు డొక్కడు మధుపానమత్తు డగుచు
నిన్ను వేడిన జంపంగ నిశ్చయించె."

మాయజోగితవేషమున బార్వతి చిరుతొండని సతి తిరువెంగనాంచి గాంచి పలుకునది—

"ఆవగింజంత బూది పై నలదికొనిన
వెలది గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టు
గటకటా ! యెట్లు తన బుద్ధి కాటగలియ
నిసువు జంపంగ నెంచెనో నీ మగండు.

కానంకుగాక కన్నులు
తా నేమిటివాడు నీదు తనయుని జంపన్
మానవతీ 'మగవాడో
మ్రానో' యనుమాట నేటిమాటయె చెపుమా."

సిరియాలుని జంపి యాతని మాంసంబుతో భోజనంబు వడ్డించిన తరువాత బుత్త్రులులేనివానియింట భుజింప నని తంటాలుపెట్టుఘట్టమున—

"నీ యుత్తమాంగన యెలుంగెత్తి నలుదిక్కులం బిలుచునది కుమారుండు వచ్చెనేని బంతిం బెట్టుకొని భుజింతము. రాకుండెనేని యేమును నీముసలి యవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు పలికి నీ పడ్డపాటు గొడ్డేలుగా జిడ్డుపఱపంగలవార మే ? "

ఇచ్చట "పడ్డపాటు గొడ్డేలుగా" అనునది జాతీయము పలుకుబడియే. "గొడ్డేలు" అనునది వృథా (గొడ్డుపోవు) యని యర్థమిచ్చు నవ్యయము. శ్రీనాథుని యవసానచాటువులలోని "బొడ్డుపల్లెను గొడ్డేలు మోసపోతి" అను పాఠమును "బొడ్డుపల్లెను (బొడ్డుపల్లె + అను) గొడ్డేలి (గొడ్డు + ఏలి) మోసపోతి" అని యసంగతముగ నపపాఠముతో జదివి "గొడ్డేలు "అను జాతీయపదప్రయోగసారస్యమును గుర్తింపజాలకున్నారు.

"ఒడ్డారించి విషంబున
కడ్డము నమదెంచి కావ నధిపులు లేమిన్
గొడ్డేలు మ్రందిరాలన
బిడ్డన వెడలేక జనులు పృథ్వీనాథా"

అను పోతన భాగవతప్రయోగమును, ఒడ్డెయుప్పర వాని యోజ సీరాము లొడ్డక కీర్తుల నొందెద ననుచు గొడ్డేలు చెడిపోరి గూలి రామయ్య" అను సిరుపర్తి సోమనాథుని ద్విపద ప్రభులింగలీలప్రయోగమును నీ శబ్దార్థమును విశదీకరించును.

దేవతలు తారకాసురునివలన గలిగిన ముప్పులను బ్రహ్మకు నివేదించుపట్టు—

# శ్రీనాథుని జాతీయములు

శ్రీ బండారు తమ్మయ్య

శ్రీనాథకవిసార్వభౌమునకు హృదయంగమమగు కవితాస్వరూపము భీమఖండావతారికలో నాతడు రచించిన యీక్రింది పద్యమువలన దెలియనగును :

"హరచూడాహరిణాంకవక్రతయు గా
 లాంతిస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధరస్ఫుటతటీ
 పర్యంతకాఠిన్యముల్
సరసత్వంబును సంభవించె ననగా
 సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు వహించుచుండు గవిరా
 జీగేహరంగంబులన్"

కొందఱాలంకారికులు వక్రోక్తిని వ్యంగ్యార్థప్రదంబగు నొక యలంకారముగా నిర్వచించిరి. కుంతకుడను మఱియొక యాలంకారికుడు దాని కొక విలక్షణతను గల్పించి—

"లోకోత్తరచమత్కార
కారి వైచిత్ర్యసిద్ధయే,
కావ్యస్యాయ మలంకారః
కోఽప్యపూర్వో విధీయతే.

శబ్దార్థా సహితా వక్ర
కవివ్యాపారశాలినీ,
బంధే వ్యవస్థితా కావ్యం
తద్విదాహ్లాదకారిణీ.

ఉభావేతా వలంకార్యౌ
తయోః పున రలంకృతిః
వక్రోక్తిరేవ వైదగ్ధ్య
భంగీ భణితి రుచ్యతే.

కవివ్యాపారవక్రత్వ
ప్రకారాః సంభవంతి షట్
ప్రత్యేకం బహవో భేదా
స్తేషాం విచ్ఛిత్తిశోభినః.

వాగ్వల్ల్యాం పదపల్లవాస్పదతయా
 యా వక్రతోద్భాసినీ
విచ్ఛిత్తిః సరసత్వసంపదుచితా
 కాప్యుజ్జ్వలా జృంభతే
తా మాలోచ్య విదగ్ధషట్పదగణై
 ర్వాక్యప్రసూనాశ్రయం
స్ఫారామోదమనోహరం మధునవో
 త్కంఠాకులం ప్రీయతాం."

మున్నగు శ్లోకములలో దాని స్వరూపమును వివరించియున్నాడు. కుంతకుని మతముప్రకారము కావ్యమునకు శోభను, జాజ్వల్యమునుగూర్చు యమకానుప్రాసాది శబ్దాలంకారసామగ్రి యించుమించుగ వక్రోక్తిక్రిందనే గణింపదగును. శ్రీనాథుడు పై పద్యమున చేర్కొన్న వక్రత కుంతకమతము ననుసరించినదే యని కొందఱ యభిప్రాయము. అత డుద్దేశించిన కాఠిన్యము గాఢసమాసబంధ మని గణింపదగును. అది శ్రీనాథుని కృతులలో బలుమాఱులు ప్రత్యక్ష మగుచుండును. ఇక మూడవ పాదమున నాతడు వచించిన " సరసత్వము " సర్వజనాహ్లాదగ్రాహకము. అది బహుముఖ మయినది. ఇట్టి దట్టి దని నిర్వచింపరానిది. కావ్యమునకు రసమే జీవముగదా! అది బ్రహ్మానందసదృశ మయినది. శ్రీనాథుని కవిత్వమున నీ సరసత్వము పరిపరివిధముల వెల్లివిరియుచుండును. "పలుకునుడికారమున నంధ్ర భాష యందు" అని సంస్కృతపద సంభరితమయిన యీ మహామహుని కవితకు నాంధ్రత్వమునుగూడ సాంద్రముగ సంఘటించిన తెలుగునుడికారంపు సొంపులతో నింపులుతులకించు జాతీయములుగూడ ప్రధానస్థానమలంకరించునని చెప్పదగును. లోకసమ్మోహనకరములగు నీతని పద ప్రయోగముల విన్నాణంపు మెఱుంగులకు సముచితస్థలముల సరసతరంబుగ మేళవింపబడు తీరుతీయములు గల జాతీయములుగూడ నెనలేని శోభ నొనగూర్చుచుండును. ఉపలబ్ధములయిన శ్రీనాథుని

కృతులలో నించుమించుగ స్వతంత్రరచన మని చెప్ప దగినది హరవిలాసము. తక్కినవి చాలవఱకు సంస్కృత గ్రంథముల కనువాదములు. అయినను శ్రీనాథుని చేర్పుకలిమి నివిగూడ కేవలానువాదములుగ గాక స్వతంత్రరచనములవలెనే మూలమునకు వన్నెవెట్టు పలు తెఱంగులగు మెఱుంగులతో దుఱంగలించుచుండును. జాతీయతను వెల్లార్చు జాతీయములు హరవిలాసము నందు గొంత హెచ్చుగ గానవచ్చినను శ్రీనాథు డట్టి వానిని దక్కిన కృతులలోగూడ సుచితస్థలముల వెల యించియున్నాడు. అట్టి జాతీయములను, గొనబుం దనము మెఱయ వాని నాత డుపయోగించిన తావులను గొన్నింటిని దిలకింతము.

మాయాజంగమరూపమును దాల్చిన శివుడు నిజవ్రతోద్యాపనమునకయి చిఱుతొండని నరమాంసము నర్థించు ఘట్టము

"అందునదిభూతిదొలంతె నీ యనుగుభార్య
యందుకొనువాడ వీవు ననంతరమున
వాలు మగడును నొక కుత్తుకైనగాక
యిట్టినర్మంబు మిన్నక యేల కలుగు ?
పాడయినట్టి చిత్తమెంక
పాటున నిల్వక మాటిమాటి క
ట్టాడుచు నుండుగాన తన
యాత్మయు నుం దన కిట్టిదో వనం
గూడునో కూడదో యెదిరి
కోర్కె యెఱుంగుట యెట్టుకట్టియూ
చూడగ దోసకాయలె? వి
శుద్ధయశోధన యన్యచిత్తముల్."
(హర. ౨-౬౩)

ఈ రెండవది పలనాడుపాకనాటిసీమలలో నిప్పటి కిని వాడుకయం దున్నది.

పాకశాలయం దున్న సిరియాలకుమారునిం గాంచి యా మాయా వేషధారి వచించునది—

"దానవుడుగాక వాడేటి తండ్రి చెపుమ!
చెక్కగీటిన పసపల్కు చిఱుతవాని
బత్తు డొక్కడు మధుపానమత్తు డగుచు
నిన్న వేడిన జంపంగ నిశ్చయించె."

మాయజోగితవేషమున పార్వతి చిరుతొండని సతి తిరువెంగనాంచి గాంచి పలుకునది—

"ఆవగింజంత బూది మై నలదికొనిన
వెలది గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టు
గటకటా! యెట్లు తన బుద్ధి కాటగలియ
నిసువు జంపంగ నెంచెనో నీ మగండు.
కానంకుగాక కన్నులు
తా నేమిటివాడు నీడు తనయుని జంపన్
మానవతీ 'మగవాడో
మ్రానో' యనుమాట నేటిమాటయె చెపుమా."

సిరియాలుని జంపి యాతని మాంసంబుతో భోజనంబు వడ్డించిన తరువాత బుత్త్రులులేనివానియింట భుజింప నని తంటాలుపెట్టుఘట్టమున—

"నీ యుత్తమాంగన యెలుంగెత్తి నలు దిక్కులం బిలుచునది కుమారుండు వచ్చెనేని బంతిం బెట్టుకొని భుజింతము. రాకుండెనేని యేమును నీముసలి యవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు పలికి నీ పడ్డపాటు గొడ్డేలుగా జిడ్డుపఱపంగలవార మే?"

ఇచ్చట "పడ్డపాటు గొడ్డేలుగా" అనునది జాతీయముగ పలుకబడియె. "గొడ్డేలు" అనునది వృథా (గొడ్డు వోవు) యని యర్థమిచ్చు నవ్యయము. శ్రీనాథుని యవసానచాటువులలోని "బొడ్డుపల్లెను గొడ్డేలు మోసపోతి" అను పాఠమును "బొడ్డుపల్లెను (బొడ్డుపల్లె + అను) గొడ్డేలి (గొడ్డు + ఏలి) మోసపోతి" అని యసంగతముగ నపపాఠముతో జదివి "గొడ్డేలు "అను జాతీయ పదప్రయోగపారస్యమును గుర్తింపజాలకున్నారు.

"ఒడ్డారించి విషంబున
కడ్డము సనుదెంచి కావ నధికులు లేమిన్
గొడ్డేలు మ్రందిరాలన
బిడ్డన చెడలేక జనులు పృథ్వీనాథా"

అను పోతన భాగవతప్రయోగమును, ఒడ్డెయుప్పర వాని రోజ నీరాను లొడ్డుక కీర్తుల నొందెద ననుచు గొడ్డేలు చెడిపోయె గూలి రామయ్య" అను పిడుపర్తి సోమనాథుని ద్విపద ప్రభులింగలీలప్రయోగమును నీ శబ్దార్థమును విశదీకరించును.

దేవతలు తారకాసురునివలన గలిగిన ముప్పులను బ్రహ్మకు నివేదించుఘట్టు—

"పడితిమి తుక్కాలుం బడని పాటులు......లో
బడితిమి పాలలో బడిన బల్లుల కైవడి........"

ఇంద్రకీలపర్వతమున దపమొనర్చు నర్జును నుద్దేశించి వృద్ధబ్రాహ్మణవేషమున నున్న మహేంద్రుడు పలుకు నది—

"శరచాపధారణంబును
బరమమునశ్శాంతిదాంతిపరిపాకంబుఁ
బరికింప జంక దుడ్డును
శరణార్థి యువ సెడు నట్టి చందము తోచెఁ"

వలునిచే బట్టువడినప్పుడు హంస విలపించు ఘట్టము—

"తల్లి మదేకపుత్త్రిక పెద్దకన్నులు గాన దిప్పుడు మూడుకాళ్ల ముసలి. వెనుక ముందర లేరు. సెనగైన చుట్టాలు......"

"అక్కటకటా దైవంబ నీకంటికి చేలగింజయుం బెద్దయయ్యెనే"

హంసదమయంతుల సంభాషణములో:

"అధికరోషకషాయితస్వాంతు డయిన
నరపతికి విన్నవింపకు నాయవస్థ
పైత్యదోషోదయంబున బరుసనైన
జిహ్వకకు బంచదారయు జేదుగాదె"

"కన్నులు చల్లగా గనుగొందు నేను మి
మ్మిరుపుర దేవి దేవరయుఁబోలె"

దక్షారామక్షేత్రమహత్త్వవర్ణనమున—

"ప్రవ్వముడిచిన పురవీథి భూమియందు
గట్టె మోవంగవలసిన కారణమున,
వీరభద్రునిచే దైన్యవృత్తి నొంది
దక్షు డట్టి మహాధ్వరస్థానమునను"

వ్యాసుడు కాశి విడిచివచ్చిన కారణమును అగస్త్యునికి నివేదించు సందర్భమున—

"మఱపు మెంగంబు జూడ కొక
మోసపు మాటకు విశ్వనాయకుం
డొక్కకడికైన బొమ్మనుచు
నెఱ్ఱని చూపుల జూచె నల్కతో"

క్షీరసాగరమథనకథయందలి యింద్రోపేంద్రుల మంతనము—

"ఒంటి నేతెంచి మంతనం బుండి నిలిచి
చక్రధరుతోడ హితకార్యచర్చ చేసి
యేగ దేవేంద్రు డిరుచెవి కెఱుంగకుండ
సిద్ధసంకల్పుడై యాత్మ శిబిరమునకు"

అమృతోత్పత్తికయి క్షీరసాగరమును మథింపు డని సురాసురులను విష్ణు వుద్బోధించు సందర్భమున—

"కుడిచి కూర్చుండి మీ రేల కొఱఁతరైన
తమ్ములాడెదరో యన్నదమ్ములార!
గోత్రక్రొవ్వియు పెలగట్టె గొరికినట్లు
కటకటా! మీ వివేకంబు గాడుపడెఁగ"

వింధ్యుడు మేరువు పెడ ననూయాగ్రస్తు డగుపట్టున—

"అడుసులోపల దాటిపం డదుమునట్టు
లదుముదుపెకొని పాతాళ మంటికొనగ
వేల్పులెల్లను విభ్రాంతివిహ్వలింప
బాదముల మెట్టి నాదాయ బసిడికొండ"

అగస్త్యమహర్షి కాశి విడిచి దక్షిణాపథమునకు వెడలవలసివచ్చినందుకు విచారించు ఘట్టమున—

"ఏమి చెప్పగ నున్నది యేవిధమున
గాశి వెడలించుచున్నాడు కాలగళుడు
మనము లోగితిమేని లోగునె శివాజ్ఞ
యుడుము నడికిన నదుకునే జిడియపెట్టు"

దివోదాసుడు కాశిలో రాజ్యము సేయునప్పుడు దేవతలా పుణ్యక్షేత్రము వీడి దివికేగునప్పుడు కొందఱు మాత్ర మాకాశాచి పెడబాసి పోజాలని పట్టున.

"తత్పరత మీఱ గొలిచి రాధరణినాథు
దైత్యదానవు లవధూతదానవారి
బతితపాతమూబాలగోపాలమైన
సుద్ది పగవారి పగవారు చుట్టలనుట"

"విశ్వదేవగణంబుతో వేలువేలు
వచ్చి పితృదేవతలు మహేశ్వరు గొలిచిరి
చులకగాల్వట్టియాడ్చిన జూటు పట్టి
వేలుదురుగాక తమవారి విడుతురెట్లు"

దేవగణములతోపాటు అగ్నిదేవుడుగూడ గాశివీడ వను కోపమున దివోదాసుడు పలుకునది—

"అనుమానింపక యాసుధాంధసులు వా
యాపంచనాకల్పనం

బున వైశ్వానరునిఁ హరించిరి యవ్వం
బో! యింతమాత్రంబులో
నన వాయోగమహానుభావమునకుఁ
భంగంబు వాటిల్లునే
పసెకల్లాడిన బెండ్లి మానవో శా! దు
శ్చారిత్రముల్ గంటిరే"

కాశీతీర్థవాసులు బ్రాహ్మణులు విశ్వేశ్వరు నుద్దేశించి వచించునది—

"పదియు నెనుబది వేలును బంచశతియు
నేబదియు నైదుసంఖ్యల యిండ్లవార
మాశ్రితులు కాశికాపురి కస్మదీయు
లీశ! పల్లేరు దుడిచి పాడెక్కినారు"

దుర్గుడను రాక్షసుడు కాళికాదేవి పంపిన రాయబారిని గాళరాత్రి నవమానించు ఘట్టము—

"వంటయిలు సొచ్చె గుండేలు వనజనయన!
మెచ్చి నారము విధి నిన్ను దెచ్చినపుడ
యడవిలోపల నున్న గేహమున నన్ను
బొందగల భాగ్యవిభవంబు పొందుబురుషు"

"కాంత గంధుపవెట్టి నీకడకు వేలు
చెప్పవచ్చిన నన్ను శిక్షింపదగునె!
మొనసి హితమాచరించిన ముండమెక్క
కోతవడె ననుమాటయే గోచరించె"

శ్రీవిష్టపేశ్వర భవనంబు నాశ్రయించిన పారావతమిథునంబు శ్యేనభయంబున నమ్మందిరంబు విడిచి యొండుచోటికిం బోవ నెంచుసందర్భమున నాడుపక్షి మగనింగూర్చి పలుకుటలో—

"చిచ్చువాతను వరివాత జిక్కపడక
తప్పిపోయినవారపో తక్షణ మెందు
దాత ద్రవ్వించెలువంచు దగునె మునుగ
నిల్లువెడలగ జావంగ నేల మనకు"

అంత నామగపక్షి మాఱుపలుకుటలో—

"అది విహంగమ మేను విహంగమంబ
పెసరగింజకు దక్కవే పెసరగింజ
యబల! యటు చూడు మాపక్షియద టడంతు
గుటిలచంచూపుటీకోటికుట్టనముల"

దక్షప్రజాపతి శివుని నిందించుపట్టున—

"పేదలయ్యును గడు బిట్టబిగిసియుంద్రు
వట్టి యభిమానములను గర్వములబట్టి
యల్లువారికి నెల్ల నీ యవగుణంబు
వెన్నతో బెట్టినది యింత విసువ నేల?"

దధీచిమహర్షి దక్షయజ్ఞమందలి సదస్యుల నుద్దేశించి పలుకుటలో—

"ఏమి గుదువంగ వచ్చినా రిండ్లు విడిచి
హరుని వెలిపెట్టి పట్టి యీ యాగమునకు
బంచవదనుని కను జేవురించెనేని
తక్షణమునంద తమ యాంధ్ర త్రాళ్లు తెగవె!"

కుమారస్వామి యగస్త్యునకు కాశీక్షేత్రమాహాత్మ్యమును వర్ణించుటలో—

"విశ్వపతికంటె నైవల్య విభునికంటె
గాలకంఠునికంటె ముక్కంటికంటె,
దీర్థములు దైవములు లేవు త్రిభువనముల
సత్య మింకను సత్యంబు సంయమీంద్ర!"

వ్యాసునకు కాశిలో భిక్షముపుట్టని ఘట్టమున—

"తిరిగె నింటింట 'భిక్షాం ప్రదేహి' యంచు,
బాదరాయణుడు కాశీనుపట్టణమున
నొట్టుపెట్టిన భంగి నే యింట్లలియును
బిలిచి యొకపట్టె డన్నంబు పెట్టదయ్యె"

ఆ సందర్భమున నమ్మునివరుండు శిష్యుల మొగంబులు చూచి పలుకుటలో—

"వాడబాతీనయువి వక్త్రవనరుహములు
భాజనంబులలోన నిప్పచ్చరంబు
మీకు భిక్షాన్నములు లేమి నాకు దెలిసె
నేలపంటల గొయ్యలే చెప్పగాడ!"

అన్నపూర్ణాదేవి కాశికానగరిపై నాగ్రహము వలదని వ్యాసునకు బోధించుటలో—

"ఓమునీశ్వర! వినవయ్య యున్నయూరు
గన్నతల్లియు నొక్కరూ పన్నరీతి
అట విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి
కాశి యిబ్బేటిమీద నాగ్రహము వలదు"

ఇట్లే శ్రీనాథమహాకవి యుత్తమకవితామహత్త్వమునకు జాతీయతనుగూర్చిన జాతీయములు, వలపులు గులుకు పలుకుబడులు ననంతములుగ నాతని కృతులందు మెఱయుచుండును.

# మాహేశము

శ్రీ శివశంకరస్వామి

శబ్దాంబుధిం ప్రమథ్యైవ శంకరేణ యదుద్ధృతమ్,
మాహేశం తద్విజానీయాత్ కృత్స్నం వ్యాకరణామృతమ్.

దేవాదిదేవుడగు మహేశ్వరుడు శబ్దశాస్త్రమున సాక్షాత్కారస్వరూపుడు. కావుననే ప్రాచీనవైయాకరణాచార్యు లీక గాథ పలికినారు:

"సముద్రవద్వ్యాకరణం మహేశ్వరే
తదర్ధకుంభోద్ధరణం బృహస్పతౌ
తద్భాగభాగాచ్చ శతం పురందరే
కుశాగ్రబిందూత్పతితం హి పాణినౌ" ఇతి.

శంకరానుగ్రహము లేక శబ్దశాస్త్రము సిద్ధింపదు. అందుచే స్మృతు లిట్లు ఘోషించినవి:

"ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్
ధన మిచ్ఛేత్ హుతాశనాత్
జ్ఞానంచ శంకరా దిచ్ఛేత్
ముక్తి మిచ్ఛేత్ జనార్దనాత్"

మాహేశశబ్దము మాహేశ్వర నామాంతరము. ఆయన వ్యాకరణప్రథమప్రవక్త. తత్ప్రోక్తవ్యాకరణమే మాహేశనామమున ప్రసిద్ధము. అభినయదర్పణ, భరతార్ణవ, కామశాస్త్రాదిప్రవక్తయగు నందికేశ్వరుని ప్రథమతః వ్యాకరణమున సంజ్ఞాదులకయి పదునాలుగుసూత్రములు స్మృతము లయ్యె నని కాశికా వృత్తియం దిట్లున్నది:

"నృత్తావసానే నటరాజరాజో
ననాద ఢక్కాం నవపంచవారమ్,
ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధా
నేతద్విమర్శే శివసూత్రజాలమ్."

ప్రథమతః మహేశునిచే ధాతుసమూహము నిరూపిత మయ్యెనని జామరనంది ధాతుమాలలో లిఖించినాడు. శబ్దములకు ధాతుయోనిత్వమును జూపుటకై మాహేశుడే మొదట ధాతుసమూహమును స్మరించె ననియు, అనంతరము ఋషుల కది లభించె ననియు భావము. ఈ విషయము కేవల మాధారహీనము కాదు. నందికేశ్వరుడు కాశికలో—

"అత్ర సర్వత్ర సూత్రేషు అంత్యవర్ణచతుర్దశమ్
ధాత్వర్థం సముపాదిష్టం పాణిన్యాదీష్టసిద్ధయే."

అన్నాడు. దీని వ్యాఖ్యలో భగవాన్ ఉపమన్యు విట్లన్నాడు: "ధాత్వర్థం ధాతుమూలకశబ్దశాస్త్రప్రవృత్త్యర్థమ్. అంత్యవర్ణజాలం శబ్ద ఇతి న్యాయేన. తథా చోక్త మింద్రేణ—అంత్యవర్ణసముద్భూతా ధాతవః పరికీర్తితాః ఇతి." ఐంద్రవ్యాకరణము కేవలము శివసూత్రసమూహమును లక్ష్యమున నుంచికొనలేదు. దానిలో మాహేశమతానుసారముగా శబ్దములకు ధాతుయోనిత్వము కూడ నభ్యుపగత మయినది. కౌమరసంప్రదాయమతమున మాహేశములోని పవిత్రధాతువు లనేకము కాలదోషమువలన రూపాంతరము పొందినవి. ధాతువులే యనేల—అనేకశబ్దములుకూడ మారిపోయినవి. భాగవృత్తికారుడు విమలమతి "కాలసృష్టాఏవ అపశబ్దాః" (దుర్ఘటవృత్తి ౨-౨-౬) అన్నాడు. అందుచేతనే మాహేశానుస్మరణమూలక మయినను శబ్దములకు ధాతుయోనిత్వమునుగూర్చి శకటి—శాకటి—శాకటా

యనుల వాదముకాని, చాంద్రవర్మణీయద్వయశబ్దసర్వ నామత్వముకాని పరవర్తికాలములో, వ్యాకరణశాఖలలో మరెయ్యెను. ఆపిశలీయప్రాచీన 'ప' ధాతుస్థానమున నిప్పుడు అప్ ధాతుపాఠము కౌమారోక్తి కుదాహరణముగా జెప్పవచ్చును.

పండితసత్యవ్రతసామశ్రమిమతమున మాహేశము ఆకాశపుష్పమువంటిది. (ఖపుష్పవత్ : నిరుక్తాలోచనము, ౧౧౬ పుట.) నిజముగా మాహేశవ్యాకరణము ఆకాశపుష్పమువలె అలీకము కాదు. భారతాచార్యకృతమైన—

"పదశైర్నాతినిర్బంధః కర్తవ్యో మునిభాషితే
అనుస్మరణతాత్పర్యాన్నాద్రియస్తేహి లక్షణమ్.
యా స్యజ్జహార మాహేశా
ద్వ్యాసో వ్యాకరణార్ణవాత్
తాని కిం పదరత్నాని
సన్తి పాణిని గోష్పదే.
నన్వష్టమితి వైయాసే
శబ్దే మా శంకయం కృథాః
అశైరజ్ఞాత మిత్యేవం
రత్నం కిం నహి విద్యతే."

అను శ్లోకములవలన మాహేశ మొకానొకప్పుడున్నట్లు స్పష్టము. సామశ్రమిమహాశయుని వాదము గ్రాహ్యము కాదు. వ్యాకరణశాస్త్రము బహుశాఖలుగా విభక్తమయినను, మాహేశము సకలశాఖలకును మూల మని చెన్నదగును. కాలక్రమమున మాహేశము నుండి వ్యాకరణాంశము లనేకములు భిన్నమగుటచేతనే మాహేశచుంచువు లను వ్యాసాదుల రచనలలో బహుచిత్రప్రయోగములు కానవచ్చును. ఈ ప్రయోగములు నేడసిద్ధములయినను అసాధువులు కావు. 'యుగే యుగే వ్యాకరణమ్' అను న్యాయమును బట్టి వాని సాధుత్వము నంగీకరింపకుండుటకు వీలులేదు. కాని నేడవి నియామకములు కావనిమాత్ర మనవచ్చును.

కావుననే "కురవో౽౽త్మహితమ్..." ఇత్యాది వ్యాసోక్తినిబట్టి కాతంత్రసంధిపాదమున ౬వ సూత్రముపై టీకలో దుర్గసింహు డిట్లు వ్రాసినాడు: "కథం కురవో౽౽త్మహితం మంత్రం సభాయాం చక్రిరే మిథః * ఇత్యకారగ్రహణే హ్యకారస్యాపి గ్రహణమితి ? సత్యమ్. ఋషివచనసామర్థ్యాత్ప్రవృత్తస్య న నియామక మిదమ్; యుగేయుగే వ్యాకరణ మితివా." అందుచేతనే వర్తమానకాలమున వ్యాకరణపరినిష్ఠిత ప్రయోగసమూహమే సాధువు; ప్రాచీనకాలపు—ఆర్ష ప్రయోగసముదాయ మసాధువు అను మాట సంగతము కానేరదు.

ఉత్తరకురుభూములలోని వర్తమానబదరికాశ్రమాది పర్వతప్రదేశములందు పురాకల్పమున నుపదిష్టమైన వ్యాకరణము మాహేశ మనిపించును. కాలక్రమమున మాహేశసారాంశమే ఆర్యావర్తాదిష్మతల్లక్షేత్రములందు రూపాంతరము పొంది, ఐంద్రవ్యాకరణమున ప్రవేశించియుండును. ప్రాచీనకాలమున ఆర్యావర్త బ్రాహ్మణులు విశిష్టవిద్యలకై ఉత్తరకురుభూములకు బోయి, వివిధవాగాత్మికవిద్యలు గ్రహించి, తత్త్వవేత్తలై స్వస్థానములకు మరలివచ్చుచుండి రనియువాడుక. కావున కౌషీతకిబ్రాహ్మణమున నిట్లామ్నాతమయినది: "పథ్యా స్వస్తి రుదీచీం దిశం ప్రాజానాద్వాగ్వై పథ్యా స్వస్తి స్తస్మా దుదీచ్యాం దిశి ప్రజ్ఞాతతరా వా గుద్యతే. తస్యవా కుర్వామ్నాత ఇతి స్మాహ. ఏషాహి వాచో దిక్ ప్రజ్ఞాతా". దీనిపై వ్యాఖ్యలో షడ్గురుశిష్యు డిట్లు లిఖించినాడు. "ప్రజ్ఞాతతరా వా గుద్యతే. కాశ్మీరే సరస్వతీ కీర్త్యతే. బదరికాశ్రమే వేదఘోషః శ్రూయతే. వాచం శిక్షితుం సరస్వతీ ప్రసాదార్థ ముదంచ మేవ యన్తి. యోవా ప్రసాదం లబ్ధ్వా తత ఆగచ్ఛతి స్మాహ ప్రసిద్ధ మాహాత్మ్య సర్వలోకః"

శర్వవర్మలుప్తకౌమారప్రథమసూత్రమును కుమారప్రసాదమున పొందినట్లే లుప్తమాహేశములోని ౧౪ సూత్రములను శివప్రసాదమువలన పాణిని పొందినాడు. భవిష్యపురాణద్వితీయఖండములోని ౩౧వ అధ్యాయములో నిట్లున్నది:

* కృత్వావహారం సైన్యానాం ప్రవిశ్య శిబిరం సుఖమ్—శల్య ప్రథమార్ధభాగము : మహాభారతము.

"సమానస్య సుతః శ్రేష్ఠః పాణిని ర్నామ విశ్రుతః
కణభుగ్వరశిష్యైశ్చ శాస్త్రజ్ఞైః స పరాజితః.
లజ్జితః పాణిని స్తత్ర గత స్తీర్థాంతరం ప్రతి;
స్నాత్వా సర్వాణి తీర్థాని సంతర్ప్య పితృదేవతాః.
కేదార ముదకం పీత్వా శివధ్యానపరోఽభవత్,
పర్ణాశీ సప్తదివసాన్ జలభక్ష స్తతోఽభవత్.
తతో దశదినా న్తే స వాయుభక్షో దశాహని
అష్టావింశదినే రుద్రో వరం బ్రూహి వచోఽబ్రవీత్:
శ్రుత్వా మృతమయం వాక్య ముస్తో గద్గదయా గిరా
సర్వేశం సర్వలింగేశం గిరిజావల్లభం హరమ్:
నమో రుద్రాయ మహతే సర్వేశాయ హితైషిణే
నందిసంస్థాయ దేవాయ విద్యాఽభయకరాయ చ
పాపాంతకాయ భర్గాయ నమోఽన్తాయద వేధసే
నమో మాయాహరేశాయ నమ స్తే లోకశంకర!
యది ప్రసన్నో దేవేశ, విద్యానూలప్రదో భవ!
వరం తీర్థంహి మే దేహి, దైవ్యమాతురపితు ర్నమః!
ఇతి శ్రుత్వా మహాదేవః సూత్రాణి ప్రదదౌ ముదా
సర్వవర్ణమయా న్యేవ అ ఇ ఉ ణాదిసుభానివై.
ఇత్యుక్త్వాఽన్తర్దధే రుద్రః, పాణినిః స్వగృహం యయౌ
సూత్రపాఠం ధాతుపాఠం గణపాఠం తథైవచ [యా
లింగసూత్రం తథా కృత్వా పరం నిర్వాణ మాప్త
[వాన్."

శివసూత్రములు అష్టాధ్యాయికి బీజ మని ఉత్కల శాంకరమ తాధిపతి, సంగీయమధుసూదనసరస్వతిప్రభృతి మనీషులు పాణినీయవ్యాకరణమును వేదాంగమాహేశ్వర మన్నారు.

సుప్రసిద్ధమాహేశమును పాణిని అనువర్తనము చేసినచో శాకటాయనాదులవలె మహేశనామము స్మరింపలేదేల? ధ్వనిద్వారా నామస్మరణము ప్రథా బహిర్ఖ్యాతము కాదు. ఒక్కొక్క గ్రంథప్రారంభము నసే ఇష్టస్మరణము ధ్వనిద్వారా కానవచ్చును. శాకటాయనాదులకడనుండి పాణినికి బహువిషయములు లభించుటచే వారి నతడు పేర్కొన్నాడు; కాని యీ సిద్ధాంతములు పూర్వాచార్యుల కెచటనుండి లభించెనో అనుసంధానము చేయలేదు. అనవస్థాన దోషము పట్టునని విరమించియుండును. లోకులు దైనందినవ్యవహారములో "మాగురు విట్లు చెప్పె"నని చరమసిద్ధాంతరూపమున పరిగ్రహించుచుందురు. తన కాలమున మాహేశము సంపూర్ణముగా లోపింపకున్న పక్షమునను, స్వచక్షువులతో దానిని జూచియున్నను పాణిని దానిని తప్పక పేర్కొనియుండెడివాడే.

మాహేశములోని శివసూత్రసమూహము వ్యాకరణాధికరణమున కేవలప్రత్యాహారసంజ్ఞాదులకై ఉద్దిష్టమయినను దానిలో నిహితమైన యాధ్యాత్మికభావ సందోహము శివానుచరుడును, శివతత్త్వవిశారదుడును అగు నందికేశ్వరుని కాశికలో వివృతమయినది. క్రౌంచ ద్వీపవాసియు, శివభక్తుడు నగు ఉపమన్యువు మరల తత్త్వవిమర్శలో కాశికయందలి దుర్గమాంశములను సరళముగా వ్యాఖ్యానించినాడు. దీనినిగూర్చి హర ప్రసాదశాస్త్రి యిట్లు వ్రాసినాడు:

*"These alphabetical Sutras are called Siva Sutras especially in the School of Panini, for tradition has it, that Nandikeswara was a favourite of Siva, and he got these 14 Sutras directly from him. But the god Siva is without action and without attributes. His active principle is Nandi, the son of Rishi named Silada. Nandi by his austerities rose to be the commander of Siva's followers, of Ganas, and of his son Ganesa. Nandi is often called Nandikeswara. In the present work Nandikeswara is made to write 26 verses, giving the highest spiritual interpretation to the 14 SivaSutras. This is Nandikeswara's Kasika. Its commentator is another great favourite of Siva, named Upamanyu who by his austeri ies rose to such favour of Siva, that Krishna had to carry favours with him for obtaining a desired boon from Siva. The commentary is called Nandikeswara- Kasika- Tattwavimarsini" (Vyakarana Mss. pp 12, 13).*

కింవదంతి నుపేక్షించినను నందికేశ్వరు డాధునికు డనుటకు వీలులేదు. వాత్స్యాయనుడు కామసూత్రములో ప్రాచీనశాస్త్రవ్యాసులతోపాటు నందికేశ్వరుని పూర్వాచార్యునిగా నుల్లేఖించినాడు.

నందికేశ్వరుని కాశికలోను, ఉపమన్యుని తత్త్వవిమర్శినిలోను ఏ సూత్ర మెట్లు వ్యాఖ్యాతమో యీపట్టికలో జూడదగును.

(౧) అ ఇ ఉణ్.

అకారో బ్రహ్మరూప స్స్యా న్నిర్గుణ స్సర్వవస్తుషు
చిత్కలా మిమాం సమాశ్రిత్య జగద్రూప ఉణీశ్వరః.
(కాశికా. ౩)

ఇక్కడ ఉపమన్యు విట్లన్నాడు: "అః పరమేశ్వరో నిర్గుణః, ఇం మాయా మాశ్రిత్య ఉః వ్యాపకః సగుణః ఈశ్వరః ణ్ ఆసీ దితి సూత్రార్థః సూచితః. సర్వవస్తుషు పరాపశ్యన్తీ మధ్యమా వైఖర్యాదిషు ఇమాం చిత్కలా మిత్యత్ర గాయత్రీ మించేతి వత్......"

అకార స్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమేశ్వరః
ఆద్య మన్త్యేన సంయోగా దహ మిత్యేవ జాయతే.
(కా. ౪)

ఉపమన్యువు: "అది రన్త్యేన సహితా—ఇత్యాది రకారోఽన్త్యో హకారః అకారాది—హకారాన్తా వర్ణా స్తతః పరమాత్మనః సమభవ న్నిత్యర్థః."

సర్వం పరాత్మకం పూర్వం జ్ఞప్తిమాత్ర మిదం జగత్
జ్ఞప్తే ర్బభూవ పశ్యన్తీ మధ్యమా వాక్ తతః స్మృతా.
వక్త్రే విశుద్ధచక్రాఖ్యే వైఖరీ సా మతా తతః
సృష్ట్యావిర్భావ మాసాద్య మధ్యమా వాక్ సమా మతా.
(౫,౬)

ఉపమన్యువ్యాఖ్య: "ఈశ్వరవే వానాదిజీవోపాధ్యాశ్రితకర్మప్రేరితప్రాణవ్యాపారానంతరం నాభౌ పరాఖ్యం మాయాపరిణామ ముపేత్య హృది పశ్యంత్యాఖ్య ముపేత్య, విశుద్ధచక్రే మధ్యమాఖ్య ముపేత్య, పశ్చాత్ వక్త్రే వైఖర్యాఖ్య మవాప్య వేదాదిరూపో భవతీ త్యర్థః. శ్రుతిరపి వాగేవ విశ్వా భువనాని జజ్ఞే ఇతి. మాయైవ వాగేవ విశ్వాకారేణ విపరిణమతే వివర్తతే చేతి బోధ్యమ్. శ్రుత్యన్తరమపి—వాచైవ విశ్వం బహురూపం నిబద్ధం తదేతదేకం ప్రవిభజ్యోపభుఙ్క్త ఇతి."

శ్రుతితాత్పర్య మిట్లున్నది: "బహురూపం కృత మితి శేషః. తదైవ నిబద్ధ మిత్యర్థః. ఏకం చిద్రూపమపి విశ్వం తయా విభజ్య అవిద్యయా నానేవోపభుంక్తే." వాక్యపదీయము లోని ౧-౧-౨౧ శ్లోకవ్యాఖ్యలోని ప్రమాణ ముద్ధృతము:

"వాగేవ విశ్వా భువనాని జజ్ఞే
వాచ ఇత్ సర్వ మమృతం యచ్చ మర్త్యమ్
అథో వాక్ బుభుజే వాగువాచ
పురుత్రా వాచో నపరం యచ్చ నాహ."

అటుపైన కాశికలో నిట్లున్నది:

అకారం సన్నిధీకృత్య జగతాం కారణత్వతః
ఇకారం సర్వవర్ణానాం శక్తిత్వాత్ కారణం గతమ్.

జగత్ స్రష్టు మభూ దిచ్ఛా
యదా హ్యాసీత్ తదాఽభవత్
కామబీజ మితి ప్రాహుః
మునయో వేదపారగాః.

అకారో జ్ఞప్తిమాత్రం స్యాత్
ఇకార శ్చిత్కలామతా
ఉకారో విష్ణు రిత్యాహుః
వ్యాపకత్వా న్మహేశ్వరః." (కాశికా ౭-౮)

ఉపమన్యు విట్లన్నాడు: "ఉక్తమేవ ద్రఢయతి అకార ఇతి......ఉ వ్యాపకత్వేన ణ్ ఈశ్వర ఆసీ దిత్యర్థకే ఉణీశ్వరః—మహేశ్వరః—ఇత్యత్రేతి భావః"

(౨) ఋ ఌ క్.

ఋ ఌ క్ సర్వేశ్వరో మాయాం
మనోవృత్తి మదర్శయత్
తామేవ వృత్తి మాశ్రిత్య
జగద్రూప మజీజనత్. (కాశికా. ౧౦)

ఉపమన్యువు: "ఋ పరమేశ్వరః ఌ మాయాఖ్యాం మనోవృత్తిం క్ అదర్శయత్. తామే వాశ్రిత్య

స్వేచ్ఛయా జగజ్జనయామాసే త్యర్థః. ఋ పరమేశ్వర ఇత్యత్ర ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపిఙ్గలమ్ ఇతి శ్రుతిః ప్రమాణమ్. తం తత్పదార్థం పరం బ్రహ్మ ఋ సత్య మిత్యర్థః శ్రుత్యంతర మపి—సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ ఇతి. శ్రీతంత్రేఽపి—మత్తో హ్యభూన్మనోరూపం ౡకారః పరమేశ్వర ఇతి."

ౡకారము ఋకారమునకు సవర్ణము. కావున ౡకారమును మరల వేరుగా గ్రహింపనేల? చంద్రచంద్రికాన్యాయప్రకారము బ్రహ్మమాయాసంబంధమును సూచించుటకై రెండుసవర్ణములను గ్రహించినారు. అర్ధమాత్రాత్మకకకారము పరమపదము—అనగా నిర్గుణబ్రహ్మము. ఋ ౡ వర్ణద్వయమునకు చణకవత్ పురుషప్రకృతిని ధరించినను, ఏకమాత్ర పరబ్రహ్మమునుండియే అవి యావిర్భవించిన వని వేదాంతమతమున గ్రహింపవలెను. "త్వం వా అహమసి భగవో దేవతే, అహంచ త్వమసి భగవో దేవతే" అని శ్రుతి పలుకుచున్నది. "సవై నైవ రేమే తస్మాదేకాకీ న రమతే స ద్వితీయ మైచ్ఛత్ సహైతా వానాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ స ఇమ మేవాత్మానం ద్వేధా పాతయత్ తతః పతిశ్చ పత్నీ చాభవతామ్......" (౪-౩) అని బృహదారణ్యకమున నామ్నాతము.

సౌరపురాణమున నిట్లున్నది:

"తన్మయం మన్మయం సర్వ
మేకా శక్తిర్ద్విధా స్థితా,
ఏవం నిగదితో విష్ణుః
బ్రహ్మణా పరమేష్ఠినా." (౨౪-౨౩)

తంత్రముకూడ నిట్లు ఘోషించుచున్నది:

"యోహి విశ్వేశ్వరో దేవో
విశ్వం వ్యాప్య స్థితశ్చ యః
సైవ విశ్వేశ్వరీ దేవీ
వ్యాపకత్వేన సంస్థితా."

కావున పురుష-ప్రకృతులు భిన్నమయినను అభిన్నముగా నున్నట్లు ఋకారౡకారములు విభక్తము లయినను అవిభక్తములని గ్రహింపవలెను.



దానిపై కాశికలో నిట్లున్నది:

"వృత్తివృత్తిమతో రత్ర భేదలేశో న విద్యతే
చంద్రచంద్రికయో ర్యద్వత్ యథా వాగర్థయోరివ.
స్వేచ్ఛయా స్వస్య చిచ్ఛక్తౌ విశ్వ మున్మీలయ త్యసౌ
వర్ణానాం మధ్యమం క్లీబం ఋౡవర్ణద్వయం విదుః".
(కాశికా ౧౧, ౧౨)

(౩) ఏ ఓ ఙ్:

"ఏఓఙ్ మాహేశ్వరాత్మైక్యవిజ్ఞానం సర్వవస్తుషు
సాక్షిత్వాత్ సర్వభూతానాం సఏక ఇతి నిశ్చితమ్"
(కా. ౧౩)

(౪) ఐ ఔ చ్:

ఐఔచ్ బ్రహ్మస్వరూపః సన్ జగత్ స్వాంతర్గతం తతః
ఇచ్ఛయా విస్తరం కర్తు మావిరాసీత్ మహామునిః."
(కా. ౧౪)

(౫) హ య వ ర ట్:

"భూతపంచక మేతస్మా
ద్ధయవర న్మహేశ్వరాత్
వ్యోమవాయ్వంబువహ్న్యాఖ్య
భూతా న్యాసీత్ సఏవహి.

హకారా ద్వ్యోమసంజ్ఞంచ
యకారా ద్వాయు రుచ్యతే
రకారా ద్వహ్ని స్తోయంతు
వకారా దితి సైవ వాక్." (౧౫-౧౬)

ఉపమన్యు విట్లవ్వాడు: "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశా ద్వాయుః, వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ ఇతి శ్రుతిః."

(౬) ల ణ్:

"ఆధారభూతం భూతానా మన్నాదీనంచ కారణమ్
అన్నా ద్రేత స్తతో జీవః కారణ్యా ల్లణీరితమ్."
(కా. ౧౭)

(౭) ఞ మ ఙ ణ న మ్:

"శబ్దస్పర్శౌ రూపరసగన్ధాశ్చ ఞమఙణనమ్
వ్యోమాదీనాం గుణా హ్యేతే జానీయాత్ సర్వవస్తుషు."
(౧౮.)

(౮) ఝ భ ఞ్ :

"వాక్పాణీచ ఝభంచాసీత్ విరాడ్రూపచిదాత్మనః
సర్వజంతుషు విజ్ఞేయం స్థావరాదౌ నవిద్యతే
వర్గాణాం తుర్యవర్ణా యే కర్మేంద్రియమయా హి తే".

(౧౯)

(౯) ఘ ఢ ధ ష్ :

"ఘఢధష్ సర్వభూతానాం పాదపాయూ ఉపస్థకః
కర్మేంద్రియగణా హ్యేతే జాతాహి పరమార్థతః"

(కాశికా ౨౦)

(౧౦) జ బ గ డ ద శ్ :

"శ్రోత్ర త్వక్ నయన ఘ్రాణ జిహ్వాధీంద్రియపంచకమ్
సర్వేషామపి జంతూనా మీరితం జబగడదశ్." (౨౧)

(౧౧) ఖ ఫ ఛ ఠ థ చ ట త వ్ :

"ప్రాణాదిపంచకం చైవ మనోబుద్ధి రహంకృతిః
బభూవ కారణత్వేన ఖఫఛఠథచటతవ్.
వర్గద్వితీయవర్ణోత్థాః ప్రాణాద్యాః పంచవాయవః
మధ్యవర్గత్రయా జ్జాతా అంతఃకరణవృత్తయః".

(౨౨, ౨౩)

(౧౨) కపయ్ :

"ప్రకృతిం పురుషంచైవ సర్వేషామేవ సమ్మతమ్
సంభూతమితి విజ్ఞేయం కపయ్ స్యా దితి నిశ్చితమ్."

(౨౪)

(౧౩) శషసర్ :

"సత్త్వం రజ స్తమఇతి గుణానాం త్రితయం పురా
సమాశ్రిత్య మహాదేవః శషసర్ క్రీడతి ప్రభుః
శకారా ద్రాజసోద్భూతిః షకారాత్ తమసోద్భవః
సకారాత్ సత్వసంభూతి రితి త్రిగుణసంభవః"

(కా. ౨౫, ౨౬)

(౧౪) హల్ :

"తత్త్వాతీతః పరః సాక్షీ సర్వానుగ్రహవిగ్రహః
అహ మాత్మా పరో హల్ స్యా మితి శంభు స్తిరోదధే."

(౨౭)

తంత్రముకూడ "హకారః శివ వర్ణ స్స్యా దితి శైవాగమస్థితిః" అని ఘోషించుచున్నది.

సనకాదిసిద్ధపురుషుల కొకసారియు, పాణినికి మరియొకపర్యాయమును మహేశ్వరుడు ఢక్కానినాదముద్వారా ప్రత్యాహారసూత్రముల నుపదేశించె నని పాణినీయసంప్రదాయమున ప్రతీతి కలదు. వా రిట్లందురు : "యథా సనకాదయః సిద్ధాబుభుక్షవః పురా స్వస్వేష్టార్థసిద్ధయే పరమేశ్వర మారాధయామాసుః, తథా పాణినిరపి వ్యాకరణవిద్యాసామ్రాజ్యలాభాయ సర్వవిద్యాధిప మీశానం తపసారాద్ధుం నిశ్చిత్య తీవ్రం తప శ్చక్రే. తేనైవ తపసా సమారాధితో భగవాన్ భూతభావనో భక్తాభీష్టవరాన్ ప్రదిత్సుః పువర్నాట్య రంగితల మధిష్ఠాయ నృత్యన్ నాదయామాస చతుర్దశకృత్వో ఢక్కామ్. సనాదో యథా సనకాదిభి రమృతత్వేన పీత స్తథా పాణినాపి చతుర్దశసూత్రామృతత్వే నాపీయత అథ సంస్తుతో నటేశః పాణిని మాహ—ఏభిః ప్రత్యాహారసూత్రై ర్మాహేశవ్యాకరణకల్పం కంచిత్ కాలోపయోగినం వ్యాకరణ విశేషం నిర్మాయ దివం వ్రజేతి—ఏవ ముక్త్వా స చాంతరధాత్."

పాణినీయశిక్షయం దిట్లున్నది :

"శంకర శ్శాంకరీం ప్రాదాత్ దాక్షీపుత్రాయ ధీమతే
వాఙ్మయేభ్యః సమాహృత్య దేవీం వాచ మితి స్థితిః."
"యేనాక్షరసమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః."

రెండవ శ్లోకమును జూచి కొందరు కొందరు ఇట్లన్నారు : "శివసూత్రములనుండి మాతృకాక్రమము నిర్గత మయినది. మాతృకాక్రమ రహస్యస్వరూపము లయిన యీ సూత్రములను భగవానుడు మాహేశమున సన్నివేశము చేసెను. పాణినికిగూడ నుపదేశించెను." వర్ణోపదేశప్రసంగమున మహాభాష్యమున నిట్లు స్మృతము :

"వర్ణజ్ఞానం వాగ్విషయో యత్ర చ బ్రహ్మ వర్తతే
తదర్థ మిష్ట సిద్ధ్యర్థం లఘ్వర్థం చోపదిశ్యతే."

(*Keilhorn's Edition*, స. ౧ ఖండ. ౩౬ పుట.)—

ఈ శ్లోకమును గాంచియుఞ్ ఏవో శిక్షాసూత్రములను పరీక్షించియు FADDEGON మహాశయుడు శిక్షాశాస్త్రీయ స్వరాదివిభాగమునకై మరల శివసూత్ర

సమూహ ముపదిష్టమయిన దని అనుమానించినాడు. ప్రాత్నికుల యీ యనుమానము సంగతము కాదు. వర్ణమాతృకాస్థిత కకారాది వర్గపంచకమందు అఘోష, అల్పప్రాణవర్ణ, కచటతప (*Voiceless unaspirates*) అఘోష, మహాప్రాణవర్ణ, ఖఛఠథఫ (*Voiceless aspirates*) ఘోషవత్, అల్పప్రాణవర్ణ, గజడదబ (*Voiced unaspirates*) ఘోషవత్, మహాప్రాణవర్ణ, ఘఝఢధభ (*Voiced aspirates*) అనునాసికవర్ణ, ఙ ఞ ణ న మ (*Nasals*)

ఈ విధముగా వర్ణము లుపదిష్టములు. ఈ వర్గములలో తొలుత ఘోషతంత్రీసన్నికృష్ట కుసంజ్ఞక కంఠ్యవర్గము (*gutturals*) అనంతరము తత్సమీప వర్తి చుసంజ్ఞకతాలవ్యవర్గము (*palatals*) పిమ్మట విప్రకృష్టతర తుసంజ్ఞక దంత్యవర్గము (*dentals*), తరువాత విప్రకృష్టతమ పు సంజ్ఞక—ఓష్ఠ్యవర్గము (*labials*) క్రమముగా నుపదిష్ట మయ్యెనని కొంచెము పరికించినచో నుపపన్నమగును. శివసూత్ర మీ క్రమమును గ్రహింపలేదు. ఇంకొకటి గమనింపదగును. శివసూత్రము రెండుమారులు హకారమును పఠించినది. దాని ప్రయోజన మీకారికలో స్ఫుటమగును.

"హకారో ద్విరుపాత్తోయ మటిశల్యపి వాంఛతా
అర్హేణాధుక్ చిత్యేకత్ ద్వయం సిద్ధం భవిష్యతి."

వర్ణమాతృకలో ద్వివారము హకారపాఠము గాని, ప్రయోజనము గాని కానరాదు. మరియొక సంగతి "యేనాక్షర సమామ్నాయ మధిగమ్య మహేశ్వరాత్, కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం......" ఇత్యాది శ్లోకములవలన వ్యాకరణనిమిత్తమే అక్షర సమామ్నాయ మధిగత మయినది. కావున శివసూత్ర సమూహము వ్యాకరణవిషయిక ప్రత్యాహారములకొరకే పరికల్పితము. శిక్షాశాస్త్రముకొరకుగాని, వర్ణసమూహ ప్రతిపత్తికొరకుగాని కాదు. కైయటాచార్యుడు ప్రదీపములో "ప్రయోజనవార్థోహి వర్ణానా ముపదేశో న స్వరూపప్రతిపత్త్యర్థః" అన్నాడు. కాబట్టి ప్రాత్నికుల యనుమాన మనుమోదితము కానేరదు.

కొలదిలో విశేషమును నేర్పుతో సూచించుటకు శివసూత్రసమూహము స్వీకృతమయినది. శివసూత్రములకు ప్రత్యాహారసూత్రములు అనునది నామాంతరము. ప్రత్యాహారశబ్దమునకు "ప్రత్యాహ్రియన్తే సంక్షిప్యన్తే వర్ణా అస్మిన్నితి ప్రత్యాహారః" అని నిరుక్తి. జైనేంద్ర వ్యాకరణములో "ప్రత్యాహారోహి వర్ణైకముఖీకరణ మిష్యతే" అని చెప్పియున్నది. దీనిని జూచి, "ప్రస్తుతానాం వర్ణానా మేకముఖీకరణం ప్రత్యాహారః" అని కొందర న్నారు. ప్రత్యాహారసూత్రీయ వర్ణోపదేశ ముఖోద్దేశమునుగూర్చి వరరుచి కాత్యాయనుడు "వృత్తిసమవాయార్థ ఉపదేశోऽను బన్ధకరణార్థశ్చ" అన్నాడు. దీనిని వివరించు తలపుతో పతంజలి యిట్లు వ్రాసినాడు: "వృత్తిసమవాయార్థో వర్ణానా ముపదేశః......కా పున ర్వృత్తిః? శాస్త్రప్రవృత్తిః. అథ క స్సమవాయః? వర్ణానా మానుపూర్వ్యేణ సన్నివేశః. అథ క ఉపదేశః? ఉచ్చారణమ్. కుత ఏతత్? దిశి రుచ్చారణక్రియః ఉచ్చార్యహి వర్ణా నాహ— ఉపదిష్టా ఇమే వర్ణా ఇతి. అనుబంధకరణార్థశ్చ వర్ణానా ముపదేశః......న హ్యనుపదిశ్య వర్ణానను బంధాః శక్యా ఆసక్తుమ్. సఏష వర్ణానా ముపదేశో వృత్తిసమవాయార్థ శ్చానుబంధకరణార్థశ్చ. వృత్తిసమవాయ శ్చానుబంధ కరణంచ ప్రత్యాహారార్థమ్. ప్రత్యాహారో వృత్త్యర్థః."

ప్రత్యాహారవిషయమున కాశికలో "ప్రత్యాహారో లాఘవేన శాస్త్రప్రవృత్త్యర్థః" అని జయాదిత్యుడు లిఖించినాడు.

ప్రత్యాహారసూత్రముల చివరిహల్లులు ఇత్సంజ్ఞకములు. కావున అచ్ అన్నప్పుడు, ణ్ క్ ఙ్ చ్ ఈ నాలుగువర్ణములును గ్రహింపరాదు. ఈజాతి ఇత్సంజ్ఞకవర్ణగ్రహణము సమ్మతముకాదు. అష్టాధ్యాయిలోని 'ఉపదేశేऽజనునాసిక ఇత్' (౧-౩-౨) సూత్రమందలి అనునాసికశబ్దముద్వారా జ్ఞాపిత మయియుండును. కానిచో కకారమునకు అచ్త్వప్రాప్తి యగుచో ఇకారమునకు అచ్ప్రయుక్తయణాదేశము కానిపించెడిది. ప్రత్యాహారముల ఆద్యంతవర్ణములను గ్రహించినచో తన్మధ్యస్థిత సమస్తవర్ణగ్రహణ మయియుండును. అక్ అన్నచో 'అ ఇ ఉ ఋ ఌ' వర్ణగ్రహణ మగును. అందులకే అష్టాధ్యాయిలో 'ఆది రన్త్యేన

సహితా! (౧-౧-౭౦) అను సూత్ర మున్నది. అష్టాధ్యాయిలో నున్న ఈ రెండుసూత్రములును పాణిని ప్రణీతములు కావు; పాణినివ్యాఖ్యాసంగతము లనవచ్చును. సంప్రదాయవేత్తలయిన పూర్వాచార్యులవలన పాణినికి లభించియుండును. ప్రథమోక్తసూత్రములోని ఉపదేశ శబ్దమే ఇందులకు సాక్ష్యము. "ఉపదేశే ఇత్యుక్త... గురుకర్తృకతాయాః స్వరసతః ప్రతీతేః" అన్నాడు నాగేశభట్టు. ఉపదేశసంబంధమున ప్రాచీనకారిక యిట్లున్నది: "ధాతుసూత్రగణోణాది వాక్యలింగానుశాసనమ్, ఆగమప్రత్యయాదేశా ఉపదేశాః ప్రకీర్తితాః" 'ఉపదిశ్యన్తే పూర్వాచార్యైః' పఠ్యంతే యే ధాతుసూత్రాదయః త ఉపదేశాః' అని గ్రహింపవలయును.

పదునాలుగు శివసూత్రములనుండి అనేకప్రత్యాహారసంజ్ఞలు చేయవచ్చును. (ముగ్ధబోధవ్యాకరణములో ప్రత్యాహారసంజ్ఞకు సమాహారసంజ్ఞ అభిహితమయినది.) వానిలో నెన్ని మాహేశమున ప్రయుక్తము లయినవో యిప్పుడు తెలియదు. కాని అష్టాధ్యాయిలో అణాది శల్ పర్యంతము ౪౧ సంజ్ఞలు మాత్రము కానవచ్చుచున్నవి. వీనినిగూర్చి కాశికలో-

"ఏకస్మాన్ ఙ ఞణవటా ద్వాభ్యాం
షస్త్రిభ్య ఏవ కణమాస్స్యుః,
జ్ఞేయౌ చయౌ చతుర్భ్యో రః
పంచభ్యః శలౌ షడ్భ్యః."

అని యున్నది.

ఉక్తశ్లోకప్రకారము సంజ్ఞాసన్నివేశ మిట్లుండును:—

౧ ఏఙ్; ౨ యఞ్; ౩ అణ్; ౪ ఛవ్; ౫ అట్; ౬ ఝష్; ౭ భష్; ౮ అక్; ౯ ఇక్; ౧౦ ఉక్; ౧౧ అణ్; ౧౨ ఇణ్; ౧౩ యణ్; ౧౪ అమ్; ౧౫ యమ్; ౧౬ ఙమ్; ౧౭ అచ్; ౧౮ ఇచ్; ౧౯ ఏచ్; ౨౦ ఐచ్; ౨౧ యయ్; ౨౨ మయ్; ౨౩ ఝయ్; ౨౪ ఖయ్; ౨౫ యర్; ౨౬ ఝర్; ౨౭ ఖర్; ౨౮ చర్; ౨౯ శర్; ౩౦ అశ్; ౩౧ హశ్; ౩౨ వశ్; ౩౩ జశ్; ౩౪ ఝశ్; ౩౫ బశ్; ౩౬ అల్; ౩౭ హల్; ౩౮ వల్; ౩౯ రల్; ౪౦ ఝల్; ౪౧ శల్.

శివసూత్రములనుండి ప్రథమతః పూర్వణకారమును గ్రహించుటచే అణ్ సంజ్ఞ యేర్పడినది. అటు పిమ్మట కకారమువలన అక్ ఇక్ ఉక్ అను మూడు సంజ్ఞలును, అనంతరము ఙ్ వలన కేవల ఏఙ్ సంజ్ఞయు, ఈప్రకారముగా అన్యాన్యఇత్సంజ్ఞకవర్ణముల వలన ఇతరసంజ్ఞలును ఏర్పడినవి. పదునాలుగుసూత్రములలోని పదునాలుగు ఇత్సంజ్ఞకవర్ణములను గ్రహించినచో ఎన్ని ప్రత్యాహారసంజ్ఞలు అష్టాధ్యాయిలో నుత్పన్నమగునో వానినిగూర్చి భాషావృత్తికారుడగు వంగీయపురుషోత్తముడు శ్లోకము చెప్పినాడు:—

"ఏకం త్రీణి పునశ్చైకం
చత్వార్యేకం త్రయం త్రయమ్
ఏకం ద్వే షట్ తథైవైకం
చతుః పంచ షడేవచ."

పురుషోత్తముని ప్రకారము పాణిని—ఏకచత్వారింశత్—ప్రత్యాహారసంజ్ఞాసన్నివేశ మిట్లుండును:—

౧ అణ్ (కాశికలో ౩); అక్ (కాశికలో ౮) ౩ ఇక్ (కాశికలో ౯); ౪ ఉక్; (కా. ౧౦); ౫ ఏఙ్ (కా. ౧); ౬ అచ్ (కా. ౧౭); ౭ ఇచ్ (కా. ౧౮); ౮ ఏచ్ (కా౧౯); ౯ ఐచ్ (కా. ౨౦); ౧౦ అట్ (కా ౫); ౧౧ అణ్ (కా. ౧౧); ౧౨ ఇణ్ (కా. ౧౨); ౧౩ యణ్ (కా. ౧౩); ౧౪ అమ్ (కా. ౧౪); ౧౫ యమ్ (కా. ౧౫); ౧౬ ఙమ్ (కా. ౧౬); ౧౭ యఞ్ (కా.౨); ౧౮ ఝష్ (కా. ౬; ౧౯ భష్ (కా.౭); ౨౦ అశ్ (కా. ౩౦); ౨౧ హశ్ (కా. ౩౧); ౨౨ వశ్ (కా. ౩౨); ౨౩ జశ్ (కా. ౩౩); ౨౪ ఝశ్ (కా. ౩౪); ౨౫ బశ్ (కా. ౩౫); ౨౬ ఛవ్ (కా. ౪); ౨౭ యయ్ (కా. ౨౧); ౨౮ మయ్ (కా. ౨౨); ౨౯ ఝయ్ (కా. ౨౩); ౩౦ ఖయ్ (కా. ౨౪); ౩౧ యర్ (కా. ౨౫); ౩౨ ఝర్ (కా. ౨౬); ౩౩ ఖర్ (కా. ౨౭); ౩౪ చర్ (కా. ౨౮); ౩౫ శర్ (కా. ౨౯); ౩౬ అల్ (కా. ౩౬); ౩౭ హల్ (కా. ౩౭); ౩౮ రల్ కా. ౩౯); ౩౯ ఝల్ (కా. ౪౦); ౪౦ వల్ (కా. ౩౮); ౪౧ శల్ (కా. ౪౧)

శివసూత్రజాతములగు నేయే ప్రత్యాహారసంజ్ఞలను అష్టాధ్యాయిలోని యేయేసూత్రములలో పాణిని ప్రయోగించెనో యీ పట్టికలో జూడదగును :

౧ కాని ౫ - ఏఙ్. ఏఙి పరరూపమ్ (౬-౧-౯౪) [ప్రభృతి సూత్ర.

౨ ,, ౧౭ - యఞ్ - యఞ శ్చ (౪-౧-౧౬) [ప్ర. సూ.

౩ ,, ౧ - అణ్. పూర్వణయుక్త - కేఽణః [౭-౪-౧౩

౪ ,, ౨౬ - ఛవ్ - నశ్ఛవ్యప్రశాన్ (౮-౩-౭)

౫ ,, ౧౦ - అట్ కుప్వాఙ్నుమ్ వ్యవాయేఽపి [౮-౪-౨

౬ ,, ౧౮ - ఝష్ - ఝష స్తథోర్ధోఽధః [౮-౨-౪౦

౭ ,, ౧౯ - భష్ - ఏకాచో బశో భష్ ఝష న్త [స్థ్వోః (౮-౨-౩౭)

౮ ,, ౨ - అక్ - ఋత్యకః (౬-౧-౧౨౮)

౯ ,, ౩ - ఇక్ - ఇకో యణచి (౬-౧-౭౭)

౧౦ ,, ౪ - ఉక్ - ఉగిదచాం సర్వనామస్థానేఽ [ధాతోః (౭-౧-౭౦)

౧౧ ,, అణ్ - పరణయుక్త - అణుదిత్సవర్ణస్య [చాప్రత్యయః (౧-౧-౬౯)

౧౨ ఇణ్ - పరణయుక్త - ఇణః షః (౮-౩-౩౯)

౧౩ యణ్ ,, ఇకో యణచి (౬-౧-౭౭)

౧౪ అమ్ ,, పుమః ఖయ్యంపరే (౮-౩-౬)

౧౫ యమ్ ,, హలో యమాం యమి లోపః (౮-౪-౬౪)

౧౬ ఙమ్ ,, ఙమో హ్రస్వా దచి ఙముణ్ [నిత్యమ్ (౮-౩-౩౨)

౧౭ కాని ౬-అచ్ - అచోఽన్త్యా దిటి (౧-౧-౬౪)

౧౮ ,, ౭ - ఇచ్ - ఇజాదేశ్చ గురుమతోఽనృచ్ఛః [(౩-౧-౩౫)

౧౯ ,, ఏచ్ - ఏచోఽప్రగృహ్యస్యా దూరాద్ధూతే [(౮-౨-౧౦)

౨౦ ,, ౯-ఐచ్ - వృద్ధి రాదైచ్ (౧-౧-౧)

౨౧ ,, ౨౭-యయ్ - అనుస్వారస్య యయి పరస [వర్ణః (౮-౪-౫౮)

౨౨ ,, ౨౮-మయ్ - మయ ఉఞో వో వా [(౮-౩-౩౩)

౨౩ ,, ౨౮-మయ్ - ఝయో హోఽన్యతరస్యామ్ [(౮-౪-౬౨)

౨౪ ,, ౩౦-ఖయ్ - శర్పూర్వాః ఖయః [(౭-౪-౬౧)

౨౫ ,, ౩౧-యర్ - యరోఽనునాసికేఽనునాసికో వా [(౮-౪-౪౫)

౨౬ ,, ౩౨-ఝర్ - ఝరో ఝరి సవర్ణే (౮-౪-౬౫)

౨౭ ,, ౩౩-ఖర్ - ఖరవసానయో ర్విసర్జనీయః [(౮-౩-౧౫)

౨౮ ,, ౩౪-చర్ - అభ్యాసే చర్చ (౮-౪-౫౪)

౨౯ ,, ౩౫-శర్ - ఙ్ణోః కుక్టుక్ శరి [(౮-౩-౨౮)

౩౦ ,, ౨౦-అశ్ - భోభగోఅఘోఅపూర్వస్య యోఽశి [(౮-౩-౧౭)

౩౧ ,, ౨౧-హశ్ - హశి చ (౬-౧-౧౧౪)

౩౨ కాని ౨౨-వశ్ - నేడ్వశి కృతి (౭-౨-౮)

౩౩ ,, ౨౩-జశ్ - ఝలాం జశోఽన్తే (౮-౨-౩౯)

౩౪ ,, ౨౪-ఝశ్ - ఝలాం జశ్ ఝశి (౮-౪-౫౩)

౩౫ ,, ౨౫-బశ్ - ఏకాచో బశో భష్-(౮-౨-౩౭)

౩౬ ,, అల్ - అలోఽన్త్యస్య (౧-౧-౫౨)

౩౭ ,, హల్ - హలః (౬-౪-౨)

౩౮ కాని ౪౦-వల్ - ఆర్ధధాతుకస్యేడ్ వలాదేః [(౭-౨-౩౫)

౩౯ ,, ౩౮-రల్ - రలో వ్యుపధా ద్ధలాదేః సంశ్చ [౧-౨-౨౬

౪౦ ,, ౩౯-ఝల్ - నశ్చాపదాంతస్య ఝలి [౮-౩-౨౪

౪౧ - శల్ - శలఇగుపధాదనిటః క్సః (౩-౧-౪౫)

'అఇఉణ్' 'లణ్' ఈ రెండు ప్రత్యాహారసూత్రముల తుదిలో ణ ఉండుటవలన అణ్ ఇణ్ అను సంజ్ఞాద్వయములో ఏ ణకారము గృహీతమో అను సందేహము కలుగవచ్చును. అణ్ అన్నప్పుడు 'అ ఇ ఉ' అను మూడువర్ణములా, కాక అ మొదలు ల వరకు గల ౧౪ వర్ణములా ? ఇణ్ అనునప్పుడు ఇ ఉ అను వర్ణద్వయమా ? ఇ నుండి ల పర్యంతము గల ౧౩ వర్ణ

ములా ? సందేహమును నివారించుటకు 'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిర్నహి సందేహాదలక్షణమ్' అను ఆర్ష న్యాయానుసారముగా పాణినిసంప్రదాయమున ఆచార్యపరంపరలో ఈ కారిక వినవచ్చుచున్నది :

"పరేణైవేణ్ గ్రహాః సర్వే
పూర్వేణైవాణ్ గ్రహా మతాః
ఋతేఽణుదిత్సవర్ణస్యే
త్యేతదేకం పరేణతు"

దీనివలన, అష్టాధ్యాయిలోని కేవల 'అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః' (౧-౧-౬౯) అను సూత్రమున పరణకారయుక్త—అణ్ సంజ్ఞ ప్రయుక్తమయ్యెనని ఉపపన్నమగుచున్నది. కావున అన్యస్థలమునందెచ్చటనైనను అణ్ కనబడినచో అది పూర్వ'ణ'యుక్తమని గ్రహింపవలెను. అష్టాధ్యాయిలో సర్వదా ఇణ్ సంజ్ఞకు పరణకారమగును. పూర్వణయుక్త ఇణ్ సంజ్ఞాప్రయోగము పాణినీయమున గానరాకుండుటయే దీనికి హేతువు.

పాణిని - కాత్యాయన - పతంజలి ప్రోక్త త్రిమునివ్యాకరణమున 'ఇమ్' సంజ్ఞాప్రయోగము లేదు. పాణినికి పూర్వము శకటి—శాకటి—శాకటాయన—'ప్రోక్త త్రిమునివ్యాకరణమున తత్ప్రయోగముండెను. అందుచేతనే శాకటాయనీయ—ఔణాదిక ప్రకరణములోని 'ఇమన్తాడ్డః' (౧౧౯) అను సూత్రమున ఇప్పటికిని ఇమ్ సంజ్ఞాప్రయోగము కానవచ్చును. అష్టాధ్యాయిలోని 'ఉణాదయో బహులమ్' (౩-౩-౧) అను సూత్రముద్వారా శాకటాయనీయ—ఔణాదిక ప్రకరణమభ్యుపగతమగుచున్నది. కావుననే కొందరు పాణినీయమున ఇమ్‌సంజ్ఞ ప్రకారాంతరముగా గ్రహీతమయ్యెననుచున్నారు. అష్టాధ్యాయిలో చయ్ సంజ్ఞ కానరాదు. కాని 'నాదిన్యాక్రోశే పుత్రస్య' (౮-౪-౪౮) అను సూత్రముపై కాత్యాయనుడు 'చయో ద్వితీయాః శరి' అని వార్తికము రచించినాడు. దీనినిబట్టి పాణినినయమున చయ్‌సంజ్ఞ స్వీకృతమని కొందరన్నారు. వెనుక చెప్పిన ౪౧ సంజ్ఞలలో ఇమ్, చయ్ రెండును కలిసి మొత్తము ౪౩ కాదగును. బాలమనోరమలో కారిక యిట్లున్నది :

'స్యాదేకో ఙ ఞ ణ వటైః
షేణ ద్వే త్రయ ఇహ కణాభ్యామ్
చత్వారశ్చ చయాభ్యాం
పంచ యరాభ్యాం శలాభ్యాం షట్'

అష్టాధ్యాయిలో పాణిని స్వయముగా ఇమ్, చయ్ సంజ్ఞలు ప్రయోగింపలేదని కాశిక కాని, భాష్యవృత్తికాని వానిని పేర్కొనలేదు.

'ఉపదేశేఽజనునాసిక ఇత్' (౧-౩-౨) అను సూత్రము ద్వారా 'లణ్' సూత్రములోని అకారము అనునాసికత్వ హేతువువలన ఇత్సంజ్ఞ యయినది. కానిచో 'ఉరణ్ రపరః' (౧-౧-౫౧) అను సూత్రమున రకారముద్వారా రల్ గ్రహణము సంభవించెడిది కాదు. ఇందులకే కైయటాచార్యుని మతమున రప్రత్యాహార సత్తాహేతువుచే మొత్తమున ౪౪ సంజ్ఞ లయ్యెడివే. కాని శబ్దేందుశేఖరమున నాగేశభట్టు రామచంద్రుని మతానుసారముగా దీనికి ప్రతివాదము చేసినాడు. రప్రత్యాహారగ్రహణమున ఆచార్యప్రవృత్తి ఉపలబ్ధము కాలేదు అని భట్టు వ్రాసినాడు. ఇది అసంగతము కాదు. కారణము కలదు. "అతో ల్రాన్తస్య" (౭-౨-౨) అను పాణిని సూత్రము నాగేశునే సమర్థించును. ఈ సందర్భమున రామచంద్రపాఠకకృత 'రప్రత్యాహారవాదః', 'రప్రత్యాహారఖండనమ్' అను గ్రంథద్వయమున విపుల వివరణమును జూడవచ్చును. మొదటిగ్రంథము అడయారు లైబ్రరీయందు సురక్షితము. రెండవది A. S. B. గ్రంథాగారములో CODEX NO. 4329 V. S.

హయవరట్, హల్—ఈ రెండుసూత్రములలో హకారసన్నివేశ మున్నది. అన్ని వర్ణములను ఒకమారే పఠించినారు. హకారపఠనము రెండుమారు లెందులకు? ప్రయోజన మున్నది. ఈ సూత్రములు నిర్హేతుకములు కావు. అట్ పరణకారయుక్త అణ్-అమ్-అల్-అశ్-ఇశ్-హల్ సంజ్ఞలలో హకారమావశ్యము; కాని యణ్-యమ్-ఝయ్-ఖయ్-యర్-ఝష్ ప్రభృతిసంజ్ఞలలో దాని ప్రయోజనము లేదు. ఇతరల వల్-రల్-ఝల్-శల్-సంజ్ఞలో హకారప్రయోజనము కలదు కాబట్టి సంజ్ఞాకరణానుబోధమున శివసూత్రములలో హకారము

రెండువారములు పఠితమయినవి. ఈ విషయమంతయు సోదాహరణముగా తెప్పుటకయి అట్, శల్ సంజ్ఞా హాకారప్రయోజనసూచనార్థకమగు ప్రాచీనకారిక కలదు:

"హకారో ద్విరుపాత్తోఽయ మటి శల్యపి వాంఛతా
అర్హ్ణేణాధుక్షదిత్యేతత్ ద్వయం సిద్ధం భవిష్యతి."

కేవలము అట్, శల్ సంజ్ఞలకు శ్లోక ముద్దిష్టము కాదు. దీనియందు దిఙ్మాత్రోపదర్శిత్వమే కలదు. ఏతద్విషయమై 'హయవరట్ సూత్రవిచారః' అను గ్రంథమున విశేషవివరణ మున్నది. అది అడయారులైబ్రరీయందు సురక్షితము.

ముగ్ధబోధమున బోపదేవుడు ఒక హకారముతోనే సమాహారసంజ్ఞావ్యవస్థ చేసినాడుకదా; ఇతర సంప్రదాయములవారుకూడ నిట్లే చేసియుండవలసినదని కొందరన్నారు. ప్రత్యాహారసూత్రవర్ణవిన్యాసమున బోపదేవుడు ఏకహకారసన్నివేశమే చేసినను, సూత్రప్రస్థానమున అన్యహకారమును గ్రహించినాడు. సంధిపాదములోని "హోర్ఘుస్" (౨౧) సూత్ర వృత్తిభాగమున "హకారో ఘుస్ సంజ్ఞః స్యాత్" అన్నాడు. ఈ స్థానమున రామతర్కవాగీశు డిట్లు లిఖించినాడు: ఘుస్ ప్రత్యాహారేణ యద్యద్ విధేయం తత్తత్ హకారేణాపి భవిష్యతి. తేన బృంహిత మిత్యాదౌ హకారోఽపి నః, యద్యపి శషసాంతే హకారోపదేశాత్ 'అర్హ్ణేణ' 'అధుక్షీ' ఇత్యాది సిధ్యతి, తథాపి ఏహ ప్రత్యాహారస్య పరహకారేణ సందేహనిరాసార్థ మిత్యేకే. వస్తుతస్తు ఏకస్థానప్రయత్న విశిష్టవర్ణద్వయాభావజ్ఞాపనాయాస్య పృథగుపాదాన మితి." దీని యభిప్రాయ మిది. శివసూత్రములలో హకారము రెండుసారులు పఠించుటచే రెండు హకారములు భిన్నవర్ణములని భ్రమ కలుగుచ్చునని బోపదేవుడు ప్రత్యాహారసూత్రవర్ణవిన్యాసమున ఒక హకారమునే చూచి స్థానాంతరమున మరల సూత్రము ద్వారా విడిగా అన్యహకారమును గ్రహించినాడు. కాని తర్కవాగీశుడు చేసిన యాశంకను నివారించుటకై బోపదేవునికంటె బహుప్రాచీనుడు, మహామతి కైయటాచార్యుడు "ప్రయోజనార్థో హి వర్ణానా ముపదేశో నస్వరూపప్రతిపత్త్యర్థః" అని వ్రాసినాడు. ఏమయినను సూత్రకారుని సమర్థించుట టీకాకారుని విధి. తర్కవాగీశుడు సౌష్ఠవముతో కర్తవ్యమును నిర్వహించినాడు. కాని దుర్గాదాసు దీనిని చూచినను మాహేశశివసూత్రములను గ్రహియించి యిట్లు లిఖించినాడు: "నను, అ ఇ ఉ ఋ ౨ ఇత్యాదిసూత్రే, శష సహ ఇతి హకారస్య పునరుక్తా ఝహాసంజ్ఞయైవేష్ట సిద్ధౌ ఏతద్విధానం కథమితి చేన్న, ఏకవర్ణస్య ఉభయత్ర పాఠేన కౌశలాభావాత్." (సంధి ౨౧).

సమాహారసంజ్ఞ చేయుటకై సమాహారసూత్రము అవసరమయినచో, దానిని తొలుత వికలాంగము చేసి మరల సూత్రాంతరముద్వారా సాంగము చేయుట దుర్గాదాసుకు కౌశలముగా గానిపించెనా! వర్ణస్వరూప ప్రతిపత్తికై ప్రత్యాహారసూత్రము లుద్దిష్టములు కాలేదని ప్రాచీనఋషులు సరళభావముతో హకారపాఠము రెండుమారు లంగీకరించినారు.

సంప్రదాయలబ్ధ శివసూత్రములను పాణిని ఏవిధముగను మార్పలేదు. ఆయనకు బహుపూర్వకాలము నుండియు ఈసూత్రములు ప్రచారమునం దుండెను. లఘుశబ్దేందుశేఖరములో నాగేశభట్టు "ఋక్తంత్రవ్యాకరణే శాకటాయనోఽపి—ఇద మక్షరం ఛన్దో వర్ణశః సమనుక్రాన్తమ్...ఇతి" (ప్రత్యాహారసూత్రీయ వ్యాఖ్య ౮, ౯ పుట కాశీ సంస్క.) అని వ్రాసినాడు. దేవాధిదేవు డగు మహేశునివలన ఈసూత్రము లావిర్భవించినవి. అందుచేతనే ప్రాచీనఋషులు చిరప్రచలిత పాఠమును గ్రహించినారు. దీనికి—"సంప్రీతస్య హి లోకేనవదోషాన్వేషణం క్షమమ్, శివలింగస్య సంస్థానే కస్యాసభ్యత్వభావనా."

అతనది కారణము.

ఒక్కొక వర్ణమునుగూర్చి లణ్ హల్ సూత్రద్వయప్రయోజనజిజ్ఞాస అనుపపన్నము కాదు. అట్, షమ్—ఈ రెండు ప్రత్యాహారసంజ్ఞల నడుమ లకార నివారణముకై లణ్ సూత్రప్రయోజన ముపలబ్ధమయియుండును. "అట్ కుప్ వాఙ్ నుమ్ వ్యవాయేఽపి" (౮-౪-౨) అను సూత్రముచే అట్ ప్రత్యాహారగృహీతవర్ణసమూహము కవర్గ, పవర్గ ఆఙ్ నుమ్

ద్వారా వ్యస్తసమస్తభావమున వ్యవహితమయినను రకార షకారములకు పరస్థితమైన దంత్య నకారమునకు మూర్ధన్యణకారము వచ్చును. ఇక్కడ అట్ ప్రత్యాహారమధ్యమున లకార ముపయోగము కాక పోవుటచే లణ్ సూత్ర భిన్న పాఠము కర్తవ్యమాయెను. శర్ ప్రభృతి రాన్తసంజ్ఞయందు హకార ప్రయోజనము లేకుండుటవలన విడిగా నీసూత్రసన్నివేశము అనావశ్యకము కాదని హల్ సంబంధమున జెప్పవచ్చును.

ఝభఞ్, ఘఢధష్ అను సూత్రద్వయమున ఘోషమహాప్రాణవర్ణసమూహము (*voiced aspirates*) పఠితములగుటచే సూత్రపృథగ్భావ మావశ్యకమని అష్టాధ్యాయివలన నుపలబ్ధము. 'అతో దీర్ఘో యఞి' (౭-౩-౧౦౧) సూత్రమున యఞ్ ప్రత్యాహారము ప్రయుక్త మయినది. ఘోషమహాప్రాణవర్ణములను రెండు సూత్రములలో విభాగపూర్వకముగా పఠింపనిచో, ఉక్తప్రత్యాహారముద్వారా ధకారగ్రహణముచే 'సేవధ్వే' అను దానిస్థానమున 'సేవాధ్వే', 'అసేవధ్వమ్' అనుపదస్థానమున 'అసేవాధ్వమ్' మొదలగు అనిష్టపదములు దుర్వారము లయియుండును.

'ఖ ఫ ఛ ఠ థ చటతవ్' అను సూత్రమున మొదటి పంచఅఘోషమహాప్రాణవర్ణములును ((*Voiceless aspirates*), చివర మూడు అఘోషఅల్పప్రాణవర్ణములును (*Voiceless unaspirates*) పఠితములు. వీనివెంటనే కపయ్ సూత్రమున మిగిలిన రెండు అఘోషఅల్పప్రాణవర్ణములు పఠితములు. దీనికి కారణము కనుగొనవలెను. ఛవ్ ప్రత్యాహారముద్వారా ఇష్టవర్ణములను గ్రహించుటకై అఘోషఅల్పప్రాణవర్ణములు ద్విధావిభక్తము లయినవి. 'నశ్ఛవ్యప్రశాన్' అను సూత్రమున (౮-౩-౭) ఛవ్ ప్రత్యాహారయోగము కానవచ్చియుండును. ఛవ్ ద్వారా కకార పకారములు గృహీతములయినచో ఇష్టపదసాధన సంభవించును. కావున నీ సకలవర్ణపృథగ్గ్రహణము సాధకమయినది. శార్ఙ్గిన్ ఛిన్ధి—అనుచోట 'నశ్ఛవ్యప్రశాన్' (౮-౩-౭) సూత్రముద్వారా పదాంతస్థిత నకారస్థానమున రుత్వహేతువుచే తొలుత 'శార్ఙ్గిరు' అయి, పిదప 'ఖరవసానయో ర్విసర్జనీయః' (౮-౩-౧౫) సూత్రముద్వారా విసర్జనీయము వచ్చుటచే 'శార్ఙ్గిః' అగును. అనంతరము 'విసర్జనీయస్య సః' (౮-౩-౩౪) సూత్రముద్వారా సత్వహేతువుచే శార్ఙ్గిస్ అయి, 'స్తోశ్చునా శ్చుః' (౮-౪-౪౦) అనుసూత్రమువలన శకారమునకు తాలవ్యహేతువుచే మరల 'శార్ఙ్గిశ్' కాగా, 'అత్రానునాసికః పూర్వస్యతు వా' (౮ ౩-౨) 'అనునాసికాత్ పరోఽనుస్వారః' (౮-౩-౪) అను సూత్రములద్వారా వికల్పోక్త తాలవ్యశకారమునకు పూర్వము అనునాసికవర్ణ మగును. అనుస్వారము విహితమగుటచే 'శార్ఙ్గి ఁ శ్ఛిన్ధి', 'శార్ఙ్గిం శ్ఛిన్ధి' అను రెండు రూపములు సిద్ధము లగును. కాని ఛవ్ ప్రత్యాహారము ద్వారా కకార పకారములు గృహీతములు కాగా 'పశ్యన్ పురుషః'—ఇత్యాదిస్థానములలో ఉక్త సూత్రముద్వారా 'పశ్యః పురుషః' అను అనిష్టసంధియుక్తపదసృష్టి యగును. కావున ఈ రెండుప్రత్యాహారముల పృథక్సన్నివేశముకంటె ఉపాయాంతరము లేదు.

ప్రయోగరత్నమాలా టీకాకారుడు జయకృష్ణుడు మాతృకాక్రమమే మహేశ్వర ప్రోక్తమనియు, ప్రత్యాహారసూత్రసమూహము పాణినిప్రోక్త మనియు వ్రాసినాడు. "ఉక్తః శ్రీ వర్ణమాలాయాం మన్త్రి స్వోపచీర్ణయా" అను సూత్రటీకలో నతడు మరల కలాపక గణానుసారముగా "కృతేచ ఌకారపాఠే పాణినీయవర్ణక్రమే ఌకారాభావాత్ సూత్రప్రసిద్ధ మాహేశ్వరవర్ణమాలాలాభః. కాలాపైః సిద్ధపదోపాదానాత్ కల్పితస్య పాణినీయవర్ణక్రమస్య వ్యుదాసః కృతః" అన్నాడు. విషమోపన్యాసమే. ప్రసిద్ధవర్ణమాల జగత్పితముఖారవిందమునుండి వినిర్గతమగుట విచిత్రము కాదు. కాని ప్రత్యాహారసూత్రములు పాణిని ప్రణీతములు కాని, కల్పితములు కాని కావు. కారణములు—

(౧) ప్రత్యాహారసూత్రములు శివసూత్రములని చిరప్రసిద్ధి. భవిష్యపురాణములోను, నందికేశ్వరకాశిక లోను ఈ సూత్రము లన్నియు శివసూత్రములే యని స్పష్టీకృతములు. నందికేశ్వరుడు "ధాత్వర్థం సముపాష్టం పాణిన్యాదీష్టసిద్ధయే" అన్నాడు.

(౨) పాణినీయశిక్షలో నిట్లు స్మృతము :

"శంకరః శాంకరీం ప్రాదాత్
దాక్షీపుత్రాయ ధీమతే
వాఙ్మయేభ్యః సమాహృత్య
దేవీం వాచమితి స్థితిః,
యేనాక్షరసమామ్నాయ మధి
గమ్య మహేశ్వరాత్
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం
తస్మై పాణినయే నమః"

ఈస్థలమున శిక్షాభాష్యకారుడు "అక్షరసమామ్నాయ మితి ప్రత్యాహారా నాహుః" అన్నాడు.

(౩) వర్తమానకాలమున ముద్రితమగు అష్టాధ్యాయీ శివసూత్రములు పదునాలుగు నయినతోడనే అవ్యవహితముగా "వృద్ధి రాదైచ్" "అదేఙ్ గుణః" "ఇకో గుణవృద్ధీ" ఇత్యాది సూత్రములు కానవచ్చును. "ధర్మిణ ముద్దిశ్య ధర్మో విధీయతే" అను న్యాయమునకు విరుద్ధముగా వృద్ధిశబ్దము ప్రప్రథమముననే ఉల్లిఖితమగుటచే సూత్రమునందు విరోధవిమర్శదోష మేర్పడినది. శాబ్దికాచార్యు లిట్లన్నారు :

"అనువాద్య మనుక్త్వైవ న విధేయ ముదీరయేత్
నహ్యలబ్ధాస్పదం కించిత్ కుత్రచిత్ ప్రతితిష్ఠతి"
(ఏకాదశీ తత్త్వధృతప్రమాణము)

అనువాద్య మనగా ఉద్దేశ్యము. పదగతమని, వాక్యగతమని విధేయావిమర్శదోషము రెండువిధములు. ఏకావళి యందు విద్యాధరు డిట్లన్నాడు :

"న విధేయప్రాధాన్యం వృత్తిః
వక్తుం ప్రగల్భతే యస్మాత్
అవిమృష్టవిధేయాంశః
తస్మా దస్యా ముదీర్యతే దోషః.
అనువాద్యవిధేయాంశౌ
వ్యుక్తౌ స్యాతాం విపర్యయేణ యదా
అవిమృష్టవిధేయాంశో
భవతి తదానీం తు వాక్యగతః" (౬-౧,౨)

ఈ దోషములు పాణినికి తెలియకపోలేదు. పదగతవిధేయావిమర్శదోష మగునని ఆయన అధిక్షేపార్థమున దాసీపత్యాదిపదపరివర్తముగా 'దాస్యాః పతిః' ప్రభృతి సమస్తపదములకై "షష్ఠ్యా ఆక్రోశే*" అను సూత్రము చేసినాడు. దీనిని లక్ష్యమునం దుంచికొని వ్యక్తివివేకమున రాజానక మహిమభట్టు "ఏతదాచార్యస్యాప్యనుమతమే వేతి జ్ఞాయతే. తదయం వృషల్యాః కాముకో దాస్యాః పుత్ర † ఇత్యాదా కాముకాదేరాక్రోశాదపకర్ష ప్రతిపత్తయే సమాసేఽపి విభక్తే రలుక మాహ" దీని వ్యాఖ్యానపరముగ రాజానక రుయ్యకుడు "సమాసేఽపి యది విభక్తిః శ్రూయతే తదా న విధేయావిమర్శో యథా దాస్యాః కాముక ఇత్యాదౌ" అన్నాడు. మరల పక్షాంతరమున వాక్యగతవిధేయావిమర్శదోష మగునని పాణిని "అదేఙ్ గుణః" (౧-౧-౨) అని సూత్రీకరించినాడు. సూత్రమున అర్ధమాత్రాలాఘవన్యాయము చిరప్రసిద్ధము. సంగ్రహకారుడు వ్యాడి "అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" అన్నాడు. కావుననే యిది నేటికిని పరిభాషాపరిగణితము. కావున 'అదేఙ్ గుణః' అనకుండ సూత్రకారుడు 'గుణోఽదేఙ్' అనవలసినది. కాని పక్షాంతరమున వాక్యగతవిధేయావిమర్శదోషము సంఘటిల్లునని స్వగోష్ఠీవిహితన్యాయమర్యాదను రక్షింపక సూత్రకారుడు 'అదేఙ్ గుణః' అని పలికినాడు.

మంచిది! 'ఆదైజ్ వృద్ధిః' అనక పాణిని 'వృద్ధిరాదైచ్' అని యేల ఉపదేశించినాడు? మహాభాష్యమున దీనికి సమాధానము కలదు. "ఏత దేక మాచార్యస్య

---

* సంక్షిప్తసారమున "క్షేపే షష్ఠ్యాః" (సమాసపాదము ౧౪౬) అని సూత్రితము. ఈ సందర్భమున గోయీచంద్రు డిట్లన్నాడు: "క్షేప ఆక్రోశః ......... క్షేపే గమ్యమానేఽనుత్తర పదభూతాయాః షష్ఠ్యా అలుగ్ భవతి. స్వరూపాఖ్యానేతు దాసీపతి రిత్యేవ భవతి".

† వస్తుతః 'పుత్రేఽన్యతరస్యామ్' (౬-౩-౨౨) అను సూత్రానుసారముగా 'దాసీపుత్రః' 'దాస్యాః పుత్రః' ఏకార్థకములు. సంక్షిప్తసారమున 'పుత్రేవా' (సమాసపాదము ౧౪౫) అని సూత్రితము. కాతంత్ర పరిశిష్టమున శ్రీపతి, "షష్ఠ్యాక్రోశే, పుత్రేవా" అని సూత్రీకరించినాడు. (సమాస. ౧౩, ౧౪).

మంగళార్థం మృష్యతామ్, మాంగలిక ఆచార్యో మహతః శాస్త్రౌఘస్య మంగలార్థం వృద్ధిశబ్ద మాదితః ప్రయుంక్తే" అని అందులో స్మరించినారు. కాతంత్ర పరిశిష్టప్రారంభమున "వృద్ధి రాదేశస్య" అని సూత్రము. దీనిపై కౌలాపకు లిట్లన్నారు:

"ఆదేశోనను వక్తు మాద్య
ఉచితః శేషే కథం నిర్మితి
ఐదౌతా వితి నిర్మితేఽప్య
భిమతే వ్యాప్తేనవా కింఫలమ్
సత్యం మంగళహేతవే నిజకృతే
నిర్విఘ్న సిద్ధీప్సునా
గ్రంథారంభ పదూపరిగ్రహ విధా
వృద్ధిః కృతాదా వియమ్."

ఏమయినను శాస్త్రారంభమున మాంగళికాచారము అధికతర ప్రయోజక మని పాణిని విధేయావిమర్శ దోషము నుపేక్షించి, సూత్రపాఠప్రారంభమున వృద్ధిశబ్దసంయోగము చేసినాడు. కావుననే కాతంత్రపరిశిష్టప్రారంభసూత్రమువలెనే ఇది అష్టాధ్యాయీ ప్రథమసూత్ర మనుటకు సందేహము లేదు. ఇందులకే శివసూత్రములు పదునాలుగింటి తరువాత అష్టాధ్యాయీ సూత్రగణన 'వృద్ధిరాదైచ్' తోడనే ఆరంభ మయినది. శివసూత్రములు పాణినిప్రణీతము లయినచో, అందు వృద్ధిరాదైచ్ సూత్రమున విధేయావిమర్శదోష మంగీకృత మయియుండెడిది కాదు.

(౪) పాణినికి బహుపూర్వమే శాకటాయన ముని రచితమైన ఋక్తంత్రనామక సామవేదీయప్రాతిశాఖ్య యుండెను. దాని ప్రారంభమునను ప్రత్యాహారసూత్రము లుండెను. అందులకే ఈసూత్రము లన్నిటినిగూర్చి నాగేశభట్టు "......ఏవం చాయ ముపదేశః పాణినే రన్యకృతఇతి..." (లఘుశబ్దేందుశేఖర. (ప్రత్యాహారసూత్రవ్యాఖ్య) అని వ్రాసియున్నాడు. ఋక్తంత్రమిప్పటికిని దుర్లభము కాదు. శకటి-శాకటి-శాకటాయన వ్యాకరణములో గూడ అక్షరసమామ్నాయ మిట్లే యుండెనని ప్రతీతి. ఉక్త వ్యాకరణములో 'ఇష్మన్తా డః' అను ఔణాదిక సూత్రమున శివసూత్రజాతఇష్ప్రత్యాహారము దృష్టమయి యుండును.

(౫) శాకటాయనునకు చాలపూర్వమే ఐంద్ర వ్యాకరణమున ప్రకారాంతరముగా శివసూత్రోద్ఘాటనము కలదు. అందుచేతనే ఉపమన్యువు "తథాచోక్తం ఇంద్రేణ—అంత్యవర్ణసముద్భూతా ధాతవః పరికీర్తితాః—ఇతి" అని కాశికాతత్త్వ విమర్శినిలో చెప్పినాడు. ఇంద్రుడు శివసూత్రోల్లేఖనము చేసినపుడు మాహేశముకంటె వేరుగా అక్షరసంధానము యుక్తియుక్తము కాదు.

(౬) శ్రుతిస్మృతులు భిన్న భిన్న శాఖలలో పాఠాంతరములు పొందినట్లే భిన్నభిన్న శాఖలలో వ్యాకరణములలో శివసూత్రములకు కొలదిగా పాఠాంతరము లేర్పడినవి. సౌబర సంప్రదాయములోని 'ఐ ఔ ష్' 'శ ష సర్' సూత్రస్థానమున పాణినీయ సంప్రదాయములోని 'ఐ ఔ చ్' 'శ ష స ర్' అను సూత్రములు కానవచ్చును. అందులకే నేటికిని ఫిట్ సూత్రములు 'ఇగన్తానాంచ ద్వ్యషామ్' 'జనపద శబ్దానా మషంతానామ్' 'హయాదీనా మసంయుక్తలాన్తానా మన్తః పూర్వంవా' ఇత్యాదులు కానబడును. వీని నన్నిటిని జూచి చంద్రగోమి "ఏష ప్రత్యాహారః పూర్వవ్యాకరణేష్వపి స్థిత ఏవ. అయంతు విశేష 'ఐ ఔ ష్'ఇతి యదాసీత్ తత్ ఐ ఔ చ్'ఇతి కృతమ్. తథాహి 'లఘావన్తే దయోశ్చ' 'బహ్వషో గురుః' 'తృణధాన్యానాంచ ద్వ్యషా'మితి పఠ్యతే"అని వ్రాసినాడు. పాణిన్యాదిపరవర్తి వైయాకరణులు తత్పూర్వవర్తివ్యాకరణసమూహము ఐ ఔ ష్ అను ప్రాచీనప్రత్యాహారసూత్రమునకు పాఠాంతరము స్వీకరించినారని దీనినిబట్టి చెప్పవచ్చును. కావున పాణినికి చాల పూర్వమునుండియు శివసూత్రప్రచారమున్నట్లు చంద్రగోమిమతము. ఇట్టిస్థితిలో పాణిని శివసూత్రప్రణేత యనుటకు వీలులేదు.

పాణిని ప్రాచీనశివసూత్రములకు పాఠాంతరము చేసినాడని చంద్రగోమిమాటలనుబట్టి తోచును. కాని నిజసంప్రదాయమున సూత్రము లేరూపమున నుండెనో యారూపముననే పాణిని గ్రహించినాడని అస్మదాదుల మతము.

(౭) శివప్రసాదమున పాణినికి శివసూత్రములు లబ్ధము లయ్యెనని భవిష్యపురాణమతము.

# పూర్వసాహిత్యవీథులు

శ్రీ నిడుదవోలు వెంకటరావు

౧

## తెనుగుకన్నడముల పొత్తు

### ౧. మదనవిజయము-రావిపాటి తిప్పన

ప్రశస్తకవియగు రావిపాటి త్రిపురాంతకుడు 'మదన విజయము' అను తెనుగు కావ్యమును రచియించి నట్లు త్రిపురాంతకోదాహరణపీఠికయం 1 దిట్లు తెలిపి యుంటిని.

### మదన విజయము

"ఇయ్యది రొనిమిదాశ్వాసముల గ్రంథ మనియు, కామశాస్త్రవిషయిక మనియు, నిందు సంజ్ఞాభియోగిక భార్యాధికార, పారదారిక, వైశికాదిప్రకరణములు గలిగియున్నదనియు వ్రాసి, ప్రతి క్రిమిదష్టమైయుంట నందుండి రెండు పద్యములు మాత్రమే తొలి కూర్పున 2 శ్రీ రామకృష్ణకవిగా రుదాహరించినారు.

సతి గుణవతి యగుసేనియు
పతి కది రత్నంబ ప్రాణబంధువ యమృతం;
బతివయ దుర్గుణి యగునే
బతి కెసపని చిచ్చు కాలుపక యది కాల్చున్.

గుణముఁ సుందరరూపముఁ విభవముఁ
గూటంబు సౌభాగ్యల
క్షణముం జారుచరిత్రముఁ వినయముఁ
జాతుర్యముఁ ధర్మధూ
ష.ణముం గల్గి పతివ్రతామహిమ విం
చం గల్గనే దత్పతీ
మణి చింతామణి దాని దాల్పగలగఁ
మర్త్యుండె, మర్త్యుం డిలన్.

పై ప్రకరణవిభాగము సంస్కృతకొక్కోక మున గలదు. కొక్కోకమును తెనుగున రచియించిన కూచిరాజు యెఱ్ఱన త్రిపురాంతకుని నుతియించుట నీ గ్రంథకర్తృత్వము నిశ్చయ మని చెప్పనొప్పును."

మైసూరువిశ్వవిద్యాలయమువారు క్రిందటి యేడు ప్రకటించిన మల్లికార్జునుని 'సూక్తిసుధార్ణవము' అను కన్నడభాషాసంకలనగ్రంథము చదువుచుండగా నందు ౧౫౧ పుటలో చంద్రోదయవర్ణనమున నీ క్రింది పద్యము కానవచ్చినది.

"గుణముం సుందరరూపముం విభవముం3
సౌభాగ్యముం భాగ్యల
క్షణముం చారుచరిత్రముం కులము మె
ళ్పుం సత్యముం ధర్మ భూ
షణముం సంద పతివ్రతామహిమయుం
దానత్వముం బంధు ర
క్షణముం పెండిరొళక్కుమెయి దె4 పురుషర్
యోజిప్ప దొందోజయం."

(మదనతిలకం, ౬-౧౪)

పద్యమురొక్కు రెత్తుగడయు, పదబంధము రెండింటియందు సమానమే యని వేఱుగ చెప్పనక్కర

1. త్రిపురాంతకోదాహరణము- పుట ౧౫. పీఠిక, విపులవ్యాఖ్యతో గూడ నాచే సంపాదితమై ప్రకటితమైనది.

2. విద్వద్వర్యులు మానవల్లి రామకృష్ణకవిగారు. ౧౯౧౨ ముద్రణ పీఠిక.

3. పుటియకుసుమ విన్నాణముం (ఖ).

4. [పురు] షం.(బఖ) అని పాఠభేదములు చూప డినవి.

లేదుగదా! ఇక కన్నడమున లేని యతిస్థానకపు తెలుగున పదములు చేర్చబడినవి. తిప్పన కన్నడమున నున్న మదనతిలకము చూచియే మదనవిజయమును రచియించియుండు నను తలంపుతో 'మదనతిలకము₅' పరిశీలింపగా పై రెండవ పద్యమును—

"సతి గుణవతియగు నేనియు
పతి కది రత్నంబు, ప్రాణబంధువ యమృతం;
బతివయు దుర్గుణి యగునే
పతి కడపని చిమ్ము కాలుపక యది కాల్చున్"

అను కందమునకు మూలము—

"సతి గుణవతి దొరకొండొడె
పతిగా స్త్రీరత్న మెంబ పెసరం పడెగుమ్
పతి దుర్గుణి దొరకొండొడె
పతిగా స్త్రీవ్యాధి యెంబ పెసరం పడగుమ్.
(అష్టమాధికారము-పుణ్యాంగనాధికారము)

కూడ లభించినది. కావున తిప్పన సంస్కృత కోశాధికమును కాక మదనతిలకమునే తెనుగున వ్రాసెనని చెప్పవలెను. మదనతిలకమున కోకశాస్త్రప్రకరణ విభాగము విపులముగా నధికారములతో నున్నది. తెనుగున నాశ్వాసములలో ప్రకరణ విభాగమును బట్టి కూచిరాజు ఎఱ్ఱన్న తెనుగు కోకశాస్త్రమున 'రావిపాటి త్రిపురాంతకాదిశృంగారకవుల నెల్ల గారవించి' యని తిప్పనను నుతియించియుండును. మదనవిజయము లభ్యము కాలేదు. కవిగారు దాని నొక్కగడియమాత్రమే చూచినారట!

---

5. మదనతిలకము చంద్రరాజకృతము. ఇది క్రీ. శ. ౧౦౧౫ - ౧౦౪౨ వఱకు కన్నడదేశము పాలించిన జయసింహుని కాలమున రచితమైనది. ఇది నేటివఱకు అముద్రితముగానే యున్నది. ప్రాచ్యలిఖితభాండాగారప్రతిసంఖ్య (D ౭౯౩) గల వ్రాతపుస్తకమును పరిశీలించితిని. అందు ౩౧ పుటలో పై పద్యము గలదు. ఇందు శృంగారవిషయమే గాక చిత్రబంధకవిత్వము గూడ విశేషముగా గలదు.

6. దొళ్ళుడినిం బుధంబలుం (ఖ)

7. సమగ్రముగ్ల కవియాసువు దొప్పడె. అని పాఠాంతరములు పుటయడుగున చూపబడినవి.

2. పెద్దన్నగారి చాటువు-నిరుపహతిస్థలంబు

సూక్తిసుధార్ణవములోనే పీఠికాప్రకరణమున (౧౩ పుట) నీ క్రింది కన్నడపద్యము గలదు.

"నిరుపహతిస్థలం, మృదుత
రాసన, రమ్యెళ్లణి సింపుదంబులం
సరపిద పుస్తకప్రతతి
లేఖకవాచకసంగ్రహం నిరం
తరగృహనిశ్చితస్థితి వి
చారకసంగతి సత్కవిత్రసా
దరతెయి నుళ్ల సత్కవియు
మాసువదాగద 7 కావ్యవార్ధియం"
(౪౦ పద్యము)

పైపద్యము చూడగనే పెద్దన్నగారి యీక్రింది చాటువు చప్పున స్మరణకు రాకమానదు.

"నిరుపహతిస్థలంబు రమ
ణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన
భోజన మొయ్యెలమంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ దెలి
యంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినగాని యూరక కృ
తుల్ రచియింపు మటన్న శక్యమే!"

చివరపాదమున భావము మారినను, ఎత్తుగడ, పదబంధము తెనుగుపద్యమునకు కన్నడపద్యము మూలమని పట్టియిచ్చుచున్నవి.

తెనుగున యతినియమమువలన మార్పులు కన్నడపద్యము ననుసరించి వచ్చినవి.

నిరుపహతిస్థలంబు రెండింటికి సమానము. మృదుతరాసనము-ఒయ్యెలమంచము. ఒళ్లణిసి-ఇంపయిన భోజనము. ఇంపుదంబులం-కప్పురవిడెము. పుస్తకప్రతతి లేదు. లేఖకవాచకసంగ్రహం-లేఖకపాఠకోత్తములు. నిరంతర గృహనిశ్చితస్థితి, సత్కవిత్రసాదరత-'రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు' అను విశేషణమున గర్భితము. విచారకసంగతి-ఒప్పుతప్పరయు రసజ్ఞులు. చివర కావ్యవార్ధి గనుచుట, "ఊరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే" అను భావముగా మారినది.

సూక్తిసుధార్ణవమున నుదాహరింపబడిన యీ కన్నడ పద్యము క్రీ. శ. ౧౨౪౦ ప్రాంతముకన్న పూర్వపుపద్య మనుట నిశ్చితమే. సూక్తిసుధార్ణవము సంకలనగ్రంథము. సంస్కృతమున శార్ఙ్గధరపద్ధతి, సూక్తిముక్తావళి, సుభాషిత రత్నభాండాగారము, తెనుగున సకలనీతిసమ్మతము, ప్రబంధ రత్నాకరము మొదలగువానిని పోలినది. ఇందు ౧౮ వర్ణనలకు క్రీ. శ. ౧౨౪౦ ముందు గల కావ్యములనుండి యుదాహరణ ములు గైకొనబడినవి. కావ్యముల పేరులు పద్యముల క్రింద నుదాహృతములైనవి.

పై 'నిరుపహతిస్థలంబు' అను పద్య మే గ్రంథము నుండియో చెప్పలేదు కాని రెండుపద్యముల వెనుక, (అనంతనాథపురాణం, ౧-౪౦) అని వ్రాయబడి యున్నది. ఈ పద్యమునకు ముం దున్న పద్యమునకు పూర్వము పంపరామాయణ ముదాహరింపబడియున్నది. కాబట్టి 'నిరుపహతిస్థలం' అనునది యనంతనాథపురాణ ములో నుండునేమో యని చూచితిని. కాని యం దీ పద్యము లేదు.

పెద్దన్నగారు, కృష్ణదేవరాయలు కోరగానే పై కన్నడపద్యము స్ఫురణకువచ్చి, తెనుగున చాటువుగా చెప్పియుందురు. కృష్ణరాయడు కన్నడరాయడు, తెనుగురాయడు కాబట్టి యానాడును తెనుగుకన్నడ ముల పొత్తున్నదని తెలుపుటకీ చిన్ని యుదాహరణము చాలును.

## ౨
# ఆంధ్రరాజకవులు

### పూసపాటి రాచిరాజు

తెలుగుదేశమున ప్రఖ్యాతి చెందిన రాజవంశము లలో పూసపాటివారి వంశ మొకటి. ఈ వంశీయులు కృతికర్తలు, కృతిభర్తలునై తమ సంస్థానమును గీతి సాహితీకళల కాస్థానరంగము గావించిన విద్వత్ప్రభు వులు. ప్రస్తుతము విశాఖమండలమున విజయనగరాధీశు లైన రాజేంద్రు లీ వంశీయులే. పూసపాటివారు వసిష్ఠ గోత్రులగు సూర్యవంశక్షత్రియులు. వీరి కూటస్థుడు మాధవవర్మ. ఈతడు పూసపాడును నిర్మించి అందే నివసించుటచే మాధవవర్మతరువాతివారు పూసపాటివా రైరి. వారిలో అమలరాజు ప్రసిద్ధుడు. ఈతని యనంతరము తిమ్మరాజునకు, నన్నమాంబకు రాచిరాజ కవీంద్రుడు జన్మించి క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమున విలసిల్లినవాడు. ఈత డుత్కళదేశాధీశుడగు ప్రతాప రుద్రగజపతివలన పూర్వకృష్ణామండలమున కేతవర మను దుర్గమును పట్టముపొందిన మహామండలేశ్వరుడు. గజపతికూతురైన అక్కమాంబను పరిణయమై, శ్రీకృష్ణ దేవరాయలు ఉదయగిరి కొండవీడుదుర్గములను ముట్ట డించినప్పుడా దుర్గపాలకుడుగా, తన బావమరదియగు వీరరుద్రగజపతితోగూడ రాయల కెదురు నిల్చి పోరా డిన మహావీరుడు. రాజమార్తాండబిరుదమును ధరించిన నీ రాజకవి కలమును, ఖడ్గమును నొకే రీతిగా చేపట్టిన రాజన్యుడు.

ఈ రాజకవీంద్రుడు నవభారత మను కృతికి నాయకు డయ్యెనని పూసపాటి వంశీయులలో నొకడగు తమ్మభూపాలుడు (క్రీ. శ. ౧౬౪౦) రచియించిన కృష్ణవిజయములోని యీక్రిందిపద్యమునుబట్టి తెలియు చున్నది.

"నవభారతాఖ్యనవ్యకావ్యమునకు
నాయకుండయ్యె నే నరవరుండు
కటకేశ్వరునిచేత గని కేతవర మాత్మ
పురముగా నేలె నేభూవిభుండు
నిలిపె బారుహామన్నె నృపగండపెండేర
మెవుడు డాకాల నే నృపతిమౌళి
అఖిలసద్గుణవతి యక్కమాంబాదేవి
ప్రాణేశు డయ్యె నే పార్థివుండు
ప్రథితగజపతిరాజవీరప్రతాప
రుద్రకన్యాధినాయకారూఢతిమ్మ
రాజజనకత గాంచె నేరాజతిలక
మత డలరు తమ్మవిభురాచయప్రభుండు."

ఈ గ్రంథమున నిట్లు చెప్పబడినను నరసభూపాలు రాజీయము అను గ్రంథమున రాచిరాజు నవభారతమును రచించినట్లుగానే చెప్పబడియున్నది.

"వారిలోపల రాచభూవాసవుండు
గండపెండేరమును బూని దండి మూర్తి
భారతంబన కృతిచేసి భాసురముగ
శ్వేతవరపట్టణేశుడై కీర్తిమించె."

కాబట్టి, కృతిభర్తయైనను, కృతికర్తయైనను నీతడు విద్వత్కవి యనుటకు సందియము లేదు. ఇక స్పష్టముగా రాచిరాజకృత మని చెప్పదగినది, మనకు లభ్య మగుచున్నది వసిష్ఠగోత్రక్షత్రియుల సీసమాలిక. ఇందులో నేబదియాఱు సీసపాదములు గలవు. మాలిక చివర కవినామమును, బిరుదులను దెలుపు గీతపద్యము గలదు. ఈమాలిక పూసపాటివారి కిలువేల్పయిన శ్రీరామచంద్రుని కర్పితము. మాలికఆద్యంతము లిట్లున్నవి.

"శ్రీకరంబైన వసిష్ఠగోత్రోద్భవుల్
సప్తారిషేయుల సార్వభౌమ
లాధరాధీశవంశావతారాదిప్ర
శస్తవృత్తాంతంబు విస్తరింతు:
అలఘువిక్రముడు కోసలజయాదిత్యుండు
దక్షిణవిజిగీష దాడివెడలి
నిగమాగమాంతపారగు డాజి భీష్ముండు
శ్రీదేవవర్మ సైన్యాధిపతిగ
నఖిలసీమల విజయస్తంభములు నాటె
దివి కేగెను, త్రిలింగదేశభూమి
వాహినీపతి దేవవర్మ ప్రభుండయ్యె
అద్దూరిసీమలో నాజి గొండ్రు
వల్లభు నోడించి వైభవంబుల మించి
సార్వభౌమపదంబు జగతి గాంచె;
అతని సుతుండు బుద్ధావనీసుడు రాచ
తపసియై కాంచెను ధర్మనృపుని
తనయు లాతనికి బుద్ధయ దేవవర్మలు;
బుద్ధరా జందు ప్రసిద్ధుడయ్యె
అతని తనూజు డాతతబలోన్నసుడును
ధవవర్మనృపతిముత్తాతబోలి
జనకునాజ్ఞను సప్తోతి సాంగముగ రామ
దేశుచే నుపదేశ మొంది
కనకదుర్గాకటాక్షప్రాప్తవిభవుడై
మళయసింగని ఘోర సమ్మందశేసి
చాళుక్యహస్తి మల్లబాహాధిపుని రక్త
ధారచే, పరదేవతను భజించె
వసుదిగింద్రియశకవత్సరంబుల జయ
పాటికాదుర్గవైభవము గాంచె
గగనవాణీవాక్యగౌరవంబున బూస
పాటిభూమిని పురీవరముగట్టి
వానిగాంచుట బూసపాటివా రను నింటి
పేరు గాంచిరి రాచపెద్దలయిన
నమలరాజాదిగా ప్రముఖులు మావారు
తత్గృహనామముల్ దాల్చుచుండ్రి."

... ... ... ...

నడుమ నేబదివసిష్ఠగోత్ర క్షత్రియుల వృత్తాంతము తెలిపినపిమ్మట చివర నిట్లు తన్నుగూర్చి చెప్పుకొన్నాడు.

"∴ శరణాగతత్రాణబిరుదువార
లనుచు శ్రీరామచంద్రార్పణముగ ఋతు
గగనాబ్ధిచంద్రశకంబునందు.
సరససంగీతసాహిత్యచక్రవర్తి
రాజమార్తాండశ్రీతమ్మిరాజరాజ
రాచిరాజోదితంబు విభ్రాజితంబు
ధరణివెలయుత నాచంద్రతారకముగ."

పై కాలసంఖ్య నిట్లు దెలుపవచ్చును.

ఋతు—౬, గగన—౦, అబ్ధి—౪, చంద్ర—౧ "అంకానాం వామతోగతిః" అను సూత్రము ననుసరించి యిది ౧౪౦౬ అగును. ఇది శాలివాహనశకము. ౧౪౦౬ + ౭౮ యైనయెడల క్రైస్తవశక మగును. కాగా క్రీ. శ. ౧౪౮౪ లో సీమాలిక రచిత మైనట్లు నిర్ధారితము.

తెలుగుదేశమందలి యేబది ప్రసిద్ధక్షత్రియవంశముల విశేషములను దెల్పు సీమాలిక యాంధ్రదేశీయ స్థానికచరిత్రకారుల కెంతయేని యుపయుక్తముగ నున్నది. కేవల చారిత్రకములకేగాక, సారస్వతముగ నిది యిక్కాలి విలువ గలది. కాలము సందిగ్ధముగ నున్న ప్రసిద్ధప్రాచీనకవి వేములవాడ భీమకవి కాలమును సరిగా నిర్ణయించుట కీ మాలిక తోడ్పడుచున్నది.

క్రీ. శ. ౧౫౬౦ ప్రాంతమున పింగళిసూరన తన రాఘవపాండవీయములో "భీముని తొల్లి చెప్పె నను పెద్దలమాటయె గాని యందు నొం డేమియు జేయడాళ్ నిలుచు కెవ్వరు కానరు" అనుపద్యమువలన భీమకవి రాఘవపాండవీయకథావస్తువు గల యొక ద్వ్యర్థి కావ్యము రచించె ననుట యంద అంగీకరించినదియే. ఈమాలికలో భీమకవి రచించినది రామగోపాల చరిత్ర మనియు, నది పూసపాటివారి వంశీయులలో నొకడగు భీమరాజునకు దండనాథుడైన దానరాజునకు కృతి యనియు తెలియుచున్నది.

"మామకవంశభీమనృపాలసచివుండు
దండనాథాగ్రణి దానరాజు
౭ వేములవాడ శ్రీ భీమునిచే రామ
గోపాలచరితంబు గొనిన కీర్తి."

ఈ రామగోపాల చరితమునకే . రాఘవవాసు దేవీయ మని పేరు. ఈ రాఘవవాసుదేవీయమునుండి పద్యము ప్రాచీనలక్షణగ్రంథములయం దుదాహృతమై యున్నది. గ్రంథముగూడ నేడు మఱియొక కవికృతిగా లభ్యమగుచున్నది.

ఈ మాలికలో నీ దానరాజు కాలముకూడ తెలుప బడినది. ఈతడే పెద్దాపురమును పాలించిన వత్సవాయి వారి మూలపురుషుడు. వీరిది సీసపాదమునకు వెనుకనే

"వత్సవాయిని చంద్రవర్మచే గిరినిధి
గగనేందుశకముల గాన్క నొంది
పజ్జాపురము గొట్టి పకలారిమండల
భీయదప్రతాపంబు బాదుకొలిపి
వెలసె నావంశజు లిల వత్సవాయివా రైరి."

పై పాదములో గిరి-౭, నిధి-౯, గగన-౦, ఇందు-౧. అనగా శా. శ. ౧౦౯౭ (౧౦౯౭ + ౭౮ = ౧౧౭౫ క్రీ. శ.) దానరాజు కాలము క్రీ. శ. ౧౧౭౫ కావున నాతనికి కృతినిచ్చిన వేములవాడ భీమకవియు క్రీ. శ. ౧౧౫౦-౭౦ ప్రాంతముల వాడని స్పష్టముగా చెప్పవచ్చును. ఇంతవఱకును చాటుపద్యముల నాధారముగజేసికొని సందిగ్ధముగా నిర్ణయించిన కాలము నీ మాలిక నిస్సందేహముగా స్థిరపఱచు చున్నది. ఈ యుదంతము కవులచరిత్రకు క్రొత్త విషయము.

ఇట్టి యపూర్వచారిత్రకవిషయములను తమవంశమును గూర్చి తెలియజేసిన రాచిరాజకవీంద్రుడు చారిత్రకులకు, సారస్వతేయులకు స్మరణీయుడు.

పెద్దాపురమును పాలించిన విద్వత్ప్రభువు తిమ్మజగపతితో సమకాలికుడగు పెదవిజయరామ గజపతిమహారాజు హేరాళరిహోరాశాస్త్రమును, విష్ణుభక్తి సుధాకర ప్రబంధమును రచించిన విజయరామగజపతి, కృష్ణవిజయమును రచియించిన తిమ్మభూపాలుడు, ఉషాభ్యుదయమును రచియించిన వేంకటపతిమహీపాలుడు మున్నగు రాజకవులు పూసపాటివారి వంశీయులు గలరు. వారి కావ్యములు నేడు సాహిత్య చరిత్రకారుల కందుబాటులో లేవు. పూసపాటివారు రచించిన కృతులేగాక కృతిగొన్న కృతులును నేడు వాఙ్మయమున కెక్క లేదు. అపరభోజుడగు నానంద గజపతీంద్రుని యాస్థానమున వర్తిల్లిన సాహిత్యవిద్యాగోష్ఠి, కవితారచనాదివిశేషము లింకను చక్కగా వెల్లడి కాలేదు. పూసపాటివారి వాఙ్మయమునకు రాచిరాజకవీంద్రునిమాలిక శ్రీకారముచుట్టినది. ప్రస్తుత విజయనగరాధీశ్వరు లీవాఙ్మయమును నంతయు నుద్ధరించి యాంధ్రసాహిత్యోపాసకుల కామోదము గలిగింతురు గాత!

---

౭. వేములవాడ శ్రీ భీమసుకవిచే గోపాలచరితంబు గొనినమేటి అనియు, వేములవాడ భీమసుకవిచే రామగోపాలచరితంబు గొనినమేటి అనియు పాఠాంతరములు కన్పట్టుచున్నవి.



ఇటీవల తూపర్రాలో జరిగిన నిజాంరాష్ట్ర ఆంధ్రసారస్వత పరిషన్మహాసభలో పాల్గొన్న సాహితీపరులు

# నేరస్థులు

[కథానిక]

శ్రీ సామవేదుల సీతారామశాస్త్రి

మామగారి సత్యకాలానికీ, అల్లుని అమాయకత్వానికీ సరిపోయిందనుకొన్నారు ఆ ఊరివారంతా... కాళ్లు కడిగి పిల్ల నిస్తామంటే వేరే ఆలోచన ఏమిటని సిద్ధపడ్డాడు వెంకన్న...వంశం మంచి దయినప్పుడూ, పిల్లవాడు లక్షణంగా ఉన్నప్పుడూ ఆస్తీ గిస్తీ ఎందుకన్నాడు రామన్న...అదీగాక, తనదగ్గరే చిన్నప్పటినుండీ ఉండి, ప్రథమ శిష్యుడుగా తనను అనుసరించిన వెంకన్న అల్లుడుగా పొందడం తన అదృష్టమే అనుకున్నాడు రామన్న. తల్లిదండ్రులూ, ఇల్లూ వాకిలీ లేక తన పంచను చేరినవాడయినా...అవిధంగా స్థిరపడిన సంబంధం ఏదో మంచి ముహూర్తాన ముడిపడింది.

పెళ్లయినతరవాతకూడా వెంకన్న అత్తవారింటనే ఉన్నాడు. అందుకు రామన్న అభ్యంతరము గూడా ఏమీ లేదు. అత్తగారికి ఈవిషయంలో కొంత కష్టంగా ఉన్నా, కూతురుముఖం చూసి ఊరుకోవలసివస్తోంది. కూతురిమీద అభిమానంచేత మాత్రం కాదు. కేవలం ఆమెనోటికి భయపడే... వాగ్వాదాలలో తల్లీ కూతుళ్లలో అధికు లెవ్వరో అన్నది వారు నిర్ణయించుకోలేకపోయినా, ఇద్దరూకూడా మొగాళ్లమీదికి అధికారులే. రామన్న తన నలభైఏళ్ల కాపురంలోనూ వంటబట్టించుకున్నది అదే...అంత మాత్రంచేత అట్టి కష్టాన్ని వెంకన్న పూర్వం అనుభవించలేదని కాదు. గురువుగారితోపాటు తనకూ అట్టి ఆదరణే జరిగేది మునుపు గురుపత్నివల్ల...ఇప్పుడు తన భార్య తన అత్తగారికి తీసిపోకపోయినా, అప్పుడప్పుడు ఆ భీకరాకారంలోనే శృంగారం, ఆ అధికారంలోనే లాలన, ఆ భయంలోనే ఆనందం అనుభవించేవాడు వెంకన్న...అంతటితోనే సంతృప్తి పొందేవాడు.

రామన్నది మొదటినుండీ చితికిన సంసారమే. వారితాతలు మంచి వేదవేదాంగవేత్తలు...వారి తాతముత్తాతలనుండీ చదివిన చదువే అతనూ చదివేడు. తన తండ్రికాలానికే వేదానికీ, పాండిత్యానికీ విలువ తగ్గిపోవడంవలన వేదముతోపాటు వివాహాదులుచేయించడం గూడా చెప్పేడు తనకు. దానివల్లనైనా బ్రతుకగలడేమోనని. తండ్రినాటికి ఉన్న ఆస్తి కొసవరకూ జీవించలేని ఇద్దరు కొడుకుల మందులకే అయిపోయింది. ఆఖరికి తన అవసానకాలంలోకూడా, ఉన్న ఒక్క కొడుకుకూ ఎక్కడ లేకుండా పోతుందో అని 'నాకు ఎంతమాత్రం మందు ఇప్పించవద్దు' అన్నాడు తండ్రి... అయినా ఉండబట్టలేక, రామన్న వైద్యులను పిలిచి చూపించేడు. వారు ఏమందూ ఈయకపోయినా వచ్చి చూచినందుకుమాత్రం డబ్బు పుచ్చుకున్నారు. ఇంకా పూర్వాచారాల్లో నమ్మకం పోని రామన్న హోమాలూ, జపాలూ, తపాలూ ఎన్నో చేయించేడు. ఎన్ని చేసినా అతని తండ్రి అనుకున్నన్నిరోజులుకూడా బ్రతక్కుండా కళ్లు మూసేడు.

అప్పటికీ కొంత ఆస్తి ఉండనే ఉంది. సర్దుకొని కాలక్షేపంచేస్తే సంవత్సరం అయేసరికి కొంత కళ్ల

బతుకుతుందికూడాను. దానికి తోడు, తను నేర్చిన విద్యనాపెట్టి ఇప్పుడు అందరూ ఉపయోగిస్తున్న నోరు పెట్టి వ్యవహరిస్తే బంగారుమేడలే కట్టవచ్చు...కాని రామన్న నిజంగా హరిశ్చంద్రుని కాలంలో పుట్టవలసినవాడు. ఇతని సత్యస్వభావం లోకులకు మరీ లోకువయిపోయింది. పూటకు రెండుశేర్లు ఇచ్చే గేదె సరిగ్గా పావున్నర ఇవ్వడం బ్రహ్మాండమయిపోయింది...మిగిలినది దూడే త్రాగేదో, కాపరే అమ్ముకొనేవాడో ఎవరికి లక్ష్యం?...ఉన్న ఒక్క దొడ్డిలోనూ పాదులు పూయడమే చూసేడుగాని ఒక్క కాయ తిన్న పాపాన పోలేదు. ఇంటిది ఎంత ఏడిస్తేమాత్రం, యజమాని అయిన ఆ ఆసామియే ఇచ్చేస్తూంటే ఆవిడమాత్రం ఏమిటి చేస్తుంది? ఎవరింట వివాహమయినా ఈయనదే పౌరోహిత్యం...కాని, ఈయన ఎవ్వరిదగ్గరా కానీ పుచ్చుకోడు. పైగా వధూవరులను దీవించి, అయిదురూపాయలకు తక్కువకాకుండా కట్నం చదివించి మరీ వస్తాడు...అతనికి తీసిపోడా అల్లుడు. వారికి మాయ, మర్మం అంటే ఏమిటో తెలీదు. చెప్పడం అన్నప్పుడు ఉన్నది ఉన్నట్టు చెప్పడమేగాని, లేనిదానిని ఏవిధంగా ఉన్నట్టు చెప్పడమో వారికి అర్థంకాదు. అసలు అసత్యం అనేది ఒకటి ఉంటుంది, అది ఉపయోగించడానికి చాలా అందుబాటులోనే ఉంటుంది, దాని మీద నిజంగా హాయిగొల్పే సౌఖ్యం ఆధారపడి ఉంటుందనేవిషయం వారి ఊహకందనిది. ఆవిషయం వారికి విశదీకరించబోతే, ఏమిటో ఒక గోడలోనుండి దూరిపొమ్మన్నట్లు తోస్తుంది వారికి. అసత్యం అంతటి దురాచరణీయంగా కనుపిస్తుంది వారికి. వారు అసత్య ప్రపంచానికి గ్రుడ్డివారు. అనృతవాక్కులకు చెవిటివారు...అంటే, వారు విన్నదీ, చూసినదీ అంతా నిజమే నని నమ్ముతారు...

లోకంలో ఇంకా ఇటువంటి మనుష్యులు ఉంటారా అని అందరికీ ఆశ్చర్యమే...వారిని మోసపుచ్చి దొంగతనంగా సంగ్రహించినవారందరూ 'పాపం'అని బహిరంగంగా జాలిపడేవారు...వారింట నెలలతరబడి తిష్ఠవేసినవారందరూ 'ఏమి సత్యకాలం' అని దేశదేశాలా చాటేవారు. వారి పొలాలలో గడ్డి కోసుకొనేవారు, వారి దొడ్డిలో కూరలు కోసుకొనేవారు, ఆయనదగ్గర చేబదులు పుచ్చుకొని ఇవ్వనివారు అందరూ ఆయనఅమాయకత్వానికి జాలిపడేవారే... కాని ఏంలాభం?...పేరు దేశదేశాలా మోగిపోవడమేగాని, డబ్బు కర్పూరంలా ఎగిరిపోతోంది. ఉన్న ఒక్కమడిచెక్కా భోగబంధక్రిందికి వెళ్లింది. ఇంటిమీద ఆరువందల అప్పు అయిపోయింది. దారిద్ర్యం అధికమవుతున్నకొద్దీ తల్లీకూతుళ్ల సాధింపులూ, కోపాలూ కూడా ఎక్కువయినాయి!...

ఈ పరిస్థితులలోనే తద్దిన మొకటి దగ్గరపడింది. అది రామన్నఅమ్మమ్మగారిది. ఆమెకు ఏవిధమైన పుత్రసంతానమూ లేనందున దౌహిత్రుడైన ఈయనకే ఆ కర్తృత్వం సంప్రాప్తించింది. ప్రతీమారూ— "ఎందుకీ అక్కరమాలిన తద్దినం; డబ్బుదండుగకి; ఆస్తయినా కలిసివచ్చిందిగనకనా?"అని కామమ్మ ఎప్పుడూ పోరుపెడుతూనే ఉంది...కాని, ధర్మశాస్త్రం అంతా చదువుతున్న రామన్నకుమాత్రం దౌహిత్రుడయిన తను బ్రతికిఉండీకూడా, అమ్మమ్మకు తిండి లేకపోవడమనేది చాలా ఘోరంగా తోచింది. ఆ తద్దినమే మరోకవారంరోజులలో ఉంది.

అల్లుడూ మామలు చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు ఒకనాటి సాయంత్రం...ఇంటివిషయంగూర్చి ఇంత తీవ్రంగా ఆలోచించడం ఇదే మొదటిసారి వారికి...

"తద్దినం ఎలా మానేయడమోయ్"అని చాలా బాధతో అడిగాడు మామగారు. "అబ్బే! తద్దినం ఎలా మానేయగలం మామగారూ, మరోటే, మరోటీనా..."అన్నాడు అల్లుడు. "అదే నేనూ అంటున్నాను...కర్తృత్వం మీదపడినతర్వాత తద్దినం మానేయడం ఎంత అన్యాయం! పితృదేవతలను మోసంచేస్తే ఇంకేమయినా ఉంటుందా?...కాని, చూసేవా...మీ...అత్తగారికి ఏవిధంగా చెప్పడం?" "మరి చెప్పాలి". చెప్పగలమనే ధైర్యం ఎవ్వరికీ లేదు.

"డబ్బుకు ఇంతలా చిక్కుబోతామనుకో లేదోయ్" అన్నాడు రామన్న...ఆయనవద్ద శిష్య

రికం చేసినన్నాళ్లూ డబ్బు ఒక అవసరమైన పదార్థమనే సంగతే నేర్చుకోలేదు వెంకన్న. ఆ ప్రశ్న తనకు కాదన్నట్టే ఊరుకున్నాడు. "పోనీ, ఏదో ఇద్దరు బ్రాహ్మణులతో తెరిపి చేసుకుందా మంటే—"

"అంత బొత్తిగా ఎలాగండీ—పోనీ, మనం స్వయంగా పిలవకపోయినా, అభ్యాగతులకయినా పెట్టకుండా ఉండగలమా? అప్పుడే చాలామంది అడిగేరుకూడాను—'ఫలానావాళ్లప్పుడు ఫలానావారి తద్దినంకదా' అని...వారందరినీ కాదనలేము కదా!..."

"అదే నేనూ అంటున్నది!"...

రామన్నకి అంతా అయోమయంగా ఉంది... విశేషించి, ఈ సంగతి భార్యకు ఏవిధంగా తెలియబరచడమా అన్నదే తెలియడంలేదు.

ఇంతలో ఆవుకు కుడితిపట్టడానికి బయటకు వచ్చింది కామమ్మ...చాలారోజులనుండీ అల్లుడూ మామలలో జరుగుతున్న ఈగుసగుసలు ఆమెకు బొత్తిగా కిట్టడంలేదు...అంతేకాక, నిష్కారణంగా మామగారిని పాడుచేసేస్తున్నాడని అల్లునిమీద అనుమానం... వీరిద్దరివేపూ చురచుర చూసి, ఆవుదగ్గరకు వెళ్లింది... ఇదే సమయ మనుకున్నాడు రామన్న. ధైర్యంచేసి భార్యను పిలిచేడు.

"ఏం, ఏంకొంపమునిగిం దేమిటి"అని ఉరిమింది కామమ్మ...

"అదికాదే, ఈ పున్నమ వెళ్లిన విదియకి—"

"ఆ, విదియకి—?"

"మా అమ్మమ్మతద్దినం మళ్లా వస్తోంది—"

కామమ్మ రౌద్రమూర్తి అయిపోయింది ఒక్కమారు..."నేను ఈ పనికిమాలిన తద్దినాలతోటే, ఈ సంతర్పణలతోటే ఈ సంసారం ఇంక చెయ్యలేను." అన్నది ఒక్క ఊపుతో.—"ఇంటికి వెనులిసుల్లంత ఉపయోగం లేదుగాని, తద్దినాలనీ, దానాలనీ, సంతర్పణలనీ ఒకటే తగులబెట్టడం, ఇదేం తగులబెట్టడమో గాని. ఊరివారందరి తద్దినాలూ ఈయనే పెట్టాలి... ఆ చచ్చినముండ ఒక కొడుకును కని మరీ చావకూడదూ!...సంసారం సగం చితికింది. పూటగడవడం కష్టంగా ఉంటే ఆ ఊసే అక్కరలేదు మామా అల్లుళ్లకు. ప్రొద్దస్తమానం ఇక్కడ తిరగడమూ, అక్కడ తిరగడమూ! భోజనాలవేళకి పదిమందిని వెంటబెట్టుకొని రావడం!...నే వేగలేనమ్మా ఈయింట్లో...నే చెయ్యలేనమ్మా ఈ సంసారం" అని ఊరందరికీ వినిపించేవిధంగా స్వగతం ప్రారంభించింది...నూతిదగ్గర అంట్లుతోముతున్న కూతురు వచ్చి వయ్యారంగా గుమ్మానికి చేరబడి, "ఏమిటే అమ్మా" అని అడిగింది, గడ్డం క్రింద చేయిపెట్టుకొని, మొగుడివైపు ఉరిమినట్లు చూస్తూ..."ఏమి టేమిటే, ఉన్నది కాస్తా ఊర్చి ఏట్లో దింపేద్దామని చూస్తుంటే ఈయనా అయనానూ! ...ఊరివారందరి తద్దినాలూ ఈయనకే కావాలి!... ఇంట్లో ఏమున్నదీ, ఏమి లేనిదీ వీరి కక్కరలేదు కదా!...మొన్ననే ఇల్లు తాకట్టుపెట్టేరు, ఈరోజుకి ఒక్కగింజ మిగలలేదు; అప్పుడే అమ్మమ్మతద్దినానికి ఆలోచనలు చేస్తున్నారు! చచ్చినవారితో సమంగా మనమూ చస్తాముటే!...నామొగుడితోటే నే వగస్థపడలేకుండా ఉంటే, నీకూ అలాంటి ఆయనే దొరికాడు. ఒక పనిలేదు, ఒక పాటులేదు; ఒక పొలం చూసుకోడంలేదు, ఒక పౌరోహిత్యం లేదు...తినేస్తుంటే ఎంతకని ఊరుతుంది. అందులోనే తద్దినాలూ, తతంగాలున్నూ" అని గోలెములో తవుడుపోసి కలపడం మొదలుపెట్టింది. "అయితే, నాన్నా, ఇటువంటి పరిస్థితిలో తద్దినం పెట్టగలమా"అని అడిగింది కూతురు... "ఏమిటిచేస్తాం...ఎంత ఇదయినా తద్దినం మానగలమా తల్లీ" అన్నాడు రామన్న దీనంగా. తల్లీకూతుళ్లకు తద్దినం ఎందుకు మానలేరో అవగాహన కాలేదు. ఉరిపడినాగాని తద్దినం మానడం ఎలాగో బోధపడలేదు మామా అల్లుళ్లకు.

"అదీగాక, మామగారొక్కరే కర్త అయెను" అన్నాడు అల్లుడు కొంచెం సాహసించి. "మీరూ మాట్లాడాలీ! చాలులెద్దురూ!!...అంత మామగారమీదా, నామీదా అభిమానం ఉంటే మీ సంసారం మీరే దిద్దుకుందురు" అన్నది కూతురు. సంసా-

మంచో ఎటువంటిదో తెలియని వెంకన్నకు దిద్దుకోవలసింది ఏమీ కనుపించలేదు.

"మరి, డబ్బు లేనప్పుడు ఏం చేద్దామనుకున్నావు నాన్నా" అని అడిగింది కూతురు మళ్ళా.

"ఏమిటి చేస్తాం...ఏదో ఒకటి చెయ్యాలి..."

"చెయ్యండి, చెయ్యండి...మమ్మల్నందరినీ ఒక్కమారు గోతిలో దింపి అందరి తద్దినాలూ పెడుతూ ఉండండి" అంటోంది కామమ్మ...

"ఆ చెయ్యవలసినదేదో ఇంతకుముందే చెయ్యవలసింది నాన్నా...ఈ ఒక్క ఇంటిమీదా, ఆ కాస్త భూమిమీదా అప్పుచేసి ఊరందరికీ దానం చేసేరు. సుస్తంగా వాడుకుంటే ఈసమయానికి ఉపయోగపడక పోనా!" అని నచ్చజెప్పబోయింది కూతురు.

"నువ్వు వెయ్యిచెప్పు, లక్ష చెప్పు...వారికేమైనా బుర్రకెక్కితే కదే!...ఒక్కమాట చెప్తాను విను—వారిని వారిష్టమొచ్చినట్లూ చెయ్యనీ, నేను కాదనను...నేనుమాత్రం తద్దినాలకూ, వాటికీ ఒక్క పిసరు చెయ్యలేను. ఇప్పటికే నాకు మహాకష్టమయి పోతోంది...వారెలా తెచ్చుకుంటారో; ఎలా చేసుకుంటారో...నేను చెప్పినప్పుడు విన్నారుగనకనా, ఇప్పుడు చెయ్యడానికి...పద పోదాం...ఇక్కడ ఉంటే నాకంతకంతకూ వెర్రెత్తుతోంది" అని కామమ్మ కూతురుచేయి పట్టుకొని లోపలికి లాక్కుపోయింది.

తుఫాను చల్లారినందుకు మామా అల్లుళ్లు మనసులోనే సంతోషించేరు. దీనివల్ల వారికి అర్థమయినది ఒక్కటే—వారు ఇంక ఈ ఇంటిలో తద్దినం పెట్టలేరు; పెట్టించలేరు. అది నిశ్చయం...ఇక చెయ్యవలసిన దేమిటి?...

"ఈ ఇంట్లో తద్దినం పెట్టగలమనే ఆశ లేదు వెంకన్నా...ఒక్క పిసరు డబ్బుగాని, గింజగాని ఇంటి నుండి సంక్రమింపదు" అన్నాడు రామన్న.

"నిజమే"...

"అంచేత మనం ఇంకెవరింటనయినా ఏర్పాటు చేయాలి"

"కామయ్యగారింట మన కన్నివిధాలా సదుపాయంగా జరుగుతుం దనుకుంటూ"నని సలహా ఇచ్చేడు వెంకన్న.

"కాని మనకు కావలసిన డబ్బు ఎక్కడినుంచి వస్తుంది?"

మామగారూ, అల్లుడూ ఆలోచనలో పడ్డారు...వారు డబ్బు ధారాళంగా ఖర్చుపెట్టిన ఘట్టాలు జ్ఞాపకానికి వచ్చేయి...అప్పు డంత లక్ష్యం లేకుండా ఖర్చుపెట్టిన డబ్బుగూర్చేనా వారిప్పుడు ఆలోచిస్తున్నది!...ఆవు కుడితి త్రాగి మూతి నాలుకతో తుడుచుకుంటోంది...అది చూలుతో ఉంది...నేడో రేపో ఈనుతుంది...ధటేమని జ్ఞాపకం వచ్చింది అల్లుడికి—ఆ ఆవు ఒకటి తమకు మిగిలి ఉన్నదని. "పోనీ, ఇప్పటికి ఈ ఆవువల్ల ఏమయినా డబ్బు వస్తుందేమో?" అన్నాడు.

మామగారు ఒక్కమాటు ఉలికిపడ్డారు. "ఆవునే అమ్ముకోవాలా?" అని.

"మరేమిటి చేస్తాం; వేరే మార్గం ఏమయినా ఉంటే అనుకోవచ్చు" అన్నాడు అల్లుడు.

"గంగిగోవోయ్...నందినిలాంటి ఆవు."

"నిజమే...కాని తద్దినం మానగలమా?"...

మామగారు శూన్యంగా ఆలోచిస్తున్నారు. వారికి అంతకుముందు ఒక ఆవు ఉండేది...ఆ ఆవు దూడే ఇప్పటి ఆవు...ఇంకా ఇది తొలిచూలు.

అప్పుడే, ఆ వీధిలోంచి మునసబుగారు వెళ్తూ, వీధి అరుగుమీద కూర్చున్నారుకదా అని ఒకమాటు రామన్నను పలుకరించేరు..."ఒక మాట, మీతో చిన్న విషయం మాట్లాడాలి..." అని పిలిచేరు రామన్న. మునసబు వచ్చి అరుగుమీద కూర్చున్నాడు.

ఆవువేపు చూస్తూ "దూడ మా ఏపుగా పెరిగిందే!...చూలుతో ఉందిగామోసు" అన్నాడు మునసబు.

"అవునండీ, నేడో రేపో ఈనుతుంది అనుకుంటున్నాము" అని, కొంచెంసేపు ఆగి—"మునసబు

గారూ! ఒక్క సహాయం చెయ్యాలి" అన్నాడు రామన్న.

"అయ్యో, దానికేమిటి?...చెప్పండి"అన్నాడు మునసబు పరధ్యానంగా. "అది కాదు బాబూ...ఒక వారంరోజులలోనే ఒక తద్దినం వస్తోంది...దాని ఖర్చుకు ఇప్పుడు డబ్బు లేదు. అంచేత, ఇప్పటికి మీ రేదయినా సహాయం చేస్తే, డబ్బు చిక్కగానే మళ్లా ఇచ్చేస్తాను"అన్నాడు రామన్న ఏదో తప్పు చేస్తున్నట్టు భయపడుతూ.

"అన్నా, ఎంతపని జరిగింది! ఇవాళ ప్రొద్దుటే ఉన్నదంతా ఊర్చి కోటిపల్లి సంతకి ఎడ్లజత తెమ్మని పంపించేనండీ...ఈ సంగతి నిన్నటే తెలిసిఉంటే ఎంత బాగుండిపోను!..."అన్నాడు అతుకులు తెలియని అబద్ధాలను నిజాలుగా చెలామణీ చెయ్యడంలో ప్రఖ్యాతిగాంచిన లౌకికుడైన మునసబు.

"అన్నా, అలాగా?...మరేమిటి చెయ్య మంటారు?"

"అదే ఆలోచిస్తున్నాను...ఏమిటి చెయ్యడం చెప్పండీ—నేను పంపించక పోయీమాట ఉంటే..." మునసబుగారు వారి భయంకొద్దీ పునరుక్తిదోషానికి పూనుకున్నారుగాని ఇన్నిసార్లు ఆ బ్రాహ్మణులకి చెప్పనవసరం లేదు.

"నిజమే లెండి......మీదగ్గర లేనప్పుడు మీరు మాత్రం ఏం చెయ్యగలరు చెప్పండి"...

"మీకు వీలయితే ఒక ఉపాయం చెప్పగలను... అంతే"...

"మీదయ"

"మీరుగాని ఈ ఆవుని అమ్మగలిగితే, మా తమ్ముడు కొనుక్కుంటాడేమో చూస్తాను—"

తన ఉపాయమే ఫలించబోతున్నందుకు వెంకన్న గర్వంగా గురువుగారి వేపు చూసేడు. రామన్న మాత్రం చాలా విచారంగా ఆలోచిస్తున్నాడు...ఆ సంగతి గ్రహించిన మునసబు—"అలా కాక మీరు మరోక పదిహేనురోజులు ఆగగలిగితే ఏదోవిధంగా జతపెట్టగలను" అన్నాడు తద్దినం ఆనేది జనకపెట్ట డానికి వీలుపడదుకదా అనే ధైర్యంతో.

"అబ్బే! అదెలాగండీ, మరోటే, మరోటేనా? తద్దినమాయెను" అన్నాడు రామన్న తన నిస్సహాయతను నిరూపిస్తూ.

"అలాగయితే, మరి మీకు నే నేవిధంగానూ సహాయం చెయ్యలేను" అంటూ లేవబోయేడు మునసబు.

అడిగిన సహాయాన్ని ఇంత సులువుగాను, ఇంత కఠినంగానూ ఎవ్వరయినా నిరాకరించగలరా అని అల్లుడు ఆశ్చర్యపోయేడు...గురువుగారి పొలాల్లోంచి ఎన్నిసార్లు తను స్వయంగా గడ్డికోసి మునసబుగారి ఇంటికి ఇచ్చేడుకాడు!

"కావలిస్తే ఆవుని ఒక రెండ్రోజులు మీ ఇంట్లో ఉంచుకోండి" అన్నాడు రామన్న.

"పాలీయని ఆవును ఇంట్లో ఉంచుకోడ మెందు కండీ మేతదండుగ! నాదగ్గరగాని డబ్బుంటే, అడగ కుండానే ఇచ్చిఉందునే...ఏదో మాతమ్ముడు ఆవు కోసం ఎలాగూ చూస్తున్నాడుగాబట్టినీ, మీకు డబ్బు అవసరం గాబట్టినీ ఆవుసంగతి తెచ్చేనుగాని మీ ఆవు నాకు ఎందుకండీ"అన్నాడు మునసబు.

"పోనీ మామగారూ, ఆ ఆవుని అమ్మేస్తేనేమి?.. మనం మళ్లా కొనుక్కోగలిగినప్పుడే కొనుక్కుందాం.. ఏమిటంటారు మునసబుగారూ?" అన్నాడు వెంకన్న.

"నిజమే, అదీ బాగుంది...మీరు అప్పు పుచ్చు కున్నారన్న నామర్దాకూడా ఉండదు...అప్పుడే, ఈ ఖరీదులోనే మంచి ఆవు నొకదాన్ని చూసుకోవచ్చు."

"సరే...ఎవరినేనా పంపించండి, పట్టించు కెడ్తారుగాని—"

"ఎవరో ఎందుకండీ, నేనే తీసుకొనివెళ్తాను. తప్పేమిటి?...సాయంత్రంగాని, రేపుగాని డబ్బు పంపించేస్తాను" అన్నాడు మునసబు.

"డబ్బుకేమిటిలెండి...రేపే పంపించండి... కాని, ఏమాత్రం?"

"మనలో మనకు బేరా లేమిటండీ!...మీలాటి వారిని అన్యాయం చేసి, మేం గడించేదేమిటి చెప్పండీ

...అందుచేత ఏదో మీకూ మాకూ సదుపాయంగా ఉన్నట్లు తేల్చేసుకుందాం..." అని సలహా ఇచ్చేడు మునసబు.

"నిజమే, నేనూ అదే అంటున్నాను...మీరు అనుభవజ్ఞులు...పశువుల ధర, నాణ్యెం...అన్నీ మీకు తెలిసినట్టు మాకు తెలుస్తాయా !...అందుచేత ఆ ఆవును చూసి ఎంతధర అవుతుందో మీరే నిశ్చయించండి." అన్నాడు రామన్న మునసబుగారి సత్యవాక్పరిపాలకత్వను పూర్తిగా విశ్వసిస్తూ.

"నేను చెప్తే మీరు నమ్ముతారా" అన్నాడు మునసబు, సంశయిస్తూ. తను చెప్పబోయే మాట అంతటి నమ్మశీలులేనిదే అని మునసబుగారి అభిప్రాయం.

"ఎంతమాట!" అన్నాడు నొచ్చుకుంటూ రామన్న. ఒకరు చెప్పిన మాట నమ్మకపోవడ మెలాగో వారికి తెలీదు.

"మొన్న అప్పయ్య ఇలాంటి ఆవునే ముప్పై అయిదురూపాయిలకు కొన్నాడు...ఇదికూడా అంత ఖరీదే చేస్తుం దనుకుంటాను"

"అలాగే కానీయండి; డబ్బుమాత్రం రేపు పంపించివేయండి...మాకు చాలా అవసరంగా ఉంది" అని సాగనంపేడు మునసబుని. ఆవుని తోలుకొని పోతూ, పాతికరూపాయిలకే అడగనందుకు చాలా విచారించేడు మునసబు.

జరిగిన సంగతి తెలిసినతర్వాత కామమ్మ చేసిన గోలకు అంతులేదు. ఎవరైనా క్రొత్తవారు ఆఊరు వచ్చిఉంటే, ఎక్కడో ఇళ్లు అంటుకున్నాయేమోనని భయపడి ఉందురు. ఆరాత్రి వారి ఇంట్లో ఎవ్వరికీ కూడా భోజనాలు లేవు...మర్నాడు కామమ్మ జ్వరం చేత మంచ మెక్కింది. ఇంట్లో వంట, పెంట కూతురిదే...అత్తగారు మంచంమీదనుంచే మిన్నుముట్టేట్లు కేక లేస్తోంది— "ఇంకెందుకు ! నన్నుగూడా అమ్మేయండి...మీకూతుర్నిగూడా అమ్మేయండి—చచ్చిన వారి తిండికి బ్రతికున్నవార్ని కూడా చంపండి...లేకపోతే నిక్షేపంలాంటి ఆవును ఎవరింటో తోలేయడమేమిటి ?...వాడు డబ్బు ఇవ్వాలా ! ఏడుపా ?... చేతులారా ఇల్లు కూల్చుకోవడమైంది... ఇంత ప్రపంచజ్ఞానం లేనివారితో ఎలా వేగడం..."

మామగారికి అంతా అయోమయంగా ఉంది... మునసబుగారు ముప్ఫయి అయిదు రూపాయిలు ఇస్తామన్న తర్వాతగూడా ఏమిటీ గడబిడకు అర్థం ? ఇస్తానన్న డబ్బు ఇవ్వకపోవడ మంటూ ఉంటుందా ? ...తనే ఇవ్వదలచుకోపోతే, ఇస్తానని ఎందుకంటాడు ?...ఈ ఆలోచనలతో తల్లడిల్లిపోతున్నాడు రామన్న...మాటకూ చేష్టకూ చాలా దూరం ఉంటుందన్న సత్యం గ్రహించలేక తల్లడిల్లిపోతోంది అతని మనస్సు.

రామన్న ఇంకా ఈసందిగ్ధంలో ఉంటూ ఉండగానే మర్నాటి మధ్యాహ్నంగూడా గడిచిపోయింది. చీకటి పడబోతోంది...రామన్నకు ఏమీ తోచలేదు. ఏమిటి ! మునసబుగారికి ఇంకా తెల్లవారలేదా ?...ప్రొద్దుటే డబ్బుపంపిస్తా నన్న మనిషి ఇప్పటివరకూ ఏమిటి చేస్తున్నట్లు?... లేక మరిచిపోయేడా ?...తనదికాని ఆవు తన దొడ్లో కనబడుతూ ఉండగాకూడా మరిచిపోగలడా ?...రామన్న కేమీ అర్థంకాక అల్లుణ్ణి పంపించేడు...వెంకన్న కనుక్కొని వచ్చి—"డబ్బు జతపడలేదట ! రేపు సాయంత్రం లోపుగా ఇస్తా నన్నాడు" అని చెప్పేడు. "అవును గామోసు !...మన కెంత కష్టంగా ఉందో, డబ్బు జతపెట్టడానికి అతనికీ అంత కష్టంగానూ ఉండి ఉంటుంది" అనుకొని జాలిపడ్డాడు రామన్న.

రెండోరోజు సాయంత్రంగూడా గడిచిపోతోంది...అల్లుడూ మామలు అరుగుమీద కూర్చొని ఆలోచిస్తున్నారు..."మరి డబ్బివ్వకపోతే ఏమిటి చెయ్యడం" అని ప్రశ్నించేడు అల్లుడు. "ఏమిటి చేస్తాం, ఆవును మళ్లా తోలుకొని వచ్చేద్దాం...తగాదా దేనికి..." అన్నాడు రామన్న. "మళ్లా అమ్మడమో!" "అమ్మడమో కాదో అతర్వాత చూసుకోవచ్చును"అని ఇద్దరూ సంభాషించుకుంటూఉండగా, మునసబు వారింటికి వచ్చేడు. డబ్బు తెచ్చిఉంటా డనుకున్నారు అల్లుడూ మామలు.

"డబ్బు తెచ్చారా ?" అని పలుకరించేడు రామన్న.

"ఏండబ్బు శాస్తుర్లుగారూ! పట్నం వెళ్లిన మావాడు ఇంకా రాలేదు...నిన్ననే వస్తాననుకొని మీకు మాటకూడా ఇచ్చేవాడయెను—" పాపం, తన అబద్ధపుమాట నిలుపుకోలేనందుకు ఎంత నొచ్చుకున్నాడో మునసబు !...

"పోనీ, ఆవును తోలించేయండి...మరెవ్వరికయినా అమ్ముకుంటాం"

"అచ్చే, తీసుకెళ్లిన ఆవును మళ్లా ఇచ్చేయడమేమిటండీ ! రెండ్రోజులు తిండిపెట్టికూడా...... అయినా, చూడండి ! వాడు వచ్చిఉంటే, వాడిదగ్గర పుచ్చుకొని మీకిచ్చేద్దునా?...పాపం! మీకు ఆలస్యమయిపోతోందనే విచారిస్తున్నాను".

"నిజమే మునసబుగారూ, ఈవున్నమముందుగానే మాకు డబ్బు దొరకకపోతే మాపని జరగదు...మరోటీ మరోటీకాదు...తద్దినం కూడాను."

"నాకు తెలియదండీ!...అందుకే ఇంతలాగున కొట్టుకుపోతున్నాను...ఎలాగయినా ఆవలెల్లుండి సాయంత్రంలోపుగా మీడబ్బు మీకు పూర్తిగా ఇచ్చేస్తాను. మీరు మరేమీ బెంగపెట్టుకోకండి !"అని మునసబుగారు వెళ్లిపోయేరు.

ఆ మూడురోజులూ గడవడం మహా కష్టమయిపోయింది అల్లుడూమామలకు. ఇంటిలో అత్తగారిపోరు ఘడియఘడియకూ హెచ్చిపోతోంది. "ఏం, ఆవును తీసుకువచ్చేరా ?...పోనీ డబ్బు ఇచ్చేడూ... లేదుకదూ ?...నాకు తెలుసునే...నేను ముందే అనుకున్నాను. లేకపోతే వాళ్లు డబ్బుఇస్తారే అనుకున్నారా"

రామన్నకు మహదాశ్చర్యంగా ఉంది...... ఆ మునసబు స్పష్టంగా, అతురాలా "నేను ఇస్తాను" అని చెబుతూంటే, తనభార్య ఏ విధంగా అనుకోగలుగుతోందో ఇవ్వరని...ఇస్తానన్న మాటకి ఇవ్వను అనే అర్థం ఉంటుందా ?...ఈ విధమైన శ్లేషార్థాలే ఉంటే ఇంకేమయినా ఉందా ?...కాని, విశేషమేమిటంటే, ఆవిడ అన్నట్లే అన్నీ జరుగుతున్నాయి!... కామమ్మ అన్నట్లే మునసబు మూడోనాటి సాయంత్రానికి కూడా డబ్బు ఇవ్వలేదు. అల్లుణ్ణి పంపిస్తే, మధ్యాహ్నమే ఎక్కడికో వెళ్లేడనీ, మర్నాడు ప్రొద్దుటికి గాని రాడనీ తెలిసింది. అప్పుడే తద్దినం కూడా దగ్గరపడుతోంది !...

"ఏం, డబ్బు యిచ్చేడా ?" అని అడిగింది కామమ్మ మంచంమీంచే.

"లేదు.ఎక్కడికో వెళ్లేట్ట! రేపొద్దుటకు గాని రాడట !"

"నేను చెప్పలేదూ...! అంతా తెలుసు..మీరు మీచేత్తోటే చేసుకున్నారు"

"అవును"

"అవు నేమి టింకా...ఇప్పుడేనా మించిపోయింది లేదు...ఆ ఆవును తోలుకొనిరండి...ఈనిందట కూడాను"

రామన్నకు అదే సమంజసంగా కనుపించింది. "అనుకున్న రోజుకు డబ్బు ఇవ్వకపోతే ఏమి టనుకోడం ? వారికి కొనడం ఇష్టంలేదు గాబోలును." అనుకున్నారు గురుశిష్యులు. ఆరాత్రే పదిగంటలకు బయలుదేరేరు. పుచ్చపువ్వులాంటి వెన్నెల చెట్ల ఆకులు సందులలోంచి నేలమీద పడి వింతవింత ముగ్గులు పెడుతోంది. అల్లుడూ మామలు సరాసరి వెళ్లి మునసబుగారి పసువులశాలలో ప్రవేశించేరు దడితలుపు తెరుచుకొని. మామగారు తన గావంచా ఆవు మెడకు చుట్టి, కన్నె విప్పి పైకి తీసుకొని వచ్చేడు. అల్లుడు దూడను రెండు చేతులతోటీ ఎత్తుకొని తెచ్చాడు. రామన్న ను పోల్తి పట్టిన ఆవు కిక్కురుమనకుండా అతనివెంట బయలుదేరింది. వెంకన్న దూడను మెల్లిగా నడిపించుకుంటూ తీసికెళ్ళేడు. త్రోవలో నాయుడు అచ్చయ్య కనుపించి,"ఏటిబాబూ ఎక్కణ్ణుంచేటి తోలికెల్తున్నారు?" అని భోగట్టాచేసేడు. "ఇక్కడేనోయ్...మునసబుగారి ఇంటినుంచి" అని చెప్పి యిల్లు చేరుకున్నారు. మామగారు ఆవును పాలలో కట్టేయగా, వెంకన్న దూడను పెరట్లోకి తీసుకెళ్లి కట్టి వేసేడు. ఇంక భయం లేదను

కొని, ఇద్దరూ కాళ్ళు కడుగుకొనివచ్చి, వీథి అరుగు మీద హాయిగా నిశ్చింతగా పడుకున్నారు.

మర్నాడు గురుశిష్యులిద్దరూ చెరువులో స్నానం చేసి, బారెడు ప్రొద్దెక్కుతుండగా వచ్చేరు ఇంటికి. ఇంటిదగ్గర చిన్నగుంపు చేరిఉండడంచూసి తొందరగా అడుగులు వేసేడు రామన్న. ఇల్లు చేరేసరికి కామమ్మ మంచందగ్గరనుంచి కేకలు స్పష్టంగా వినిపిస్తున్నాయి– "ఏం...దొంగతనం చేసేరా, ఖూనీ చేసేరా ?...రండ తనం చేసేరా ?...కాడీతనంచేసేరా ?...పోలీసు లెందు కమ్మా మాయింటికి ?...పోలీసు లేం దోచుకోవాలమ్మా మాయింట్లో !...ఇంతమంది ఈ ఊళ్ళో ఉండగా, మా యింట్లో ఏం పుట్టి మునిగిపోతోందని పోలీసులు మా యింటిమీద పడాలి ?"...తన ఆలోచనల కంతరాయం కలిగిన వెంకన్నకు ఈ పోలీసులనే కింకరులను పెట్టి ప్రజల్ని ఎందుకు హింసిస్తున్నారో అర్థంకాక ఆలో చిస్తున్నాడు. రామన్న అయోమయంగా అక్కడ ఉన్న వారినందరినీ తప్పించుకుంటూ రంగంలోకి వచ్చేడు. అక్కడ ఉన్న వారిలో మునసబుగారు, పోలీసు సబ్ఇన్స్పెక్టరు, ఇద్దరు పోలీసులు, అచ్చయ్య మొదలైన వారు ముఖ్యపాత్రలుగా కనపిస్తున్నారు.

"ఇతనేనండీ నిన్న రాత్రి నాదొడ్లోంచి ఆవును, దూడను తోలుకొని వచ్చేడు దొంగతనంగా." అని మునసబుగారు సబ్ఇన్స్పెక్టరుతో అన్నాడు. సబ్ ఇన్స్పెక్టరు మీసాలు మెలివేస్తూ ఒకమాటు రామన్న వేపు చూసేడు.

"చిత్తంబాబూ, నేను పొలంమీంచి వస్తూంటే, వీరిద్దరూ ఆవును తోలుకొని వస్తూ కనుపించేరు." అన్నాడు అచ్చయ్య వెంకన్నను కూడా రంగంలోకి తీసుకొనివస్తూ.

సబ్ఇన్స్పెక్టరు ఒకమాటు గర్జించి — "ఏం రామన్నగారూ, ఏమిటంటారు ?" అన్నాడు వెటకారంగా...

"అవునండీ, నిన్న నేనూ మా అల్లుడూ కలిసి ఆవును తోలుకొనివచ్చేము రాత్రిపూట" అన్నాడు రామన్న నిస్సంకోచంగా.

"ఎందుకు తోలుకొని వచ్చేరు దొంగతనంగా."

"దొంగతన మేమిటి !...పచ్చ పువ్వులాంటి వెన్నెలలో పెద్దవీథిలోంచే తోలుకొనివస్తే...ఆయన కవసరం లేదనుకొని తెచ్చేం..."

సబ్ఇన్స్పెక్టరుకు కాళ్ళూ చేతులూ ఆడడం లేదు...పది అడుగులేనా లోతు ఉండదా అని అరుగు మీంచి గెంతినవాడు కాళ్ళకి అరంగుళాల్లోనే నేల తగిలితే ఎట్టి అనుభవం పొందుతాడో అట్టి అనుభవమే పొందేడు సబ్ఇన్స్పెక్టరు. మునసబుగారినుంచి కథ శాంతంగా విని, అది అర్థంచేసుకుందుకు పాతికరూపా యిలు సంటబట్టించుకున్న సబ్ఇన్స్పెక్టరు, రామన్న ఎన్నివిధాల తనను తప్పత్రోవలలో పెట్టగలడో ఊహించు కున్నాడు. బహుశః 'నేను తేలే'దంటాడు, లేక 'ఎవరో తెచ్చి కట్టి ఉంటా'రంటాడు...అప్పుడు అచ్చయ్య సాక్ష్యం ఉంది...లేక మునసబే తీసుకుపొమ్మన్నా డంటాడు...అప్పుడు మునసబుగారే కాదంటారు... ఈవిధంగా తన బుర్రను ఖాళీచేసుకొని, వాల్గుగంటల సేపు యోజించి, అప్పటికీ ఎక్కడ తను ఊహించని విధంగా కథ తిరుగుతుందో అన్న భయంతోనే ధైర్యం అవలంబించి, రామన్నను నైపుణ్యంగా ఎదుర్కొ న్నాడు...కథ ఇంత తేలికగా పరిణమించేసరికి తబ్బి బ్బయిపోయేడు. ఇప్పుడు రామన్నను ఏ సెక్షన్క్రింద అరెస్టు చెయ్యడమో అర్థంకాలేదు...దొంగతనం చేసిన తర్వాత నిజంచెప్పడం దోషం అనే క్లాజు ఏదయినా ఉంటే ఇంత తటపటాయించకపోవునేమో సబ్ ఇన్స్పెక్టరు.

అయినా, మునసబుగారు లేనప్పుడు, రాత్రి పూట దొంగతనంగా వారి ఆవును తోలుకువచ్చినం దుకు మిమ్మల్నిద్దరినీ అరెస్టు చేస్తున్నాను...మీ రిప్పుడు నాతో మేజస్ట్రీటుదగ్గరకు రండి"అని రామన్న చెయ్యి పట్టుకోబోయేడు. "ఆగండి.........నన్నుమాత్రం ముట్టుకోకండి, మడిగా ఉన్నాను...పదండి నేనే వస్తాను ; అటుంచీ వచ్చేక దేవతార్చన చేసుకుం టాను" అని రామన్న వారివెంట బయలుదేరేడు వెంక న్నతో సహా.

వీక్షిసమ్మంలో నిలబడిచూస్తున్న కూతురుకు అంతా మాయలాగున కనుపిస్తోంది—మునసబు గారి మోసము, తండ్రి అమాయకత్వము, భర్త చేతకాని తనము అన్నీ చూస్తూఉంటే, తను దూషించాలో, విచారించాలో, గర్వపడాలో, ఆనందించాలో, అభినందించాలో తెలియక తల్లడిల్లిపోయింది.

౨

మర్నాడు మేజిస్ట్రేటుకచ్చేరీలో రామన్న కేసు విచారణ జరగబోతుందని విని చాలామంది వచ్చేరు. న్యాయస్థానంలో అందరూ ఎలాగూ నిజమే చెప్పాలి గాబట్టి తనసంగతి సునాయాసంగా తేలిపోతుందని రామన్న నిర్భయంగా ఉన్నాడు.

మునసబు లాయరుగారికి డబ్బు బాగానే పోసేడు. నిష్కారణంగా ఈకోర్టులు తిరగకుండా, అందుకైన ఖర్చులో సగం ఆ ఆవుఖరీదుగా ఇచ్చేస్తే బాగుండిపోవని అనుకున్నా డా వెనుక...సరదాగా ఒక చిన్న తమాషా చేద్దామనుకున్న మునసబుగారికి ఈ ఖర్చు గాని, ఈ ఖర్చుకైన అవసరంగాని కనుపించలేదు... అదీగాక, ఇంతదూరం కథ వచ్చినతర్వాత తను నిజం వప్పుకొని నలుగురిలోనూ నగుబాట్లు చెందుతాడా ఎక్కడయినా ?...ఇందులో తన అన్యాయంమాత్రం ఏముంది ?...తన పాకలో ఉన్న ఆవును రాత్రిపూట దొంగతనంగా తీసుకుపోవడం నేరమని గవర్నమెంటు వారి పోలీసులే నిరూపిస్తున్నప్పుడు తనెందుకు కాదనాలి చట్టవిరుద్ధంగా ?...

పోలీసు సబ్ఇన్స్పెక్టరు, మునసబు, లాయరూ ఒక గదిలో కూర్చొని జాగ్రత్తగా ఆలోచిస్తున్నారు. "మీరు భయపడకండి లాయరుగారూ...కేసు చాలా తేలి కయినదే. అర్ధరాత్రి మునసబుగారు లేనప్పుడు రామన్న వారి దొడ్లోంచి ఆవును తోలుకుని వచ్చేడు. దానికి అచ్చయ్య సాక్ష్యం... ఈ విషయం రామన్నగూడా వప్పుకుంటున్నాడు." అన్నాడు సబ్ఇన్స్పెక్టరు ధీమాగా. "అందుకే వాడు లంగ రందనం లేదు...అలా వప్పుకోడం వల్లనే కేసు ఏవిధంగా తిరుగుతుందో చెప్పలేకుండా ఉన్నాను...ఆ రామన్నే నా యింతవరకూ మీముందు తన నేరం వప్పుకోవడంలో మరేమయినా బలం చూసుకొనే వప్పుకుంటున్నాడేమో మన్నందరినీ ఫసాయించడానికి!...మేజస్ట్రీటుగారికి ఇటువంటి అమాయకపు బ్రాహ్మలంటే ఒకవిధమైన జాలికూడాను...... అవునుగాని, మీరు ఆవును నిజంగానే కొన్నారా, మనలో మనమాట!" అని మునసబును అడిగేడు లాయరు.

"అయ్యో! కొన్నానండీ, డబ్బంటే ఇవ్వలేదు గాని...రేపో ఎల్లుండో ఇస్తానన్నాను. అందుకు అతనూ వప్పుకున్నాడు"

"అక్కడే చికాకుగా ఉంది...సరేలే, అవలి పార్టీకి ప్లీడరు లేనందున సాధ్యమయినంతవరకు డబ్బు విషయం ఎత్తకుండానే గడిపేద్దాం...కాని మేజస్ట్రీటు అడుగుతాడేమో ?"

"మేజస్ట్రీటు ఏమయినా పుచ్చుకొనే రకమా" అని అడిగేడు దానకర్ణుడయిన మునసబు.

"కాదండీ, అదే చికాకుగా ఉంది.. అయినా ఆ బ్రాహ్మడిమీద మీ కెందుకంత పగ" అని అడిగేడు వకీలు. "పగ కాదండీ...పాపం...బ్రాహ్మడు మంచివాడే...కాని, కథ ఇంతమట్టుకు వచ్చినతర్వాత విడిచిపెడితే నా ఊరివారందరూ నన్నూ, సబ్ఇన్స్పెక్టరుగారినీ మామూలుగా చూస్తారా ?...మీకు తెలియనిదేమిటి చెప్పండి" అన్నాడు మునసబు......నలుగురిలోనూ గౌరవంగా బ్రతికి, పెద్దమనిషిలా చెలామణీ కావాలంటే ఎన్ని మార్గాలేనా తొక్కాలి!...

"సరే, మరేమిటి చేస్తాం ? అన్ని కేసులలాంటిది కాదు ఇది. ముందుగా ఆలోచించి చేసేదికూడా లేదు. అచ్చయ్యసాక్ష్యం మనవేపు స్పష్టంగానే ఉంది. మిగిలిన విషయాలన్నీ సమయాన్నిబట్టి చూడాలి" అని దస్తరాలు కట్టి కోర్టులోకి వెళ్లేడు లాయరు.

కోర్టులో మేజస్ట్రీటు కూర్చొని ఉండగా, రామన్న బోనులో నిలబడి ఉన్నాడు...మేజస్ట్రీటు గారు రామన్న ఊరు ఒకమాటు వెళ్లినప్పుడు వారింటిలోనే భోంచేసేడు. ఆనాడే తెలుసుకున్నాడు ఆ బ్రాహ్మడి అమాయకత్వం. రామన్నను చూడగానే—

"అయ్యో, మీరా !...ఇంకా ఎవరో అనుకున్నా, విషయ మేమిటి" అన్నట్టుగా చూచేడు. "ఏమీలేదు బాబూ, నాదగ్గర ముప్ఫయి అయిదు రూపాయలకు ఆవును పుచ్చుకొని, మర్నాడే డబ్బు పంపించి వేస్తానని చెప్పి తోలుకెళ్లి, ఇప్పటివరకూ డబ్బియ్యలేదు మునసబు. అంచేత నేనూ, నా అల్లుడూ కలిసి ఆవును తోలుకొని వచ్చేము రాత్రికిరాత్రి. అందుమీద ఏదో నేరం క్రింద మీముందు పెట్టేరు." అన్నాడు రామన్న విస్సంకోచంగా.

మేజస్ట్రీటుకు జరిగిన సంగతంతా స్పష్టంగా అర్థమయింది. ఎవరో ద్రోహులు అన్యాయంగా ఈ అమాయకపు బ్రాహ్మణుణ్ణి కష్టపెడుతున్నారని తెలుసు కున్నాడు..."సరేగాని, నీ కెవరైనా ప్లీడరున్నాడా" అని అడిగేడు. "ప్లీడరా...ప్లీడరు దేనికి ?...సత్యమూర్తులు మీ రున్నారుకదూ న్యాయమేదో తెలుసుకుందుకు."

మునసబు, సబ్ ఇన్‌స్పెక్టరు, లాయరు ప్రవేశించేరు. విచారణ ప్రారంభమయింది. గుమస్తా కేసు యొక్క వివరాలు మొదలైనవి చదివేడు. ఆవు, పెయ్య వరండాలో కట్టబడ్డాయి. కేసు వివరాలు విన్న తర్వాత ఒక్క లాయరు తప్ప తక్కిన ముద్దాయీల నందరినీ పైకి పంపించేరు. మేజస్ట్రీటు గాత ముగించి, వకీలును చూసి—"క్రాస్ ఎగ్జామినేషన్ మొదలు పెడదామా" అన్నాడు.

"చిత్తం...మునసబుగారిని రప్పించండి" మునసబుగారు వచ్చి బోనులో నిలుచున్నాడు. పేరు, ఊరు ఇత్యాదులు అయినపిమ్మట—

"ఆ ఆవు మీదేనా" అని అడిగేడు లాయరు.

"చిత్తం, నాదే బాబూ, నేనే కొన్నాను... మొన్ననే మా యింట్లోనే యీనింది"

"నే నడిగినదానికే చెప్పండి.. మీ యింట్లోనే యీనిందా"

"చిత్తం..."

"ఎప్పుడు కొన్నారు?"

"అప్పుడే వారంరోజు లయింది"

"ఎవరిదగ్గర కొన్నారు ?"

"రామన్నగారి దగ్గరే కొన్నాను, ముప్ఫైయిదు రూపాయలకు"

డబ్బుసంగతి ఎత్తేసరికి లాయరుగారు గతుక్కుమన్నారు.

"సరే. సరే,...మీరు ఆ యావు దొంగిలింపబడిన రోజున ఊళ్ళోనే ఉన్నారా ?"

"లేదండి, పొన్నూరు వెళ్లేను ఆ సాయంత్రమే...ఆమరునాడు ఉదయం చూడగానే ఆవు దొడ్లో లేనందున పోలీసులకు కబురుపెట్టి వెతికించేను"

"ఆవు మళ్లా ఎక్కడ కనుపించింది?"

"రామన్నగారి శాలలోనే"

"సరే, ఇంక మీరు వెళ్లవచ్చు." అని లాయరుగారు అన్నారు.

"నేనుకూడా కొన్ని ప్రశ్నలు అడగాలి" అని మేజస్ట్రీటుగారు అనేసరికి లాయరుగారికి ముచ్చెమటలు పోసేయ్. మునసబు తెల్లబోయేడు...మేజస్ట్రీటుగారు అడుగుతున్నారు—

"ఆవును రోజూ దొడ్లో ఎవరు కడుతూ ఉంటారు ?"

"నేనే ఎప్పుడూ కడుతూంటాను బాబూ"

"అదే నేనూ అనుకున్నాను...అంటే దొంగతనం అయినరోజున సాయంత్రమే మీరు వెళ్లిపోడం చేత, ఆవును శాల్లో కట్టకుండానే వెళ్లిపోయేరు గామోసు"

"అవును"

మేజస్ట్రీటుగారు మునసబును పంపించి, సబ్ ఇన్‌స్పెక్టరుని బోనులోకి ఎక్కించేరు. అతను రాగానే లాయరు అడగడం మొదలుపెట్టేడు. "దొంగిలింపబడ్డ ఆవు, దూడ మీకు ఎక్కడ కనుపించేయి"

"రామన్నగారి శాలలో"

"వారియింట్లో ఉన్నట్టు అచోకి ఏ మేనా తెలిసిందా ?"

"తెలిసింది...అచ్చయ్య చెప్పేడు"

"మీరు ఎన్నిగంటలకు రామన్నగారింటికి వచ్చేరు...?"

"దరిదాపు ఏడుగంటలకు"

"ఆవు వారిశాలలోనే ఉందన్నమాట"

"అవును."

"అదేనా ఆవు?"

"అవును, అదే ఆవు"...

"మీరింకేమయినా స్టేటుమెంటు ఇస్తారా?"

"ఇంతకంటే చెప్పవలసింది ఏమీ లేదు... రామన్న, అతని అల్లుడు వెంకన్న ఇద్దరూ కలిసి ఆవును, దూడను తోలుకొని వచ్చి, ఆరాత్రిపూట వారి శాలలో కట్టుకున్నారట!...అందుచేత, వెంటనే వారిద్దరినీ అరెస్టుచేసి, కోర్టుకప్పగించి, పోలీసు సబ్ఇన్స్పెక్టరుగా నే చేయవలసిన పని పూర్తిచేసేను." అని దిగబోతున్న అతనిని ఆపి, మేజస్ట్రీటుగారు చిరునవ్వుతో—"నీపని నువ్వు చేసుకోవడంతో సరిపోదు... మరి రెండు మూడు ప్రశ్నలకు జవాబు చెప్పాలి" అన్నారు. సబ్ ఇన్స్పెక్టరు తెల్లబోతూ, "చిత్తం" అన్నాడు.

"సరే, నువ్వు దరిదాపు ఏడున్నరకి వెళ్లేవుకదూ"

"చిత్తం"

"అప్పుడు రామన్న వెంకన్నలు ఇంటిదగ్గర ఉన్నారా"

"లేరు, చెరువుకి వెళ్లేరు."

"సరే; నువ్వు వెళ్లిన సమయానికి ఆవు ఏం చేస్తోంది?"

"పాలకి దగ్గర్లో ఉన్న కుడితిగోలెంలో కుడితి తాగుతోంది"

ఈ జవాబు వినేసరికి లాయరుగారికి ఎందుకో అనుమానం కలిగింది.

కేసు నిష్కారణంగా చేతులోంచి జారిపోయే సూచనలు కనిపిస్తున్నై. "ఇప్పుడే పాలలో ఉందని చెప్పేవే" అని జ్ఞాపకం చేసేడు లాయరు...సబ్ ఇన్స్పెక్టరు ఏదో తప్పుచేసినట్టు చిక్కముఖం వేసేడు. మేజస్ట్రీటు నవ్వుతూ—"చెప్పనీయండి, కంగారెందుకూ. సబ్ ఇన్స్పెక్టరుకే తెలియదా?" అని మళ్లా, "దూడ పాలుత్రాగుతోంది గామోసు" అని ప్రశ్నించేరు. "అవును, తల్లిపాలు తాగుతోంది" అని జవాబు చెప్పేడు. "నీ వింక వెళ్లవచ్చును" అని మేజస్ట్రీటుగారు అతనిని పంపించివేసేరు.

అచ్చయ్య వచ్చి బోనులో నిలబడ్డాడు. లాయరు గొంతు సవరించుకొని ప్రశ్నించేరు.

"నువ్వు ఆ రాత్రి ఎక్కడనుంచీ వస్తున్నావు?"

"పొలంనుంచి"

"ఏ త్రోవవెంట వచ్చేవు?"

"రామన్నగారి ఇంటిముందున్న గోర్జిలోంచి"

"అయితే, అచ్చయ్యా, త్రోవలో నీకు రామన్న, వెంకన్న ఆవును తోలుకువస్తూ కనుపించేరు కదూ"

"చిత్తంబాబూ, నిజంగానే కనుపించేరు"

"నువ్వేం పలకరించలేదూ అప్పుడు!"

"పలకరించకేం బాబూ? 'ఇంత రాత్రప్పుడు ఎక్కడనుంచేమిటి, ఆవుని దూడని తోలుకొస్తున్నా' రనిఅడిగేను...'మునసబుగారిఇంటినుంచే' అన్నారు."

"నువ్వు చూసినప్పుడు ఆ యావు పెనుగులాడుతోంది కదూ, వారు యీడ్చుకువెళ్తూంటే"

"అలాగే తోచింది బాబూ ఆ చీకటిలో"

"నా ఎగ్జామినేషన్ అయిపోయింది" అని లాయరు కూర్చున్నాడు.

"ఆరాత్రి వాళ్ళు తోలుకొనిపోతుండడం చూసికూడా నువ్వు వెంటనే పోలీసుకు ఎందుకు రిపోర్టు చెయ్యలేదు...కనీసం, ఊళ్ళో నలుగురైదుగురినేనా లేపి చెప్పవలసింది!" అని మేజస్ట్రీటుగారు అడిగేరు అచ్చయ్యను. అచ్చయ్య మొదటి ప్రశ్నతోనే గాబరాపడిపోయేడు...అంతకుముందు ఒకటి రెండుసార్లు కోర్టు ముఖం చూసేడుగాని, ఇంత డొంకతిరుగుడుగా ఎవ్వరూ అడగలేదు...అదీగాక, ఈ ప్రశ్నకు ఏమి జవాబు చెప్పితే ఏమి ముప్పు వస్తుందో అని భయపడిపోయి మౌనంగా ఊరుకున్నాడు...కేసు ఇప్పుడు

సంపూర్ణంగా తన చేతిలోకి వచ్చినందుకు మేజస్ట్రీటు సంతోషించేడు...

"సరే, నీపని అయిపోయింది...ఇంక రామన్న వెంకన్న లే ఉన్నారు. మళ్లా ఫలహారాల తర్వాత మొదలుపెడదాం" అని మేజస్ట్రీటుగారు లేచి తన రూములోకి పోయేరు. లాయరు సరాసరి బారురూము లోకి వెళ్లి—"ఛ ఛ! కేసు ఎంత అడ్డం తిరిగింది. ఇంకేంత! అవును వాళ్ళు తోలుకోసేవళ్ల లేదని రుజువయి పోతుంది. ఆ రామన్నను ఉన్నవి కాస్త, లేనివి కాస్త అడిగి కేసు కొట్టివేస్తారు. పేరు పోగొట్టు కుందుకే ఈ కేసులో చొరబడ్డాను." అని విచారిస్తూ ఉంటే మునసబుగారు, సబ్ ఇన్స్పెక్టరు, అచ్చయ్యా అక్కడకు వచ్చేరు. "బొత్తిగా పాడుచేశారండీ కేసంతా...లేకపోతే ఇంత పాడుచేసుకుంటారా ఎవ రయినా" అని లాయరుగారు తన చేతికానితనాన్ని వారందరికీ పంచిపెట్టేడు. "మే మేమిటి చేసేము లాయరుగారూ, మీ అంతటివారు ఆలోచించి చెప్పిన విధంగానే కదా మేమూ చెప్పేము...కథ తికమక లయి ఈవిధంగా తిరుగుతుందని మీరు చెప్తేకదా!" అని మునసబు అన్నాడు.

"అదే, దోషం అవునా, కాదా అన్నదే మేజస్ట్రీటు ఆలోచిస్తారనుకున్నానుగాని, మేజస్ట్రీటు గారే వారిపక్షం తీసుకొని కేసును మొదట్లోనే బోల్తా కొట్టిస్తా రనుకోలేదు. అందుకు తగినట్టు మీరూ, అచ్చయ్యకూడా మంచి చెడ్డ ఆలోచించకుండా ఇష్ట మొచ్చినట్లు చెప్పేరు...ఎవరి సాక్ష్యం బలమయిన దను కున్నానో, ఆ అచ్చయ్యసాక్ష్యమే ఒక్క అబద్ధపు సాక్ష్యంక్రింద తేలింది...ఆఖరికి ఈ ఒక్క కేసుతోనే నాపేరు మాసిపోయేట్టున్నది" అని లాయరు తన విచారాన్ని, అశక్తతని వెలిబుచ్చేడు.

మేజస్ట్రీటుగారు తిరిగివచ్చి కుర్చీలో కూర్చు న్నాడు. కోర్టు అంతా నిశ్శబ్దంగా ఉంది. ప్రేక్షక జనం కిక్కురు మనకుండా ఉన్నారు...ఒక్క గడి యారంశబ్దమే స్ఫుటంగా వినిపిస్తోంది. లాయరుగారు క్రాసుఎగ్జామినేషన్ ఏవిధంగా మొదలుపెట్టడమో అర్థంకాక అవస్థపడుతున్నాడు.

మేజస్ట్రీటుగారు వ్రాత ముగించి, రామన్నను తీసుకు రమ్మన్నాడు. ఇద్దరు పోలీసులు రామన్నను బోనులో నిలబెట్టి ప్రక్కన నిలుచున్నారు. గుమస్తా రామన్న పేరు, ఊరు, వయస్సు ఇత్యాదులన్నీ అడిగి, "నేనన్నట్టు ప్రమాణం చెయ్యి" అన్నాడు. రామన్న గతుక్కుమని "ప్రమాణమా" అని అడిగేడు. "అవును, ఈకోర్టులో ఉండగా, నేను నిజమే చెప్తాను అని ప్రమాణం చెయ్యాలి" అన్నాడు గుమస్తా. "ఆమాత్రం దానికి ప్రమాణం దేనికి?...నేనిక్కడే కాదు, ఎక్కడయినా నిజమే చెప్తాను" అన్నాడు రామన్న... "నిజమే చెప్పే మీకు ప్రమాణంచెయ్యడానికి భయ మెందుకు" అని లాయరుగారు అన్నారు. "అబద్ధాలు చెప్పేవారిని మాత్రం ప్రమాణాలు అడ్డుతాయా" అని లాయరుగారికిమాత్రమే వినిపించేటట్టు అన్నారు మేజ స్ట్రీటుగారు.

"ఎప్పుడయినా, ఏవిషయంలోనయినా ప్రమా ణం చెయ్యడం దోషం అని ధర్మశాస్త్రం ఘోషిస్తూ ఉంటే..." అని రామన్న నసిగేడు. ప్రమాణానికీ కోర్టులో వింటున్న మాటలకు గల సంబంధం తెలిసిన గుమాస్తాకు ప్రమాణంచెయ్యడం ఏవిధంగా దోషమో అర్థం కాలేదు. "అప్పటి ధర్మశాస్త్రాలు వేరు, ఇప్పటి ధర్మశాస్త్రాలు వేరు. ఇప్పుడు ప్రమాణం చెయ్యనిదే, ఏమాటగూడా విశ్వసనీయ మని ఎంచ బడదు కోర్టులో..."అని లాయరుగారు విశదీకరిం చేరు. "అవును, ప్రమాణంచేసినతర్వాత ఏది చెప్పినా కోర్టు నమ్మకుండనే లాయర్ల భావన" అన్నారు మేజ స్ట్రీటుగారు. అందరూ ప్రమాణాలు చేసి ప్రమాణాలు చేసినట్టు నిజంచెప్తాం టే, తనవంటి గుమాస్తాలు, ఎంత మంది నిరుద్యోగు లయిపోవాలో అని గుమాస్తా దిగులు గుండెలో ఆకాశంవేపు చూస్తున్నాడు.

"సరే, మేజస్ట్రీటుగారే తప్పులేదని చెప్తాంటే నేను ప్రమాణం చేయదలచుకున్నాను. అయినా నిజమే చెప్పదలచుకున్నప్పుడు ప్రమాణం చేసినంతమాత్రాన దోష మేమిటి?" అని గుమస్తా చెప్పిన విధంగా ప్రమా ణం చేసేడు రామన్న.

"లాయరుగారూ, మీరు అడుగదలచిన దేదో మొదలు పెడతారా?" అని మేజిస్ట్రేటుగారు అన్నారు. వెంటనే లాయరు లేచి, "ఆ ఆవును చూసేరా?" అని అడిగేడు.

"చూసేను...ఆ ఆవు నాదే"

"అడిగినదానికే జవాబు చెప్పండి. ఆ ఆవును మునసబు గారికి అమ్మేరు కదూ?"

"అవును. ముప్ఫయిఅయిదు రూపాయీలకు అమ్మేను. ఇంకా—"

"ఆగండి. నేనడిగినమట్టుకే చెప్పండి. ఆ ఆవు ఎక్కడ ఈనింది?"

"మునసబు గారి ఇంట్లోనే—"

"అంటే ఆదూడగూడ మునసబుగారిదే నన్న మాట!"

"కాదు. ఆదూడ ఆవుదే" అన్నారు మేజిస్ట్రేటు గారు నవ్వుతూ — శ్రోతలందరూ ఒక్కమాటు గొల్లు మని నవ్వేరు. లాయరు ముఖం చిట్లించి, గొల్లు తగ్గగానే మళ్లా ప్రారంభించేడు.

"మీరు అమ్మిన తర్వాత ఒక్కమాటు గూడా ఆ దూడ మీ యింటికి రాలేదుకదూ"

"లేదు. ఎప్పుడయినా వస్తే, ఆవులుకాచే కుర్రాడే తోలుకొని పోయేవాడు"

"ఆనాడు రాత్రి మీరూ, మీ అల్లుడూ కలిసి ఎక్కడనుండి వస్తున్నారు?"

"మునసబు గారి యింటినుండి" అని జవాబిచ్చేడు రామన్న.

"సరే, మీరు యింటికి వస్తున్నప్పుడు ఈ ఆవును, దూడను తోలుకొని వచ్చేరుకదూ?"

మేజిస్ట్రేటుగారు జాగ్రత్తగా వింటున్నారు...

"అవును"...రాస్తున్న కలం అట్టే వదిలేసేడు మేజిస్ట్రేటు. వెంటనే కలుగజేసికొని "అంటే, త్రోవలో తిరుగుతూంటే, ఇక్కడెందుకని తోలుకొనివచ్చేరు గామోసు" అని అందించేడు.

"అబ్బే! లేదండి, వాళ్ల పాకలోంచే తోలుక వచ్చేము" అన్నాడు రామన్న.

"నువ్వు ఆవును అమ్మదలుచుకున్నావుకదూ మునసబుగారికి" అని అడిగేడు మేజిస్ట్రేటు.

"అవును."

"మునసబుగారు ఏమయినా డబ్బు ఇచ్చేరా?"

"లేదు బాబూ. ఇదిగో ఇస్తాను అదిగో ఇస్తాను అని చాలారోజులు త్రిప్పేరు."

"త్రిప్పిత్రిప్పి ఆఖరుకు ఇవ్వనుపొమ్మన్నారు గామోసు"

లాయరు శ్రద్ధగా వింటున్నాడు. ఈప్రశ్న ఒక్కటి చాలు కేసునంతటినీ తారుమారు చెయ్యడానికి. రామన్న నిప్పంకోచంగా—

"ఇవ్వనే వనలేదుగాని, ఆవిధంగానే ప్రవర్తించేడు" అన్నాడు. లాయరు వెంటనే కలుగజేసికొని, "ఇవ్వలే వనిమాత్రం అనలేదు కదూ. స్పష్టంగా చెప్పండి" అన్నాడు. "ఇవ్వలేననిమాత్రం అనలేదు."

ఇటువంటివారికి తను ఎందుకు సహాయంచెయ్య దలచుకున్నాడో మేజిస్ట్రేటుకు అర్థం కాలేదు. తనపై అన్యాయంగా ఆరోపింపబడిన కేసులో, తన రక్షణ కోసం, ఒక్క అసత్యం, ఒకే ఒక అబద్ధం ఆడలేని వారిని ఎంతకని ఎగత్రోయడం! అదీగాక, దోషం ఏ మాత్రం లేకుండా, వారి నేరం ఏమీ లేదని స్పష్టంగా కనుపిస్తున్న కేసులో. తను ఎందుకు నిర్దోషిని విడిచి పెట్టలేకపోతున్నాడో అవగాహన కాలేదు మేజిస్ట్రేటుకి...

ఏదో ఆఖరి ప్రయత్నంగా మేజిస్ట్రేటు మరొక ప్రశ్న అడిగేడు. "ఎప్పుడు ఇస్తానన్నాడు డబ్బు?"

"ఆరోజు సాయంకాలమే."

"అన్నప్రకారం ఆసాయంత్రం ఇవ్వలేదు కదూ?

"లేదు. అమధ్యాహ్నమే ఏదో ఊరు వెళ్లేడట!" మేజిస్ట్రేటుగారికి కొంత ఆసరా దొరికింది మళ్లా. "ఇస్తానన్న రోజుకు ఇవ్వకపోవడమేకాక, కనుపించ

కుండాపోవడంవల్ల ఆవును తోలుకొని వచ్చేరన్న మాట."

"అవును."

కేసు దొంగతనంగా కాకుండా, ఇంకోవిధంగా తిరిగి, మునసబుగారికే దెబ్బతగిలేట్టున్నదని లాయరు ఆలోచించి, "మునసబు ఆమర్నాడే వస్తాడని మీకు తెలుసునుకదూ?" అని ప్రశ్నించేడు.

"అవును, తెలుసును."

"ఆ సాయంత్రం డబ్బు ఇవ్వకపోతే ఆవును తోలుకొనిపోవచ్చునని మునసబుగారు చెప్పేరా?"

"లేదండీ. అలాగుకే అంటే ఈబాధలే లేక పోను. మా అవసరంకొద్దీ మేమే తోలుకొనివచ్చేం."

మేజస్ట్రీటుగారికి ఒకవంక కోపమూ, ఒకవంక కోపమూగూడా వచ్చింది. ఎప్పుడూ లేనిది తను ఈ రోజున స్పష్టంగా కలుగజేసికొంటే, ఈకేసే ఇంత విపరీతంగా తిరగాలా?......తన సహాయాన్నైనా గుర్తించకుండా ప్రవర్తించిన రామన్నమీద కోపము, అతని అమాయకత్వంమీద జాలి రెండూ కలిగేయి. కాని ఏంచెయ్యగలడు?...

"సరే, ఇంకా ఏమయినా చెప్పవలసిఉంటే చెప్పు" అని తను ఏదో వ్రాసుకోడం మొదలు పెట్టేడు.

"ఆ మునసబు ఆరోజుసాయంత్రానికి అన్న ప్రకారం డబ్బివ్వలేదు. కద్దీంగూడా దగ్గరపడు తోంది. అదీగాక ఇంట్లో మా ఆడదికూడా ఆవును తోలుకొనిరమ్మని తీ చేస్తోంది. అందుచేత, ఆగాత్రే నేనూ, మా అల్లుడూ బయలుదేరి, ఆవును నేనూ, దూడను మా అల్లుడూ తోలుకొనివచ్చి మాయింట్లో కట్టేసేం. మరునాడు వీరంతా కలిసి మామీందు పెట్టేరు." అన్నాడు రామన్న తనకు కలుగబోయే విపత్తుతో లక్ష్యం లేనట్టు.

మేజస్ట్రీటుగారు తన, వ్రాత ముగించి, తన తీర్పును ఈవిధంగా చదివేరు—

"మునసబుగారు ఇంట్లో లేని సమయమందు రాత్రిపూట వెళ్లి మునసబుగారి ఆవులసాలలో ఉన్న ఆవును, పెయ్యను, దొంగతనంగా రామన్న తన యింటికి తీసుకొనివచ్చినట్లుగా కోర్టువారి ముందు ఉంచబడిన సాక్ష్యములవల్ల తెలియుచున్నది. అందు చేత ఈ దొంగతనములో పాల్గొన్న రామన్నయున్నూ, అతనికి సహాయముచేసిన వెంకన్నయున్నూ నేరస్థులుగా ఈకోర్టువారిచే నిర్ణయింపబడింది. వారి నేర మును వారే స్వయముగా వ్యక్తపరుచుటచేతను, కొన్ని అసహాయపరిస్థితులలోనే వారానేరమును చేయుట చేతను, రామన్నకు పదిహేనురోజులును, వెంకన్నకు వారముగోజులును కారాగారశిక్ష నేటినుండి విధింప బడినది"—అని పూర్తిచేసి తన కుర్చీలో మళ్లా కూర్చు న్నారు.

"నా ఆవును నేను తోలుకొనివచ్చినా దోష మేనా?" అని రామన్న అడిగేడు దీనంగా.





# కృష్ణదేవరాయలు

## ౧. వంశాదికథనము

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

కృష్ణరాయలు చంద్రవంశాంతర్గతతుర్వసుకుల సంభూతుఁడను క్షత్త్రియుఁడని యతని శాసనములందు చెప్పియున్నది. క్రీ శ. ౧౫౧౧-వ సం. నాటి శేర్ల కరతామ్రశాసనమున—

"అస్తి క్షీరమయా ద్దేవై
　　ర్మథ్యమానా న్మహాంబుధేః
నవనీతమివోద్భూత
　　మపనీతతమో మహః
తస్యాసీ త్తనయ స్తపోభి
　　రతులై రన్వర్థనామా బుధః
పుణ్యైరస్య పురూరవా
　　భుజబలైరాయుర్ద్విషాం నిఘ్నతః
తస్యాయుర్నహుషో౽స్య
　　తస్య పురుషోయుద్ధే యయాతిః క్షితౌ
ఖ్యాత స్తస్యతు తుర్వసు
　　ర్వసునిభః శ్రీ దేవయానీపతేః ॥
తద్వంశే దేవకీజాని
　　ర్దిదీపే తిమ్మభూపతిః
యశస్వీ తుళువేంద్రేషు
　　యదోః కృష్ణఇవాన్వయే ॥
తతోభూ ద్బుక్కమాజాని
　　రీశ్వరక్షితిపాలకః
అత్రాసమగుణో త్తంసం
　　మౌళిరత్నం మహీభుజాం ॥
నరసా దుదభూ త్తస్మా
　　న్నరసావనిపాలకః
దేవకీనందనా త్కామో
　　దేవకీనందనా దివ ॥

*　　*　　*

తిప్పాజీ నాగలాదేవ్యోః
　　కౌసల్యా శ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్రా
　　త్తస్మా త్పంక్తిరథాదివ ॥
వీరౌ వినయినౌ రామ
　　లక్ష్మణావివ నందనౌ
జాతౌ వీరనృసింహేంద్ర
　　కృష్ణరాయమహీపతీ ॥" 1

---

1. ఎపి. కర్ణా. సం. ౧౧. హో౯. నెం. ౯౪.

అని కృష్ణరాయలవంశము వర్ణింపబడినది. ఇందువలన చంద్రవంశమునకు జెందిన తుర్వసుని సంతతి వారిలో తుళువేంద్రులయందు యశస్వియగు తిమ్మ భూపతి పుట్టెననియు, నతనికి దేవకియందు బుక్కమ భర్తయగు నీశ్వరక్షితిపాలకుడు గలిగెననియు, వారికి నరసావనిపాలకు డుదయించె ననియు నతని భార్యలలో దిప్పాజియందు వీరనృసింహేంద్రుడును, నాగలాదేవి యందు కృష్ణరాయమహీపతియు దశరథునకు గౌసల్యా సుమిత్రలయందు రామలక్ష్మణులవలె జనించిరనియు దెలియవచ్చుచున్నది. ఈవంశానుక్రమణికయే ఆకాల మున రచింపబడిన సంస్కృతాంధ్రగ్రంథములయందును నల్ప భేదములతో గానవచ్చుచున్నది. అచ్యుతరాయా భ్యుదయమున కైలాసనమునందువలె చంద్రుడు మొదలు తుర్వసునివఱకు గల వంశక్రమము చెప్పబడి యున్నది. మఱియు తుర్వసుని వంశమున పెక్కు రాజులు గలిగిరనియు, వారియందు విఖ్యాతుడగు తిమ్మ భూమిపాలకుడు జనించె ననియు గలదు.

"అజాయతౌ వ్యాజసుహృత్ప్రజానాం
సపూర్వజా స్తుర్వసురుర్వరాయాం
తదన్వయే పుణ్యఫలాదనన్యాం
ధన్యాబభూవు ర్ధరణీభుజోఽన్యే॥

................

నాలీకినీనాయకవద్గ్రిహేషు
నీహారభూమీధరవన్న గేషు
వలాసుహృద్వారణవద్గజేషు
శేషుప్రతీతోఽజని తిమ్మభూపః"2

ఇందు తుళవేంద్రులప్రస్తావము లేదు: కాని కృష్ణరాయకృత ఆముక్తమాల్యదయందును, మఱియు నారాయల కంకితముసేయబడిన యాంధ్రప్రబంధములు గొన్నింటియందును తుర్వసువంశము తుళవాన్వయ మాయె ననియు, నందు కృష్ణరాయల ప్రపితామహుడైన తిమ్మభూపాలు డుదయించెననియు జెప్పియున్నది.

పై నుదాహృతమైన అచ్యుతరాయాభ్యుదయమున జెప్పి నట్లు ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణము నందును:

"ఉర్వీశమాళియగు నా
తుర్వసువంశంబునందు దుష్టారిభుజా
దుర్వారగర్వరేఖా
నిర్వాపకు డీశ్వరాఖ్యనృపతి జనించెన్."3

అనియే యున్నది. తుళవేంద్రుల ప్రశంస ఇందును, లేదు. కాని కృష్ణరాయకృతాముక్తమాల్యద యందును పెద్దనార్యకృతమనుచరిత్రయందును తుర్వ సుని వంశమే తుళువాన్వవాయమైనట్లు చెప్పియున్నది.

"అతనికి యదుతుర్వసులను
సుతు లుద్భవమంది రహితవాదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించె దుర్వసుడు గుణనిధియై
వాని వంశంబు తుళువాన్వవాయమయ్యె
నందు శక్కంద్రునృపు లుదయంబునొంది
నిఖిలభువనప్రపూర్ణనిర్నిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమున బుట్టి.4"

తామ్రశాసనమున తుర్వసువంశజుడగు తిమ్మ భూపతి తుళువేంద్రులలో యశస్వి యని యుండగా నాముక్తమాల్యద మనుచరిత్రలయందు తుర్వసుని వంశము 'తుళువాన్వవాయమయ్యె'నని చెప్పియున్నది. తుర్వ సుని వంశజులు తౌర్వసు లనదగుదురు కాని తుళువ లెట్లు కాగలరు? 'తుళువ'శబ్దము 'తులు' శబ్దభవమగు విశే షణము. దానికి అర్థము తులదేశసంబంధమైన, లేక తులు దేశోద్భవమైన అని. ఈ తులుదేశము పశ్చిమసము ద్రమున విజయనగరసామ్రాజ్యములోని కణకువరియై యుండిన యొక మండలము. ప్రస్తుతపు దక్షిణకన్నడజిల్లా ప్రాచీనతుళువమండలమున నొక భాగము. కావున తుళువవంశమునకు తుళువమండలముతో నేదో సంబంధ ముండెనని తోచుచున్నది. సాళువనరసింహరాయల కాలమున (క్రీ. శ. ౧౪౭౮-౧౪౯౦) నందిమల్లయ్య ఘంటసింగయలచే రచింపబడి, నరసానాయకుని కంకి తముసేయబడిన వరాహపురాణపీఠికయందు తుళువవంశ

2. అచ్యుత. ౧: ౧౮, ౨౨, ౨౩.

3. పారి. ౧: ౮.

4. ఆముక్త. ౧: ౨౨-౨౩

మునకు మూలపురుషుడగు తిమ్మక్ష్మాశ్రీరమణుడు తుళు దేశస్థుడని స్పష్టముగ జెప్పియున్నది.

"మిన్నుల మోచి భాగ్యముల
మీఱిన కోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటగరి
మంబుల దోటల వాహవారణా
భ్యున్నతి గేలిదీర్ఘికల
సద్గ్రథటావలి వన్నె కెక్కు నా
రాన్నిధి కాంచిపై దుళువ
రాజ్యము సంతతవీరభోజ్యమై.
ఆతుళువరాజ్యమున వి
ఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
ధూతమదఘోశనవి
ద్యోతత్పరకీర్తి చెంద్లియాడిన రాజుల్.
వారల కగ్రగణ్యుడు ని
వారితవైరివరూథినీధవ
శ్రీరమణీవిలాసుడు వి
చిత్రకళాకుశలుండు తిమ్మధా
త్రీరమణుండు సంపద వ
రించె మరాటవరాటలాటగాం
ధారయుగంధరాదిపస
దఃప్రకటీకృతశౌర్యవీర్యుడై." 5

తుళువవంశానుక్రమణిక మొట్టమొదట గాన వచ్చున దీవరాహపురాణమునందే. ఇందు చంద్రవంశము మాటగాని, తుర్వసుని ప్రస్తావనగాని లేదు. తుళువవంశమునకు మూలపురుషుడైన తిమ్మధరణీశ్వరుడు తుళువరాజ్యమున ఖ్యాతివహించిన రాజుల కగ్రగణ్యుడని స్పష్టము చేయబడినది. వరాహపురాణపీఠికయం దింకొకవిశేషము గలదు. ఇందు కృతిపతియైన తుళువనరసనాయకుడును నతని పూర్వికులును క్షత్రియజాతికి సహజమైన సూర్య చంద్రవంశములలో దేనికిజెందినవారో వివరింపకున్నను నా నరసనాయకునికి "బతియైన సాళువనరసింగరాజ రాజమౌళి పావనాన్వయ" మునకు 'చంద్రుడు వంశకర్త' యని చెప్పియున్నది. ఇంకను నా సాళువ నరసింగరాయమహారాజు 'తుహినాంశువంశపాథోరాశి మాణిక్య' మని పేర్కొనబడినాడు. సాళువ నరసింగరాయల వంశము చంద్రవంశమని తెల్పిన కవులు కృతిపతియైన నరసానాయకు డేక్షత్రియశాఖకు జెందినవాడో విశదముసేయక మూకీభావము వహించి యీ యంశమును సన్నసన్నగ జాఱవిడుచుటను జూడ తుళువరాజులు క్షత్రియులు గారని వీరి యభిప్రాయమేమో యను సంశయము గలుగుచున్నది. ఈ సంశయమును బలపఱచగల విషయ మింకొక్కటి కలదు. సంస్కృతాంధ్రగ్రంథములందును. శాసనములలోని సంస్కృతప్రశస్తులందును క్షత్రియులకు సైజములగు రాజ, నృప, పార్థివాభిధలతో పేర్కొనబడియున్నను, దేశభాషలందు ప్రకటితములైన శాసనములు దేశభాషా గ్రంథములు మున్నగువానియందు కొన్నింటియందును రెండవమూడవ తరముల తుళువప్రభువులు 'నాయకు' లనియే పిలువబడియున్నారు. "ఇమ్మడి నరసింగరాజ మహారాయర సేనాధిపతి ఈశ్వరనాయక వొడయర కుమార...నరసంణనాయకవొడయరు", "ఇంమడి నరసింగరాయమహారాయర కార్యకర్తరాద నరసంణ నాయక వొడయరు" ఇత్యాదులు శాసనములందు గాన వచ్చుచున్నవి.6 ఇట్లే రాయవాచకమునందును కైఫియతులందును, 'ఈశ్వరనాయంకుడున్నూ, నరసానాయంకుడున్నూ, వీరనరసింహ్మరాయలవారున్నూ యేలి వందుకన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది;' 7 "నరసింహదేవరాయలవద్ద కార్యకర్తఅయిన నరసానాయనింగారు"8 మొదలైన వాక్యములలో ఈశ్వర నాయకుడు, నరసానాయకు డనియే వారిపేరులు గానవచ్చుచున్నవి. సర్వసాధారణముగ నన్ని యెడల నరసారాయనిజ్యేష్ఠపుత్రుడు 'వీరనరసింహరాయ'లని వ్యవహరింపబడియున్నను, క్వాదాచిత్కముగ 'ఈశ్వర నాయనింగారి మనుమడును నరసానాయనింగారి కుమారుడునైన ఇమ్మడినరసానాయనింగార'ని శాసనములం దచటనచట గానవచ్చుచున్నది.9 వరాహపురాణ

౫. వరాహ. ఆ. ౧: ౨౫-౩౭.

6. *EC. X. In. 259*, IX. *Cp. 52*, *ARE 143 of 1905, 719 of 1917.*

7. *Further Sourcs. Vol II. No. 129(b).*

8. *Ibid. No. 91.*

9. *ARE 54 of 1915.*

పీఠికయందు తుళువవంశజులు క్షత్రియజాతియం దేశాఖకు చెందినవారో చెప్పకపోవుటయు, శాసనాదులం దీవంశజులగు మొదటిప్రభువులు 'నాయక' శాంతనామ ధారులగుటయు జూచి యీవంశమువారు క్షత్రియులు గారనియు, శూద్రులనియు తలంపుగలుగవచ్చును. కాని యట్లని దృఢముగ బల్కుటకు వీలులేదు. ఏల నగా, తుళువరాజులు క్షత్రియులు కారనియు, శూద్రులనియు నెచ్చటను జెప్పియుండలేదు. మఱియు నీవంశపు మొదటిరాజులు నాయకులని పేర్కొనబడి యున్నను అందువలన వారు శూద్రులని నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. క్రీ. శ. ౧౫,౧౬ శతాబ్దములందు బ్రాహ్మణాదిగ సర్వవర్ణములవారును నాయకనామమును ధరించెడువారు. కృష్ణదేవరాయలవారి కడపటి దినములలోను, నచ్యుతరాయలవారి రాజ్యారంభదశయందును రాయలవారికి ప్రధానమంత్రియైయుండిన వీరనరసింహ నాయక సాళువదణ్ణాయకుడు బ్రాహ్మణుడు. ఇతని జన్మనామము సెల్లప్ప; ఇతడు తాలువకు వైర్దక్ భట్టను కాంచీపుర బ్రాహ్మణుని కుమారుడు.10

కావున ఈశ్వరనాయక నరసానాయక ఇమ్మడి నరసానాయకాది తుళువప్రభువులు నాయకనామమును గలిగియుండినంతమాత్రమున వారు శూద్రులనియు, క్షత్రియులు గారనియు నిర్ధరించిచెప్పుటకు వలనుపడదు. లభ్యమైన సాక్ష్యమును పరిశీలించి చూడగా తుళువ రాజులు శూద్రులనుటకంటె క్షత్రియులని చెప్పుట యొప్పు.

ఇట్లు తుళువరాజులు క్షత్రియులని తలచుట సమంజసమైనను, వారు రాజపదమును బడయుటకు ముందు తమ క్షత్రియత్వమును బ్రకటించుకొనియుండ లేదు. తుళువరాజులలో రాజ్యాభిషిక్తుడై మొదట మహారాయపదము నందినవాడు వీరనరసింహరాయడు. ఇతడు క్రీ. శ. ౧౫౦౬ వ సంవత్సరమున దనకు యజమానుడైన సాళువ ఇమ్మడినరసింహ ధమ్మరాయని జంపించి సింహాసనము నాక్రమించుకొని రాజ్యాభిషేకము గావించుకొనెను. ఇతడే తుళువవంశము చంద్ర వంశాంతర్గతమని మొదట చెప్పుకొనుట కారంభించిన వాడు. ఇతని కాలముననే శాసనములం దగపడు తుళువ వంశ ప్రశస్తి రూపొందినది. వీరనరసింహరాయల శాసనములలో నీప్రశస్తి రెండువిధములుగ గాన్పించు చున్నది. అందొకటి నరసింహార్యకృతము. ఇది యిట్లున్నది.

అజునికి అత్రి; అతనికి చంద్రుడు; చంద్రునికి బుధుడు; వానికి పురూరవుడు; పురూరవునికి ఆయువు; అతనికి నహుషుడు; నహుషునకు యయాతి; వానికి తుర్వసుడును జనించిరి. అతని వంశస్థులు కురుదేశమున వృద్ధినందిరి. తద్వంశజులలో కొందఱు సుగ్రీవునిచే బూజలుగొన్న రఘువంశోత్తము డగు సీతారాముని సేవింప కిష్కింధకు వచ్చి యచ్చటి దేశసౌందర్యమును మెచ్చి హేమకూటప్రాంతమున వసతు లేర్పఱచుకొని యచటనే నివసింప మొదలిడిరి.

వారిలో తుళువవంశాంబుధిచంద్రుడును, మహా పరాక్రమశాలియు నగు దిలీపు డొక్కడు. దేవకీజాని యగు నతని కీశ్వరుడు పుట్టెను. అతనికి నరసరాజు పుట్టెను.11

ఈ వంశానుక్రమణికయందు రెండుమూడు విషయములనుగూర్చి కొంత విమర్శ కెడమున్నది.

(౧) కురుదేశస్థులును తుర్వసువంశజులగు రాజులు కొందఱు సీతారాముని సేవింప కిష్కింధకు వచ్చి యచ్చట నివాసము లేర్పఱచుకొని స్థిరముగ నిలిచి పోవుట మఱి యేశాసనమునను గ్రంథమునను, గానరాని విషయము. ఇది ఈశాసనములో గాన్పించు నూతన విషయములయం దొకటి.

---

*10. ARE. 487 of 1920, 225, of 1916.* సాళువతిమ్మరసయ్యగారి కుమారుడు తిమ్మయ్యకు 'దణాయకుడు' నియు 'తిమ్మదణాయకుడు' నియు పేర్లుండి నట్లు న్యూనిజు వ్రాసియున్నాడు. (*For. Emp. 360-61*) నేటికిని మంగుళూరుప్రాంతముల నివసించు కొంకణి తులు బ్రాహ్మణు లనేకులు 'నాయక' నామాంతధారులు గలరు. బలిజలు కమ్మలు వెలగలు మొదలగు పలు శూద్రజాతులవారేకాక మాలలుగూడ నాయకు లనబడుచుండిరి.

11. *EC. X gd. 77.*

(౨) అట్లు కిష్కింధకు వచ్చిన తుర్వసువంశజు లందఱును తుళువరాజులు గారు. వారిలో గొందఱు మాత్రమే తుళువవంశమునకు జెందినవారు. ఇదియును క్రొత్త సంగతియే. తుర్వసువంశజులే తుళువ లైరని ఇందు చెప్పలేదు.

(౩) ఈశ్వరనాయకుని తండ్రి దిలీపుడట. అన్ని సంస్కృతాంధ్రగ్రంథములలోను శాసనములందును తిమ్మభూపతి యని యున్నది. 'జిదీపే తిమ్మభూపతిః' అనునదియే దిలీపు డనుటకు కారణమైయుండు నేమో. ఈ పౌరాణికవంశవృత్తము వాస్తవమైనది కాదు; కేవలము కల్పన. ప్రఖ్యాతికివచ్చిన రాజన్యకుటుంబము లన్నియు దమ కులీనతను బ్రకటించుకొనుట కిట్టి కల్పితపౌరాణికవంశవృత్తములను వ్రాయించుకొని నిజవంశమున గతికించుకొనుట సాధారణమే. ఇందు వింత యేమియు లేదు. ఏకారణమువలననో తుళువ రాజులకు నరసింహార్యునిచే ప్రథమమున వ్రాయించు కొనిన ప్రశస్తి నచ్చకపోయినది. సభాపతి శాసన గ్రంథ రచయితయైన పిమ్మట నూతనప్రశస్తిని వ్రాయించుకొనిరి. ఈ సభాపతికృతనూతన ప్రశస్తియే సర్వసామాన్యముగ తుళువ శాసనములందు గానవచ్చును.

తుళువరాజులు చంద్రవంశాంతర్గతతుర్వసుకులక్షత్రియులని దానశాసనాదులందు చెప్పబడియున్నను కొన్నియెడల వేఱువిధముగ నున్నది. సమకాలీన గ్రంథకర్త లందరివలెను ముక్కుతిమ్మనార్యుడుగూడ తుళువరాజులు తుర్వసువంశజులని వ్రాసియున్నను పారిజాతాపహరణమునందు కృష్ణరాయలను వర్ణించుచు,—

"చక్రవర్తిమహాప్రశస్తి నాడును నేడు
చెలగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాడును నేడు
గోరక్షణఖ్యాతి గుదురుపఱిచె
సాధుబృందావనసరణి నాడును నేడు
వంశానురాగంబు వదలడయ్యె
సత్యభామాభోగసక్తి నాడును నేడు
నాకల్ప మవని నింపార నిలిపె
నాడు నేడును యాదవాన్వయమునందు
జననమందెను వసుదేవమనుజవిభుని
కృష్ణుడను పేర నరసేంద్రుకృష్ణదేవ
రాయ డనుపేర నాదినారాయణుండు."12

అని కృష్ణరాయలు యాదవాన్వయమునందు పుట్టినట్లు వచించినాడు. కృష్ణరాయలు యాదవు డయిన నతనిపూర్వికులందఱును యాదవులు గావలయును గదా. తుర్వసుని సంతతివారిని యాదవులనుట యెట్లు? ఈ ప్రశ్నకు దగిన సమాధాన మెద్దియో తెలియదు.

వాస్తవ మెట్లున్నను ప్రస్తుతము మనకు లభించిన సాక్ష్యమును బరిశీలించి విచారింపగా తుళువ రాజులు క్షత్రియులని యంగీకరించుట సరియని తోచుచున్నది. కాని వారు క్షత్రియజాతికి సహజమైన సూర్య చంద్రాన్వయములు రెంటియందును దేనికి జెందినవారో నిశ్చయించి చెప్పుటకు దగు సాధనములు లేవు. తాము చంద్రవంశమునకు జెందిన తుర్వసుకులజులమని వారు చెప్పుకొనిరి. వారి పౌరాణికవంశవృత్తము కల్పనయగుట వలన నది విశ్వాసపాత్రము గాదు. కాని దీని నంగీకరించినందు వలన కలిగెడు లాభము లేదు; త్యజించుట వలన వచ్చు నష్టమును లేదు.

౨

కృష్ణరాయలు తుళువక్షత్రియుడగు నరసానాయకునికి పుత్రుడు గావచ్చును. ఆకారణమువలన నతడును క్షత్రియుడే యని నిశ్చయించుటకు వలను పడెదు. అతని తల్లి క్షత్రియస్త్రీగాక క్రింది జాతులలో బుట్టినదై యుండిన నతనిది తల్లికులమగునుగాని తండ్రికులము గాజాలదు. కృష్ణరాయల జన్మమును గూర్చిన గాథలు పెక్కు ఆంధ్రదేశమున బ్రచారమునందున్నవి. కృష్ణరాయల తల్లియగు నాగలదేవి నరసానాయకుడు ద్వాహము జేసికొన్న కులవధువు గాదనియు, భోగకాంత యనియు, దత్కారణమున నతడు క్షత్రియుడు గాడనియు, దాసీపుత్రు డనియు వీనిసారాంశము. ఉదాహరణార్థ మొకటిరెంటి నిచట సంగ్రహముగ

12. పారి. ౧ : ౧౯.

వివరించుట యుక్తము. కృష్ణరాయల తండ్రియగు నరసింహరాయకు ఒకనాడు దుష్టసమయమైనపిమ్మట కాలోచితకృత్యముల దీర్చుకొనుటకు బహిర్దేశమునకు జనియెను. ప్రక్షాళనమునకై కొనిపోయిన యుదకపాత్రయం దొక్క తేళ్ళోవంతియగు చుక్క తెగిపడెను; అంతట నరసింహరా జాపాత్రను దన యుం చేతితో మూసి యీ వర్తమానము తిమ్మరసునకు జెప్పిపంపెను; తిమ్మరస మామాట వినగనే రాజా నా నీరు ద్రాగమని ప్రత్యుత్తరమంపెను. తిమ్మరసుసలహా ప్రకారము ఆనీరు ద్రావి నరసింహరాయ లారాత్రి తన దేవితో నిద్రించుట కంతఃపురమునకు బోయెను. పట్టపుదేవి తిప్పాజి బహిష్ఠయైయుండినది. దానికి చింతించి యాత దారాత్రి దేవిచెలికత్తెలయం దొకదాని సంగతి నుండెను. ఆచెలికత్తె గర్భవతియై కాలక్రమమున కృష్ణరాయల గనెను. ఈ కథప్రకారము కృష్ణరాయల తల్లి పట్టపుదేవి తిప్పాజి చెలికత్తెలలో నొకతె. మఱియొకకథ దీనికంటె గొంచెము భిన్నమైనది :—

విజయనగర మేలిన వీరనరసింహరాయలకు చిరకాలము పుత్రసంతతి లేదు. ఒకనాడు రాజుదగ్గఱకు బ్రాహ్మణు డొకడు వచ్చి యారాత్రియొక సుముహూర్తము గలదనియు, నా ముహూర్తకాలమున బట్టపుదేవి సంగతి నుండిన సుపుత్రుడు గలుగుననియు జెప్పెను. అంతట నరసింహరాయలు అంతఃపురమునకుబోయి తిప్పాజీదేవికి వర్తమానమంపెను; కాని యామె సింగారించుకొనివచ్చు లోపల నా శుభముహూర్తము గడచి పోవుచుండెను. రా జందుకు విసిగి పడకటింటిలో నప్పుడు దీపములు బాగుసేయుచుండిన దాసిని నాగిని జూచి ముహూర్తమును వ్యర్థపడనీయక దానిగూడెను. నాగి కంతట గర్భము గలిగెను. నవమాసములు నిండిన పిమ్మట నొక తేజశ్శాలి పుత్రు డుదయించెను. అతడే కృష్ణదేవరాయలు.

ఇట్టివి మఱికొన్ని కథలు గలవు. ఇవి విశ్వాసపాత్రములు గావు. న్యూనిస్ చరిత్రయందుగాని, రాయవాచకమునందుగాని, శాసనములందుగాని కృష్ణరాయల తల్లియగు నాగాంబ కులస్త్రీ కాదనుట కాధారము గానరాదు12a.

న్యూనిసు నరసానాయకుని సంతతిని ఇట్లు వర్ణించియున్నారు: "నరసానాయకునికి పుత్రు లైదుగురు: ఒకడు బుస్బలరావు (భుజబల రాయలు); ఇంకొకడు క్రిస్మరావు (కృష్ణరాయలు); మఱియొకడు తెతరావు (అచ్యుతరాయలు); ఇంకొకడు రమిగప (రంగప్ప); ఇంకొకడు ఔమిషాయ(?)"13 న్యూనిస్ కృష్ణరాయల సమకాలికు డనియు, నతడు క్రీ. శ. ౧౫౩౬ నకు పూర్వము విజయనగరచరిత్రను రచించెననియు పూర్వప్రకరణమున జెప్పియున్నాడను. కాని న్యూనిసు నరసనాయకుని పుత్రులను బేర్కొనెనే కాని వారి తల్లులు కులపాలికలో భోగకాంతలో తెలుపలేదు; కావున న్యూనిసు సాక్ష్యమువలన కృష్ణరాయలు భోగకాంత పుత్రుడు గాడనియు, ధర్మపత్ని గర్భమున బుట్టినవాడనియు రుజువుసేయుటకు వీలుగాదు అను నాక్షేపణ రావచ్చును. కాని న్యూనిసుచరిత్రయందు దాపరికములు గానరావు. కృష్ణరాయల చరిత్రమునకు గళంకమును గల్గించు నంశములనుగూడ మొగమోట మించుకంతయు లేక నతడు వర్ణించియున్నాడు. చిన్నాదేవి వృత్తాంతము దీనికి దార్కాణ.

" ఈ కృష్ణరావు పసివాడై బిస్నగపట్టణమున బెరుగుచుండినప్పుడు, చిన్నాదేవి యను వెలయాలితో జంజాటము గలిగినది. దానిపై నతనికి నిర్భరమైన వలపు; మోహాతిశయమువలన దా నొకవేళ రాయలైన పక్షమున దానిని వివాహమాడెదనని చెప్పియుండెను.

---

12a. కీ. శే. వీరేశలింగం పంతులుగారు ఇట్లు వ్రాసియున్నారు: "కృష్ణదేవరాయల తండ్రియైన నరసింహరాయనికి తిప్పాంబయనియు, నాగమాంబయనియు ఇద్దఱు భార్యలు గలరు. ఆ యిరువురిలో తిప్పాంబ పట్టపురాణియనియు నాగాంబ భోగకాంతయనియు జెప్పుదురు. కొన్ని శాసనములందు గూడ నిట్లే కానబడుచున్నది." ఆం. క. చ. రెండవ భా. పుట ౧౧. ఇది కేవలము నిరాధారమైన వ్రాత.

13. సూయెల్. ఫర్గాటన్ ఎంపైర్ పుట ౩౧౮.

పరియాచకమున కతడట్లన్నను, వాస్తవముగ నతడు రాయలాయెను. అట్లు చరిత్ర తెల్పుచున్నది. సింహాసనము నధిష్ఠించినపిమ్మట నతడు దత్పూర్వము పతితనమందు జేసిన చేష్టల నన్నింటిని విస్మరించినను ఆవెలయాలిమీది వలపును మరువలేదు ; రాజమందిరమునుండి రహస్యముగ దాని యింటికి బోవువాడు. ఈవిషయ మాతనిమంత్రి సల్లపతినిచ (సాళువతిమ్మయ) యొక రాత్రి కనుగొని యతని వెంబడించి దాని యింటికి బోయి యచట నతని ఖండించి రాజమందిరమునకు మరల దోడ్కొనిపోయెను. అచట రాజు దానియందు దా నెంత గాఢానురక్తుడై యుండినదియు, దానిని తానెట్లు వివాహమాడెదనని వాగ్దత్తము జేసినదియు జెప్పి యెట్లైనను దా నాడినట్లు చేయనిశ్చయించుకొంటి ననియు బల్కెను. అతని సంకల్పము దృఢమైనదని గ్రహించి మంత్రి యతని యిష్టానుసారము వర్తించుట మేలని తలచి యేలినవారి కపయశస్సు రానీయక నిర్వహించెదనని చెప్పెను. తాను చెప్పినట్లు సేయుటకొఱ కతడు (మంత్రి) నరసింగదేశనృపాలుర యింట బుట్టిన సుందరాంగియగు కన్యను దెచ్చి యతనికి (రాజునకు) వివాహముగావించి యుద్వాహోత్సవములు ముగిసినవెనుక నామెను నాభోగకాంతతో గూడ నొక్కమందిరమున నుంచెను."14

కృష్ణరాయలు వెలయాలిని బెండ్లాడెనని చెప్పిన చరిత్రకారుడు వాస్తవముగ నతని తల్లి భోగకాంతయో, దాసియో యైయుండిన యెడల నావిషయమును దెల్పక యుండడు. తన మాతృదేశమగు పోర్చుగలందు పోర్చుగీసుచరిత్రకారుని యుపయోగార్థము పోర్చుగీసుభాషయందు వ్రాసిపంపిన వృత్తాంతమున గృష్ణరాయలు నిజముగ దాసీపుత్రుడే యైయుండిన నాయంశమును జెప్పక దాచవలసిన యవసర మేమియు గానరాదు.

మఱియు గృష్ణరాయలతని ద్వైమాతుర జ్యేష్ఠభ్రాత యగు వీరనరసింహరాయల శాసనములం దిట్లు వర్ణింపబడి యున్నాడు.

"తిప్పాజీనాగలాదేవ్యోః
కౌసల్యా శ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్ర
త్తస్మాత్త్వం త్రిరథాదివ ॥
వీరౌ వినయినౌ రామ
లక్ష్మణౌ వీరనందనౌ
జాతౌ వీరనృసింహేంద్రః
కృష్ణరాయమహీపతీ ॥"15

తస్మాన్నరసరాజేంద్రా
త్తిప్పాజీనాగమాంబయోః
క్రమాద్వీరనృసింహేంద్ర
కృష్ణరాయౌ బభూవతుః ॥
అన్యోన్యోపమయోస్సర్వ
సద్గుణౌఘసముద్రయోః
తయోర్వీరనృసింహేంద్రః
పిత్ర్యం సింహాసనం శ్రితః ॥ "16

పై నుదహరింపబడిన శ్లోకములందు తిప్పాజియు నాగలాదేవియు దశరథునికి కౌసల్యా సుమిత్రలవలె దేవులు. అనగా పట్టాభిషిక్తలైన భార్యలు, వారొండొరులకు సమానులు. కావుననే వారికి బుట్టిన పుత్రులు రామలక్ష్మణులతో బోల్పబడిరి. వీరనరసింహరాయలు కృష్ణరాయలతల్లిని నాగలాదేవిని తన తల్లిని బోలి నరసానాయకుని 'దేవి' యని చెప్పుటవలన నామె కులసతియే కాని భోగకాంత కాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇంకొక విశేషము. నరసానాయకునికి భార్యలు మువ్వురుండిరి. తిప్పాజీనాగలా దేవులుగాక రంగక్షితీంద్రాచ్యుతదేవరాయజనని యోబాంబ యను మఱియొక భార్య నరసానాయకుని కుండినను కృష్ణరాయని నతని తల్లియగు నాగలను దన శాసనములందు పేర్కొనిన వీరనరసింహరాయలు వారి మాట యెచ్చుటను ఎత్తకపోవుట చిత్రము. నాగలాదేవియు ఓబాంబవలె నతనికి సవతి తల్లియే కదా. కృష్ణరాయలవలె రంగాచ్యుతులును సవతితమ్ములే కదా.

---

14. నూనెజు - ఫరగాటక్ యెంపైర్. పుటలు ౩౬౨-౩.

15. కంచికామకోటిపీఠస్థులగు శ్రీ శంకరాచార్యులవారి యొద్దనుండు తామ్రశాసనములు, నెం ౨. పుట ౨౨.

16. ఎపి. కర్ణా. సం. ౧౦ నోరి. ౭౭.

నాగలాదేవిని కృష్ణరాయలను మహా గౌరవముతో చేకొనిన వీరనరసింహరాయలు వారి ప్రస్తావ మేల చేయలేదో ?

## 3

ఇంతవఱకు నడచిన చర్చవలన కృష్ణదేవరాయలు జన్మించిన తుళువవంశము క్షత్రియవంశమనియు నాద్యమున నావంశమువారు తుళు దేశవాస్తవ్యులనియు నతనితల్లి నాగలాదేవి నరసనాయకుని కులవధువనియు తేలుచున్నది. ఈపట్టున విచారింపవలసిన సమస్య యొకటి గలదు. కృష్ణదేవరాయలు క్షత్రియుడనుటసరి. కాని యాతని జాతి యొద్ది ? ఆంధ్రుడా ? కర్ణాటకుడా ? ఈప్రశ్నలకు సమాధానము చెప్పుట సులభకార్యము గాదు. ఒకదృష్టితో జూచిన కృష్ణరాయ లాంధ్రుడును గాడు, కర్ణాటకుడును గాడు. తుళువరాజవంశమునకు మూలపురుషుడును కృష్ణరాయలకు ముత్తాతయునైన తిమ్మరాజు తుళు దేశస్థుడని వరాహపురాణమున స్పష్టముగ చెప్పియున్నది. ఇతని వంశమున బుట్టినవారందఱు తుళుజాతివారగుదురు కాని యన్యజాతివారు కాజాలరు ; కాని మఱియొకదృష్టినిజూచిన వారాంధ్రులగుదురు గాని యన్యులు గారు. వారి ఆదిమ జన్మస్థానము తులుదేశమైనను, మూలపురుషుడైన తిమ్మరాజునాటినుండే జన్మదేశమును త్యజించి దక్షిణాంధ్రదేశమునకు వచ్చి చంద్రగిరియందు సాళువ రాజుల నాశ్రయించి యచటనే స్థిరనివాసము నేర్పఱచుకొని నిలిచిపోయిరి. నాటినుండి తుళువవంశము వారి కాంధ్రదేశము మాతృదేశ మాయెను. ఆంధ్రరాజకుటుంబములతో సంబంధబాంధవ్యములను గల్గించుకొనిరి. బుక్కమ్మ తిప్పమ్మ నాగమ్మ ఓబమ్మ తిరుమలమ్మ చిన్నాదేవి వరదరాజమ్మ మొదలగు తుళువ రాణులందఱును నాంధ్రనారీమణులే. ఆద్యమునుండి తుళుభాషను వర్జించి తెనుగునే మాతృభాషగ స్వీకరించి తెనుగుకావ్యములను రచించి తెనుగుకవుల నాదరించి పోషించి యాంధ్రవాఙ్మయమును పెంపొందించిరి. నందిమల్లయ్య ఘంటసింగయల నీశ్వర నాయకుడు పోషించెను. నరసనాయకుడు వరాహపురాణమును వరలక్ష్మీకల్యాణము నరసింహవిజయములను కావ్యముల సంకితముగొనెను. ప్రోలుగంటి రంగన శివతాతకుమారుడును ద్విపదవారసింహపురాణము వచనబాలభారతము సౌభరిచరిత్ర జక్కులకథ మొదలగు గ్రంథములను రచించిన యష్టభాషాకవివర్యుడను చెన్నకవిని వీరనరసింహరాయ లగ్రహారములను వివిధార్థముల నిచ్చి సత్కరించెను. కృష్ణదేవరాయలు స్వయమాంధ్రకావ్యనిర్మాత. అష్టదిగ్గజములను సంరక్షించి వారి నుత్తమకావ్యరచనకు బురికొల్పెను. ఆంధ్రభోజు డని కీర్తిపడసెను. అచ్యుతరాయలు ఆంధ్రకవిజనకల్పభూజము. ప్రతివర్షమును నొక యుత్తమాంధ్రకావ్యమును రచియింపజేసి తన యిష్టదైవమగు శ్రీవేంకటాచలపతి కంకిత మిప్పించెడివాడు. ఇట్లు ఆంధ్రదేశమును స్వదేశముగను, నాంధ్రభాషను మాతృభాషగను స్వీకరించి, యాంధ్రరాజకుటుంబములతో తరతరములుగ సంబంధబాంధవ్యములను గల్గించుకొని, యాంధ్రస్త్రీల గర్భమున జనించి, యాంధ్రులతో గూడిమాడి జీవనముసల్పి, యాంధ్రమున గ్రంథరచన జేసి, యాంధ్రకవుల నాదరించి పోషించి యాంధ్రవాఙ్మయమును పెంపొందించిన తుళువరాజు లాంధ్రులుగాక యన్యులెట్లు కాగలరు ? కావున కృష్ణరాయ లాంధ్రుడనుట యొప్పును.





# నాటకసమయములు

●

శ్రీ దివాకర్ల వేంకటావధాని

ఏకళకైనను దాని యారంభకాలమునాటి కొన్ని పరిస్థితులనుబట్టి కొన్ని సమయము (Conventions) లేర్పడును. ఈ సమయము లన్నియు దత్కళోపాసకు లందఱిచేతను యథావిధిగా ననుసరింపబడు నని చెప్పలేము. స్వతంత్రులగు వారు వాని యుపయోగానుపయోగముల జర్చించి కావలసిన వాని నవలంబించి యక్కఱలేనివానిని బరిహరింతురు. నాటకకళవిషయమునగూడ నట్టి సమయములు కొన్ని కలవు. వీనిలో నైక్యత్రయమును, నంకసంఖ్యానియమమును, వర్జ్యవస్తునిర్దేశమును ముఖ్యము లైనవి. వీనివిషయమై అరిస్టాటలు తా నెఱిగిన గ్రీకునాటకముల బురస్కరించుకొని కొన్ని నియమముల నేర్పఱిచెను. తరువాతివారిలో గొందఱు వానిని యథాక్షరముగా బాటించిరి. కొంద ఱవి నిరుపయోగము లని తోచుటచేతను, దమ కాలమునకు సరిపడ వని యెంచుటచేతను స్వేచ్ఛగా బరిహరించి వైచిరి. అందుచే నీ నియమములు తాత్కాలికములును, నేకదేశమాత్రసేవితములు నని చెప్పనగును.

అరిస్టోటలు వస్తుకాలైక్యములను గూర్చి కొంత వివరించెనుగాని దేశైక్యమును గూర్చి యేమియు నుడివియుండలేదు. నాటకమున నొక్క దినములో జరిగిన కథావిషయముమాత్రమే ప్రపంచింపబడవలె నని యాతఁ డభిప్రాయపడెను. గ్రీకునాటకములలో 'కోరసు' ప్రధానస్థానము నాక్రమించుటయు, నది నాటకమున నించుమించుగా నాద్యంతము కానవచ్చుటయు నీనియమమునకు హేతువయ్యెను. అరిస్టోటలు తరువాత నీకాలైక్యమునుగూర్చి పెక్కు వాదోపవాదములు చెలరేగెను. నాటకవృత్తమునకు గొందఱు పండ్రెండుగంటల కాలమును, గొంద ఱిరువదినాలుగుగంటల కాలమును, గొందఱు రెండుమూడుదినముల కాలమును బ్రమాణముగా నుండవలె నని వాదించిరి. కొంద ఱతివాదులు నాటకకథాకాలమును, బ్రదర్శనకాలమును సమానముగానే యుండవలె నని యుద్దేశించిరి. ఈనియమము సమంజసముగానే యున్నను నాటకమున ననుసరించుటమాత్రము దుర్లభము. ఏలయన, మూడుగంటలలో జరిగిన విషయ మేదియైనను స్వల్పక్రియాక మగుటచే నాటకరక్తికి బోషకము కానేరదు. పాశ్చాత్యనాటకకవులలో నగ్రగణ్యుడగు షేక్స్పియ రీ నైక్యము విషయమున మిక్కిలి స్వాతంత్ర్యము వహించెను. విషాదాంతనాటకములలో నాతడు నాటకక్రియాగమనవేగముచే గాలదైర్ఘ్యమును గొంత మాటుపఱుప యత్నించినను దన యితరనాటకములలో నీనైక్యమునకు జాల భిన్నముగ వర్తించెను. Winter's Tale లో నాటకకథాకాలము పదునాఱు

సంవత్సరములవఱకును వ్రాకినది. Tempest లో మూడునాలుగుగంటల యితివృత్తమే వర్ణింపబడుటచే సం దీమైక్యము బాగుగా బాటింపబడె ననుట నిజమే యైనను అది యాదృచ్ఛికమై యుండు ననుట కాత డితర నాటకములు పెక్కింటిలో దాని నతిక్రమిం చుటయే తార్కాణము. మిల్టను నాటకకథా కాలపరిమాణము ప్రాచీననియమాదర్శముల ననుసరించి యిరువదినాలుగుగంటలకు లో బడియుండవలె నని నుడివెను.* అధునాతను లీ నియమము నతిక్రమించుటకంటె బాటిం చుటయే యధికము. ఆంగ్లేయులకంటె ఫ్రాన్సు దేశీయు లీ యైక్యములను బాటించుటలో మిక్కిలి శ్రద్ధ చూపిరి. అన లరిస్టాటలుగురు త్వమును ఫ్రాన్సువారివలె మఱి యెవ్వరును సూక్ష్మముగా ననుసరించియుండ లేదు. అందు చేతనే వారి నాటకములు వస్తువైచిత్రి లేక సరళములును, సామాన్యములు నై యుండును.

సంస్కృతలాక్షణికులు మొత్తము నాటకకథాకాలమునుగూర్చి యేమియు జెప్పకపోయినను అంక మేకదివసవృత్తమై యుండవలె ననియు, నంకమునకు నంక మునకు నడుమ నొక సంవత్సరమువఱకు వ్యవధి యుండవచ్చు ననియు, నొకవేళ బహుసంవత్సరముల వృత్తాంతము చెప్పవలసి వచ్చుచో విష్కంభాదులలో దాని నేకసంవ త్సరాపతితము గానే వర్ణింపవచ్చు ననియు నియమించిరి. పాశ్చాత్యుల నియమముకంటె వీరి నియమము కొంత సమంజసతరముగను, విశాలతరముగను గానవచ్చుచున్నది. అయి నను దీనిని బాటించినవారు పలువురు లేరు. భవభూతి మహావీరచరిత్రమునందును, రాజ శేఖరుడు బాలరామాయణమునందును నీ కాలనియమమును సంస్కృతలాక్షణికోక్తి కనుగుణముగానే పాటించిరి. కాని కాళి దాసును, దదితరులును దీని ననుసరించుటలో నంత శ్రద్ధ వహింపలేదు. శాకుంతలమున నాల్గే డంకముల నడుమ సుమారు పండ్రెండు వత్సరముల కాలము గడచెను. ఇట్లే యుత్తర రామచరిత్రమున దృతీయచతుర్థాంకముల నడుమ సుమారు పదిసంవత్సరముల కాలము గడచెను. అంక మేకదివసవృత్తమై యుండ వలె నను నియమముమాత్ర మొండు రెం డపవాదము లున్నను బలువురిచే బాటింప బడియున్నది.

ఇంక దేశైక్యమునుగూర్చి అరిస్టాట లేమియును వచించియుండలేదు. ఇది కాలై క్యముతో సన్నిహితసంబంధము కలది. నాటకకాలము సుమా రొక దినముగా నుండవలె నని యాతడు చెప్పినప్పుడు స్థలము కూడ నాదినములో బ్రయాణముచేయు టకు దగినదిగానే యుండవలె నని యాత డభిప్రాయపడియుండును. అట్లుగాక కాల మిరువదినాలుగుగంటలే యైనను స్థలము ఖండాంతరములవఱకు వ్రాకినచో నది మిక్కిలి యసందర్భముగా నుండును. పాశ్చాత్యనాటక కర్తలు కాలైక్యమునందువలెనే దేశైక్యము విషయమునగూడ నౌదాసీన్యము వహించిరి. షేక్స్పియరు తన నాటకములలో రంగము లను దన యిచ్చవచ్చినట్లు మార్చెను ఆ కాలపు నాటకరంగములలో రంగనేపథ్య మంత యధికముగ లేకుండుటచే నత డట్లు

* The circumscription of time, wherein the whole drama begins and ends is according to ancient rule and best example within the space of twenty four hours. Milton

మార్చుట కవకాశము కలిగెను. కాని యాతడీ రంగముల నెంత తక్కువగ మార్చెనో యాతని నాటకము లంత తీవ్రములును, గంభీరములును నై యున్నవి. ఒథెల్లో, హామ్లెటు మొదలగు నాటకము లిందుకు ప్రమాణము. ఆన్థోనీక్లియోపాట్రాలోని దౌర్బల్యమునకు ప్రధానకారణ మందలి రంగముల నవిశేషవైవిధ్యమే యని పెక్కురు విమర్శకులు నుడివియున్నారు. అధునాతనులు రంగములలో దగినంత 'సీనరీ' యుండుట చేతను, దానిని ప్రతిరంగముననంతరము తొలగించి నూతనమైనదానిని నెలకొల్పుట కష్టసాధ్య మగుటచేతను ఈ దేశైక్యమును బాటించుటయే తఱుచుగా గానబడుచున్నది.

సంస్కృతలాక్షణికులు దేశైక్యమును గూర్చి యెట్టి నియమములను గావించియుండ లేదు. వారి నాటకములలో రంగములు దేశాంతరములకే కాక లోకాంతరములకు గూడ బ్రాకుట కానవచ్చుచున్నది. ఉదాహరణమునకు శాకుంతలము నొక్కదానిని దీసికొన్న జాలును. అం దాఱంకములవఱకును మర్త్యము నాశ్రయించిన రంగ మేడవ యంకమున స్వర్గమును సమీపించినది.

మూడవదియగు వస్త్వైక్య మీ పై రెండింటికంటెను ముఖ్యమైనది. ఆధికారికమైన వస్తువు ప్రాసంగికవస్తుగౌరవముచే లఘూకరింపబడకుండ గవి మిక్కిలి జాగరూకత వహింపవలెను. లేనిచో ప్రధానవస్తువల్పమై నాటకముయొక్క రక్తికి భంగము కలిగించును. పాశ్చాత్యు లీ యైక్యము నాటకమున నపరిహార్య మని తలంచి దానిని గూర్చుటకై సర్వవిధముల యత్నించియుండిరి. కొంద ఱతివాదులు ఖేదమోదముల రెండింటి నొకే నాటకమున మిశ్రము చేయుట యీ యైక్యమునకు భంగకారి యని తలంచిరి. కాని జాన్సను మున్నగువారు లోకమున నిట్టి ఖేదమోదపరిమిళనము కానవచ్చుచుండుటచే నిది నాటకమునగూడ నవలంబనీయమే యని నిర్ణయించిరి. షేక్స్పియరు మొదలగు నాటకకర్తలు విషాదాంత నాటకములలో నెడనెడ మోదమయరంగములును, మోదాంతనాటకములలో విషాదమయరంగములును గలుగునట్లుగా గూర్చియుండిరి. ఈ రెండవ రకమునకు జెందిన వానికి వారు 'Tragi-comedies' అని నామకరణము కావించిరి. అసలు నాటకము ఖేదాంతమైనను మోదాంతమైనను అందలి వస్తువు సహజపరిణామము కల్గి యవాంతరవిషయవిచ్ఛిన్నము కాక నిర్వహణమువఱకు నొకదాని వెనుక నొకటిగా ననుసరించు నన్ని వేశములతో నొప్పియుండుట యవశ్యంభావ్యము. లేనిచో నాటకము వస్తువుయొక్క సాంద్రత్వమును గోల్పోయి యతుకులు పెట్టిన బహుసన్నివేశముల యాడంబరమై చైతన్యరాహిత్యముచే బరస్పరసంబంధము సడలిన కరచరణాద్యంగకముల కునికియైన కళేబరమువలె నీరస మగు ననుటకు సందేహము లేదు. అందుచేతనే యైక్యత్రితయమున దీని కావశ్యకమును బట్టి యగ్రస్థాన మీయబడినది.

సంస్కృతలాక్షణికులు నాటక మశుభాంతముగా ముగియుట కంగీకరింపలేదు కాని నాటకశరీరమున ఖేదమోదానుభవములు యథావకాశముగా వర్ణింపబడుట కెట్టి యాటంకమును సూచించియుండలేదు. సంస్కృతనాటకములలో బెక్కు మోదాం

తములయ్యు గరుణరసమునకు దా విచ్చినవే. ఆద్యంతము మోదోల్లాసపరీతములగు నాటకములు నొండురెండింటిని గూడ నెన్నుట కష్టము. ఇది యట్లుండ నాటకదేహమున కంగము లని చెప్పదగిన యంకములు పరస్పర సంబంధము కలిగి సహజవిస్తృతి గల కథా పరిణామముచే సంగిసౌందర్యమును బెంపొంద జేయవలె నని వీరును నొక్కిచెప్పిరి. మఱియు నాటకమున బ్రధానరస మొకటి మాత్రమే యుండవలె ననియు, దక్కిన రసములు తత్పోషకములై యంగములుగా నుండవలె ననియు బరస్పరవిరుద్ధములైన రసముల నొకే సన్నివేశమున బోషించుట కూడ దనియు వారు కావించిన నియమము లీ వస్త్వైక్యమునకు సంబంధించినవే. విష్కంభాదిసూచ్యవస్తుసూచకములు సైతము భిన్న భిన్నాంకములయందలి కథాభాగముల నైక్యము చేకూర్చుటకే యేర్పఱుపబడినవి.

పాశ్చాత్యుల పంచకార్యావస్థలకును, సంస్కృతలాక్షణికులవైన దశప్రకృతులకును సన్నిహితసంబంధము కలదు. పాశ్చాత్య నాటకకర్త లీ యైదింటిని సాధారణముగా నైదంకములలో నిముడ్చుచుందురు. షేక్స్పియరునాటకము లన్నియు బంచాంకపరిమితములే. సంస్కృతలాక్షణికులును రూపకము లన్నింటిలో సమగ్రలక్షణములు గల నాటకమున నైదు మొదలు పదివఱకు నంకముల సంఖ్య పెరుగవచ్చు ననిరి. కాని యిచ్చట నైదుసంఖ్య నిరుతెగలవారును గనీసముగా గ్రహించుట యెన్నదగియున్నది. ఈ సంఖ్యానియమము గ్రీకులనుండియే మనము గ్రహించితిమో, లేక మననుండియే వారు గ్రహించిరో యెఱుగరాదు.

పాశ్చాత్యులలో నొక తెగవారు కొన్ని విషయములను రంగముమీద బ్రత్యక్షముగా బ్రదర్శింపరాదని నిషేధించిరి. "Let not media murder her sons in public" అని హొరేసును, "Care should be taken to put nothing on the stage which can not be performed easily and with decorum" అని డిలాపైలీయును నుడివిరి. డ్రైడెనుసయితము దారుణ్యపూర్ణములును, ఉద్వేగకారులును, దుష్ప్రదర్శ్యములు నగు విషయములను రంగముమీద బ్రదర్శింపక పాత్రల సంభాషణముద్వారా వెలువరింపవలెను; లేదా పరిహరింపవలె నని చెప్పియుండెను. ఈ నియమమ్ము నీరసములు, ఉద్వేగకరములు, అనుచితములు నైన విషయములను రంగముపై బ్రదర్శింపక సూచ్యమాత్రములు కావింపవలె నని సంస్కృత లాక్షణికులు కావించిన నియమమునకనుగుణముగా నున్నది. కాని పాశ్చాత్యనాటక కర్తలు పెక్కురును, ముఖ్యముగా షేక్స్పియరును నీ నియమమును బాటించియుండలేదు. షేక్స్పియరు తన నాటకములలో వధలను యథేచ్ఛముగా బ్రదర్శించెను. సంస్కృత నాటకకర్త లీ విషయమున గొంత యధికమైన శ్రద్ధ వహించిరి. కాని నాగానందము, ఊరుభంగము మున్నగువానిలో మరణము ప్రదర్శితమగుట సుప్రసిద్ధమే. మొత్తముమీద నీ నాటకసమయములన్నియు నాయాకాలములందలి రంగపరికరాదులను బట్టి యేర్పడిన వగుటచే దరువాతికవులు యథావకాశముగా గొన్నిటి నవలంబించిరి; కొన్నిటిని బరిహరించిరి.

# వ్యవహారదర్శనము

[రూపకము]

●

శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి

[న్యాయశాలలో కరణికుడు (సమాస్తా)]

కరణికుడు—ఈరోజున గల అభియోగములన్నిటిని మనుధర్మశాస్త్రము ననుసరించి నిర్ణయింపవలె నని ప్రభుత్వ మాజ్ఞ నిచ్చినది. కావున అట్లే జరుగును.

మాశబ్దికుడు *—ధర్మస్థులు (జడ్జీ) విచ్చేయుచున్నారు. శబ్దము చేయవలదు.

(సంభీతాంగుడై ధర్మస్థుడు ప్రవేశించును)

ధర్మ—లోకపాలకులకును, సభకును నా నమస్కారములు. నే నీదినమున సభ్యసహాయుడనై మనుధర్మశాస్త్రము ననుసరించి వ్యవహారదర్శనము చేయవలయును. కరణికా, సభ్యులు ముగ్గురును ఉపస్థితులై యుండిరా?

కర—ఆ, ఇక్కడనే యున్నారు. ఒక క్షత్రియుడును, ఇద్దరు బ్రాహ్మణేతరులును.

ధర్మ—ఏమి? బ్రాహ్మణులు దొరకలేదా?

కర—బ్రాహ్మణులు లేకేమి? జాతిమాత్రోపజీవు లెందరో కలరు. ఈకాలములో బ్రాహ్మణులు తరతరములనుండి ఇంటవచ్చుచున్న దేవభాషను విడచి హూణభాషనుమాత్రమే అభ్యసించుచున్నారు. కొందరు బ్రాహ్మణేతరులు తమ కిదివరలో నిషిద్ధములైయున్న వేదశాస్త్రములలో నేమి కలదో అని కుతూహలము కలిగి సంస్కృతము నభ్యసించుచున్నారు.

ధర్మ—వ్యవహారదర్శనమునందు బ్రాహ్మణునకే అధికారమునంతయు మనువు ఇచ్చియుండెనుకాని ఒకచోట ఆ స్మర్త ఇట్లు చెప్పియున్నాడు. "వృషోహి భగవాన్ ధర్మః, తస్య యః కురుతే హ్యలమ్-వృషలం తం విదు ర్దేవాః, తస్మాద్ ధర్మం న లోపయేత్"—కామములను వర్షించునట్టిది వృషము. అట్టి వృషశబ్దముచే ధర్మము చెప్పబడుచున్నది. అట్టి వృషమును ఎవడు వారించునో వాడే వృషలుడు (శూద్రుడు) అని దేవతలచే చెప్పబడుచున్నాడుగాని, జాతిచే వృషలుడు వృషలుడు కాడు. కావున నీవు చేసిన పని సమంజసముగా నున్నది. సభ్యులారా, ధర్మాసనముల నధిష్ఠింపుడు. మీసహాయకముచే నే నీదినమున ధర్మమును నిరూపింపవలెను.

సభ్యులు—చిత్తము. (ధర్మాసనముల నధిష్ఠింతురు)

ధర్మ—ఈరోజున గల వివాదము లేవి?

కర—డిత్థ డవిత్థుల కొక వివాద మున్నది.

ధర్మ—ఏదీ, వారిని పిలువుము.... డిత్థా, ఏమి నీ అభియోగము?

డిత్థ—అయ్యా, నేను వాదిని. డవిత్థునకు అప్పు నిచ్చితిని. అత డెన్నిసార్లడిగినను ఇదిగో అదిగో నని కాలయాపన చేయుటయేగాని ఈయకున్నాడు. తమ సహాయకముచే వానినుండి ధనమును గ్రహించుట నా అభియోగము.

ధర్మ—డవిత్థా, నీ ప్రతివాద మేమి?

డవిత్థ—ధనమును నేను వానివద్ద తీసికొనలేదు. నే నొకరికై డిత్థునికొద్ద పూటపడితిని. అది యును దర్శనప్రాతిభావ్యమే. అధమర్ణుని చూపింతు ననియే నేను పూటపడినది. ఆ ఋణము తీరిపోయినది. ఇప్పు

---

* "మా శబ్దం కురు - శబ్దము చేయవలదు" అని అరచువాడు.

డన్యాయముగ తీరిన ఋణమునకై దర్శనప్రతిభువుని ఈ డిక్షు డభియోగింపుచున్నాడు.

ధర్మ—సరి. మీరు న్యాయవిదుల (న్యాయవాదులు) నెవరినైన నియోగించియుంటిరా? న్యాయవిదులను నియోగించువిషయమై మనువు ప్రత్యేకముగ చెప్పియుండనప్పటికిని, అతి గహనమైన ధర్మశాస్త్రము అందరికు వశమైయుండదు. మనువుకాలము నందుకూడ న్యాయవిదులు కార్యిణులచే (parties) నియుక్తు లగుచుండిరని నా నమ్మకము.

౧ న్యాయ—నేను వాదిచే నియోగింపబడితిని. నారదస్మృతివ్యాఖ్యానములో గాథ యొకటి కలదు. ఒక న్యాయవిదుని మాటలను నమ్మి ఒకడు తన ముత్తాత చేసిన అప్పు తీర్పనక్కరలేదని మొండికివేసి కూర్చొనెను. ఉత్తమర్ణుడు చేయునది లేక అభియోగమును తెచ్చెను. ప్రతివాదిపక్షమున ఆ న్యాయవిదుడు దర్శనము (appearance) నిచ్చి, 'అయ్యా, నాలుగవ తరమునుండి అప్పుతీర్పు బాధ్యత యుండదని నారదుడు చెప్పెను. కావున నా నియోక్త ఈయ నక్కరలేదు' అని చెప్పెను. వాని అజ్ఞానమునకు ధర్మస్థుడు నవ్వి, 'అప్పుతీసికొనినవానిని విడచి నాలుగు తరములకు లెక్కకట్టవలెను. మునిమనుమడు అప్పుతీర్చవలసినదే' అని నిర్ణయము నిచ్చెనని గాథ. కావున మాకును న్యాయశాలలలో స్థానము కలదు.

౨ న్యాయ—నేను ప్రతివాదిచే నియోగింపబడితిని. నామిత్రము చెప్పినదియేగాక, శుక్రనీతిసారములో నియుక్తన కీయదగు భృతి, అత డన్యాయముగ ప్రవర్తించినచో, వాని కీయదగు దండము వీనినిగురించి వ్రాసిరి.

ధర్మ—దండమునకేమి, ధర్మశీలముగ ప్రవర్తింపని ధర్మస్థునకే దండము ధర్మశాస్త్రములో చెప్పబడినది.

న్యాయవిదులిద్దరును—(కంఠస్వరమును మార్చి ఒక్కమారుగ) ఎంతమాట, ధరస్థునకే దండమా!

ధర్మ—దండమునకు అందరును సమానమే. అది యుండుటవల్లనే ప్రపంచము నడచుచున్నది. మనువు చెప్పలేదా—'దండః శాస్తి ప్రజాస్సర్వా దండ ఏవాభిరక్షతి, దండ స్సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదు ర్బుధాః' ప్రజలను దండమే శాసించుచున్నది. అదియే వారిని రక్షించుచున్నది. అందరును నిదురించుచున్నను దండము మేల్కొని కావలి కాచుచున్నది. కావున ధర్మమే దండమని పెద్దలు చెప్పుచున్నారు—ఇక, అప్రస్తుతమును విడచి, ప్రకృతము ననుసరింతము. వాది సాక్ష్యమును పెట్టుడు.

౧ న్యాయ—వాదీ, ముందునకు రమ్ము. శపథము చేయుము.

కర—నేను చెప్పినట్లు చెప్పుము—"ఆత్మైవ హ్యాత్మనః సాక్షీ గతి రాత్మా తథాత్మనః, మావమంస్థాః స్వ మాత్మానం నృణాం సాక్షిణముత్తమమ్" ఆత్మకు ఆత్మయే సాక్షి, ఆత్మకు ఆత్మయే గతి. కనుక మానవులలో ఉత్తమసాక్షియైన ఆత్మను (అసత్యమాడి) అవమానింపకుము! నీవు బ్రాహ్మణుడవా?

వాది—ఔను.

ధర్మ—అట్లైన 'బ్రూహి-చెప్పుము' అని శపథము చేయించిన చాలును. బ్రాహ్మణేతరుడైనచో సర్వపాతకములచే శపథము చేయింపవలెను.

౧ న్యాయ—నీకీ ప్రతివాది ఋణపడియున్నాడా?

వాది—ఆ!

౧ న్యాయ—ఎంత మొత్తమునకు?

వాది—వేయి కార్షాపణములకు.

౧ న్యాయ—అతడు ఋణము నెందులకు గైకొనెను?

వాది—అతడు వివాహమాడదలచి శుల్క మిచ్చుటకై తనయొద్ద ధనము లేదని వచ్చుడుగగా నేను ఋణము నిచ్చితిని. వానికి చేతిలోని ధనము నిచ్చి ఈబాధను కొనితెచ్చుకొంటిని.

ధర్మ—ఈమాటల కేమిగాని—ఇక వాని ననుయోజింపుడు, ప్రతిప్రశ్నింపుడు.

౨ న్యాయ—ఋణము నిచ్చినపుడు కరణమును (పత్రమును) వ్రాయించుకొనియుంటివా?

వాది—లేదు.

౨ న్యాయ—ఎందులకు వ్రాయించుకొనలేదు?

వాది—నమ్మకముచే వ్రాయించుకొనలేదు.

౨ న్యాయ—కరణమును వ్రాయించుకొనకుండ నీ వెవరికైన అప్పుపెట్టితివా? లోకులకు అప్పుపెట్టు టయేగదా నీవృత్తి?

వాది—వీనికితప్ప నే నెవరికిని పెట్టలేదు.

౨ న్యాయ—వీనికికూడ నీ విదివరలో కరణ మును వ్రాయించుకొనియే ఋణము నిచ్చితివి.

వాది—లేదు.

౨ న్యాయ—ఈ పత్రములను చూడుము. (అని కాగితములను తీయబోగా—)

వాది—ఔను. కాగితమును వ్రాయించుకొ నియే యిచ్చినట్లు జ్ఞాపకము వచ్చుచున్నది.

౨ న్యాయ—మరి, పూర్వాపరములలోగూడ కాగితమును వ్రాయించుకొనియే నీవు ప్రతివాదికి ఋణము నిచ్చియుంటివి. నీవు ఒప్పెదవా, కరణము లను చూపించమనిరెదవా?

వాది—అట్లే కావచ్చును.

౨ న్యాయ—మరి, అభియోగగ్రస్తమైనదానికి కరణ మెందులకు వ్రాయించుకొనలేదు?

వాది—(మాట్లాడక నేలచూపులు చూచుచుం డును)

౨ న్యాయ—(ధర్మస్థునితో) 'బాహ్యైర్విభా వయే ల్లింగై ర్భావ మంతర్గతం నృణాం, స్వర వర్ణేంగి తాకారై శ్చక్షుషా చేష్టితేనచ' స్వరము, వర్ణము, ఇంగితము, ఆకారము, చక్షుస్సు, చేష్టితము ఇత్యాది బాహ్యలింగములచే సాక్షుల అంతర్గతాభిప్రాయమును గుర్తెరుగవలెనని మనువు చెప్పెను. తమరు చిత్తగింప వలెనని నా ప్రార్థనము.

ధర్మ—ఔను, చూచుచునేయుంటిని.

౨ న్యాయ—మరి, నీవు బ్రాహ్మణుడవు-యజన యాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహములను విడచి వార్ధుషికుడవై యుండదగునా?

ధర్మ—ఈ ప్రశ్న మప్రస్తుతము. ఆపద్ధర్మముగ నేదియైన చేయవచ్చును. జీవనముకొరకే తడు వార్ధుషి కుడై యుండగూడదా? వామదేవుడు, భరద్వాజుడు మొదలైనవారే ప్రాణములను నిలుపుకొనుటకు నిషిద్ధా న్నములను భుజించిరని మనువు చెప్పినపుడు వీని మాట ఏమి?

౨ న్యాయ—అట్లైన నే నావిషయమును విడ చెదను. ఇట్లు చూడుము, శుల్కము నిచ్చి కన్యను గొనుట స్మృతినిషిద్ధము.

౧ న్యాయ—అది వాని కేమి తెలియును? శుల్కము నిషిద్ధమే నని నే నంగీకరింతును. కాని అది దండ్యమైన అపరాధముగ చెప్పబడలేదు.

ధర్మ—అనగా, శుల్కము నింద్యము; దండ్యము గాదు. దానియందు మన కధికారము లేదు.

౨ న్యాయ—సరి, కానిండు. వాదీ, ఇటు చూ డుము. నీవు ప్రతివాదికి ఋణము నిచ్చినపుడు ప్రతి వాదికుమారు డింట నుండెనా?

వాది—లేదు. అపు డాత డింట లేడు.

౨ న్యాయ—అనగా అప్పటికి ప్రతివాదికి భార్యాపుత్రులు కలరు.

వాది—వాని కెవరు కలరో నాకేమి తెలియును?

౨ న్యాయ—నీ వీతనికి ఋణము నిచ్చితి వని చెప్పిన దినముననే దేవదత్తునికి వేయి కార్షాపణముల ఋణము నిచ్చి, వీనిచే దర్శనప్రాతిభావ్యమును వ్రాయించుకొనియుంటివి.

వాది—ఔను.

౨ న్యాయ—ఆ తరువాత దేవదత్తునిపైనను, ఈ ప్రతివాదిపైనను ఈ మొత్తమునకై అభియోగము తెచ్చితివి. దానిలో ఈ ప్రతివాదిని విడచి దేవదత్తు నిపై ఋణప్రత్యుద్ధరణమునందు ఆ ధర్మస్థుడు నీ కధికారము నిచ్చెను.

వాది—ఔను.

౨ న్యాయ—ఆ అభియోగములో ఈ ప్రతివా దిపై ఓడిపోవుటచే ఇపు డీయభియోగమును మరల తెచ్చితివి.

వాది—ఆ అభియోగములో ఈ ప్రతివాదిని విడుచుట అన్యాయము. దేవదత్తునివలన నాకు ఋణ మంతయు తిరిగి రాదు.

౨ న్యాయ—నీవు చెప్పినది నిజము కావచ్చును. మరి నేను చెప్పినదిగూడ నిజమేగదా?

వాది—ఔను.

౨ న్యాయ—(ధర్మస్థునితో)అయ్యా, తీర్మాన మైన విషయముపై మరల అభియోగము నిషిద్ధము. ఇది 'తీరిత' మైన వ్యవహారము. అనగా ఇప్పటి కాలములో **res judicata** అని చెప్పుచున్నారు. "తీరితం చాను శిష్టంచ యత్ర క్వచన యద్భవేత్' కృతం తద్ధర్మతో విద్యాన్న తద్భూయో నివర్తయేత్"—తీరితమై అను శిష్టమైన వ్యవహారమును తిరుగతోడవలదని మనువు శాసించెను.

ధర్మ—ఔను, పురా తీరితమైన వ్యవహారమును మరల విచారింపకూడదనియే ధర్మము. ఇంకను మీకు సాక్షులు గలరా?

౧ న్యాయ—వాదిపక్షమున ఒక స్త్రీయును, ఒక నట్టువవాడును సాక్ష్యము గలరు.

ధర్మ—స్త్రీసాక్ష్య మెందులకు, 'స్త్రీబుద్ధేరస్థిరత్వాత్'—స్థిరబుద్ధిలేనివారు గనుక స్త్రీలను సాక్షులుగ గైకొనరాదని మనువు.

౧ న్యాయ—ఏమి, స్త్రీలు గర్హింప దగినవారేనా?

ధర్మ—నా అభిప్రాయ మదిగాదు. మనువుయొక్క అభిప్రాయము గూడ అదిగాదు. 'గృహాదీప్తయః'— ఇంటికి వెలుగని స్త్రీలను వర్ణించిన మనువు వారిని గర్హించెనని తలచుట వివేకముగాదు. "ఏకో లుబ్ధస్తుసాక్షీ స్యాత్" ఒక్కనిని లోభము లేనివానిని సాక్ష్యము తెచ్చుకొనమని చెప్పెను. స్త్రీలు మనువు ఉద్దేశములో చపలబుద్ధి గలవారు. కావున స్త్రీలను సాక్ష్యమునకు తెచ్చుకొనినచో వానికే ముప్పు. అవసరమైన తావులందు స్త్రీలయొక్క సాక్ష్యమును గ్రహింపవలయునని మనువుకూడ చెప్పెను.

౧ న్యాయ—స్త్రీని విడచిన, మరియొక సాక్షి గలడు. అతడు నాటకము లాడెడువాడు.

౨ న్యాయ—'న కారుకుశీలవౌ' నట్టువవాండ్ర నుగూడ విడువమని మనువు చెప్పెను.

ధర్మ—ఔను, కుశీలవులుగూడ పనికిరారనియే మనువు చెప్పెను. దాని యర్థ మేమనగా అట్టివారు ధనలుబ్ధులై యుండుట ప్రాయికము. కావున ఇదివఱలో పెట్టిన సాక్ష్యమునకంటె ఇట్టి సాక్ష్యము ఎక్కువ విశ్వాస్యముగ నుండదు. ఎక్కువ విశ్వాస్యముగ నుండని సాక్ష్యమును పెట్టి ఏమి లాభమని మనువు. కావున మీ చిత్తము. మీరు వారిని విచారింపదలచిన నా ఆక్షేప మేమియు నుండదు.

౧ న్యాయ—వృథా కాలహరణ మెందులకు? నాకిక సాక్షులు లేరు.

(ధర్మస్థుడు సభ్యులతో వ్యవహారమును చర్చించి—)

ధర్మ—ఈ వ్యవహార మిదివరకు 'తీరిత' మైనదని వాదియే తన సాక్ష్యములో ఒప్పుకొనియున్నందున, నాచే ప్రతివాది పిలువబడకుండగనే ఈ అభియోగము నిరస్త మగుచున్నది. తీరితమైనదను ఒక్క విషయముపైననే ఈ అభియోగము నిర్ణయింపబడినది గాన మిగిలిన విషయములను నిర్ణయింపనక్కఱలేదు.

వాది—(వెడలిపోవుచు)నా పాలిట యమునివలె ఈ ధర్మస్థుడు నాకు సంప్రాప్త మయ్యెను. ప్రతి ధర్మస్థునకు కొన్ని నెలల జీతమును ఇవ్వకుండినగాని డబ్బు పోయిన బాధ వారికి తెలియదు.

౨ న్యాయ—ఈవాది ధర్మస్థుని అధిక్షేపించుచున్నాడు. అందుకై వానిని దండింపవలయునని నేను ప్రతిపాదించుచున్నాను.

ధర్మ—దండించుటకు నాకు శక్తి కలదుగాని, అతడు ఓడిపోయి మనసునకు కష్టముదగిలి నన్ను నిందించుచున్నాడు. 'క్షంతవ్యం ప్రభుణా నిత్యం క్షిపతాం కార్యిణాం నృణాం' ఓడిపోయిన కార్యిణులు తన్నొకవేళ తిట్టినను ఓర్చియుండవలె నని మనువు చెప్పెను. అంతియే కాదు. "యః క్షిప్తో మర్షయ త్యార్తైస్తేన స్వర్గే మహీయతే - యస్త్వైశ్వర్యాన్న క్షమతే నరకం తేన గచ్ఛతి" ఆర్తుడైన వాడు తన్నాక్షేపించినను సహించిన ధర్మస్థుడు స్వర్గలోకములో మన్నన లందును. సహింపక, అధికారగర్వముచే శిక్షించువాడు నరకము నొందు నని మనువు. కావున నే నీరోజున సహించి యూరకుందును.

---

# సీతబ్రతుకు

[పెద్దకథ]

శ్రీ వజ్ఝల రామనరసింహం

సీత తన తల్లికడుపులోంచి ఈ భూమిమీద పడిన వెంటనే తల్లి చనిపోయింది. "తల్లిగండాన పుట్టింది" అని, పసికందుగా వున్న సీతని అందరూ నానావిధాల తిట్టిపోశారు. సీతతండ్రి అయిన సోమనాథానికి—లేకలేక తనకు పిల్లపుట్టినందుకు సంతోషించాలో, లేక భార్యపోయినందుకు ఏడవాలో తెలియలేదు. కాని, అతడు ఒక రకమైన వేదాంతి. అంచాత, ఈప్రపంచకంలో తనకు ఏ కష్టాలు కలిగినా, 'ఆపద్బాంధవు'డైన ఆ శ్రీరామచంద్రుడి ఇచ్ఛయే కాని మరేమీ కాదని సరిపెట్టుకోగలిగేడు! అయినా, అతని మనస్సు వికల మవలేదని చెప్పలేం. అతని మనస్సును ఈ విషాదసంఘటన ఎంతవరకు కలచివైచిందో, అతని మనోభావా లేమిటో ఎవరికీ తెలియదు......

రోజులు గడుస్తున్నకొద్దీ, బంధువులందరూ సోమనాథాన్ని రెండవపెళ్లి చేసుకోమని అడుగుతున్నారు......కాని, వారికి అతడు ఎటువంటి జవాబును ఇయ్యలేదు. తన మనసు కుదుటపడేవరకూ తనకు రెండవపెళ్లిమీద వాంఛ వున్నదీ లేనిదీ కూడా తనే చెప్పలేడని అతనికి తెలుసును...........తను జీవితాంతం పెళ్లిచేసుకోకుండా వుండగలిగే ఏకపత్నీవ్రతుడనని చెప్పుకోవడం అతనికి ఇష్టంలేదు. తన వంటి అభాగ్యులలో, ఈ లోకంలో రెండు తెగలవారు వున్నారు. అందులో మొదటివారు—పెళ్లాంపోయిన పది రోజుల్లోగానే చింతపిక్కలాంటి పిల్లను పెళ్లిచేసుకొని, సంసారంలోకి దిగబడి, మొదటిపెళ్లాన్ని పూర్తిగా మరిచిపోతారు. ఇంక రెండవతెగవారు—వీరికి చాలాకాలంవరకు దుఃఖం తీరదు...పూర్వపు సంసారసౌఖ్యాల్ని తల్చుకుని దుఃఖిస్తూవుంటారు. కాని, కొంతకాలానికైనా, వారిని కామం జయిస్తుంది......ఈ వేదాంతాన్ని సోమనాథం రోజూ చర్చించుకొంటున్నాడు...ఇప్పుడు అతని బుర్రను పాడుచేస్తున్నవి 'స్త్రీ స్వాతంత్ర్యం', 'ఏకపత్నీవ్రతం' మొదలైన ఆలోచనలు............

.........సీతకి నాలుగునెల్లు నిండేయి. ఒక నాడు వెన్నెట్లో, సోమనాథం మంచంవేసుకుని, సీతను పడుకోబెట్టుకున్నాడు...వెన్నెట్లో, పిల్ల పాడుగాటి బంగరు బొమ్మలా మెరుస్తూవున్నది. ఆమె కళ్లు నక్షత్రాలతో ఆడుకుంటూవున్నవి...అచ్చంగా ఆమెది తల్లి పోలికే! సోమనాథం పెళ్లాం పేరు సీత! ఆమెకూడ పొడుగాటి గంభీరమైన విగ్రహం. ఇంట్లో దేవతవలె సంచరించేది. సోమనాథం ఒకొక్కమారు ఆమెతో, "సీతా! నా కళ్లకి నువ్వింకా చంటిపిల్లలాగే కన్పిస్తున్నావు!" అనేవాడు. ఆమెకంఠస్వరం చంటిపిల్లల కంఠస్వరంవలె వుండేది......సోమనాథం చంటిదాని కళ్లల్లోకి చూస్తూ, "ఈమె ముమ్మూర్తులా తల్లి పోలికే" అనుకున్నాడు......పిల్ల ఎందుకో ఏడిచింది...సోమనాథం ఆమెను తన హృదయానికి దగ్గరగా తీసుకుంటూ, "నా చిట్టి సీతా!..."అన్నాడు. ఆనాటినుంచీ పిల్ల పేరు "సీత" అయిపోయింది.

సోమనాథానికి ఇంట్లో ఎవరూ లేరు. కాని, ఆ పల్లెటూరిలో పాలతల్లులకీ, సహాయం చేసేవారికీ,

పాలు పెరుగులకూ ఇంతవరకూ కరువూ రాలేదు, రేషనింగూ రాలేదు. అంచాత అట్టే ఇబ్బంది లేకుండానే రోజులు గడుస్తున్నాయి.

సీత భవిష్యత్తు గురించి సోమనాథానికి అనేక వూహాలు కలిగాయి...ఆమె తనకు దైవం ప్రసాదించిన ఒక్కగాక ఒక్క బిడ్డ! ఆమెను ఎంతో ఆప్యాయంగా పెంచుకోవాలి. చదువు చెప్పించాలి. పెళ్లిచేయాలి... ఇంకా ఎన్నో...ఎన్నో...! ఈ విధంగా ఆమెకు వృద్ధాప్యం వచ్చేవరకూ ఆమెయొక్క జీవితాన్ని రోజా చిత్రించుకొనేవాడు సోమనాథం...

కాని, వేదాంతి అయిన సోమనాథం తను ఈ ప్రపంచకంలో ఎన్నాళ్లు వుంటాడో అనే విషయాన్ని ఎప్పుడూ వూహించుకోలేదు. సీతకి ఎనిమిదో నెల వచ్చే సరికి, ఓనాడు సోమనాథం పక్షవాతంతో మంచం మీద పడివున్నాడు. ఆనాళ్లా సీతని ఆడిస్తూ పాల తల్లి అతని మంచముపక్కనే కూచుంది. కన్ను రెప్ప వేయకుండా సీతని చూస్తున్నాడు సోమనాథం! రాత్రిళ్లుకూడా పాలతల్లి ఇంట్లోనే పడుకొంటు న్నాది. ఆమె ఒక శూద్ర యువతి.

మర్నాడు ఉదయమే, చీకటితో, పాలతల్లి లేచి, సీతకి పాలుపట్టి, ఇంకా నిద్రపోతూ వున్న సోమనాథం పక్కమీద రోజూవలెనే పడుకోబెట్టి, ఇంటిపని చేసుకోడానికి పెరట్లోకి పోయింది. పొరుగింటి ముసలమ్మగారు వంటింట్లో కాఫీ చేస్తున్నారు......

ఎనిమిది గంట లవుతూవుండగా, పాలతల్లి సోమనాథం గదిలోకి వచ్చింది. అత డింకా నిద్రపోతూనే ఉన్నట్లున్నాడు.

“బాబుగారూ, లేవండింక” అంది పాలతల్లి. కాని, అతడు చలనం లేకుండా మ్రోడువలె పడివున్నాడు. భయంకరంగా కనిపిస్తూ, తెరుచుకుపోయి వున్న అతని కళ్లని చూస్తే, పాలతల్లికి ఎందుకో భయం వేసింది. ఆమె గజగజా వణికింది...సీతమాత్రం అమాయకంగా తనతండ్రిగుండెలమీద తన రెండు లేత చేతులనూ వుంచి, నవ్వుకుంటూ ఆడుకుంటున్నాది...!...

పాలతల్లి సీతని గభాలున మంచంమీంచి లాగేసి, ముసలమ్మగారి కో కేక పెట్టింది.

సోమనాథం కిందటిరాత్రే ఈ లోకాన్ని విడిచి పెట్టి వెళ్లిపోయాడని అందరూ గ్రహించడానికి అట్టే సేపు పట్టలేదు......బంధువులందరికీ—ఎవరిచ్చారో కాని—టెలిగ్రాములు శరవేగంతో వెళ్లేయి. బంధువులందరూ కుటుంబాలతో సహా వచ్చారు. కాని, ఆ యింట్లో పరామర్శించడానికి చంటి సీత తప్పితే మరెవరూ కన్పించడంలేదు వారికి.

రెండురోజుల్లోగానే ఆ గృహంలోని ఇద్దరు ఆదర్శ దంపతులయొక్క జీవితచరిత్రలు కడిగివేయబడినయ్! ఇంక మిగిలినది—వారి ప్రేమఫలితమైన సీత మాత్రమే.

సీత భవిష్యత్తుగురించీ, ఆమెను పెంచడం విషయమై బంధువులందరూ రెండు రోజులు హోరాహోరీగా పోట్లాడుకున్నారు. ఈ విషమసమస్య ఏమీ అర్థం కాని సీతమాత్రం నిష్పూచీగా, ఏమీ జరగనట్టే కనిపిస్తున్నాది...కొసకి ఎలాగైతేనేమి, బంధువులందరూ ఒక నిర్ణయానికి వచ్చారు. సీతకి దూరపు బంధువు-వరసకి మేనమామ - కాస్తో కూస్తో వున్నవాడు - పట్నవాస్తవ్యుడూ అయిన శివయ్యగారు సీతని పెంచాలని ఏకగ్రీవంగా నిశ్చయింపబడి ఆమోదించ బడ్డది.

మర్నాడు యింటికి తాళాలు వేయబడ్డాయి... సామానులతో సహా సీతని పట్నంలోవున్న శివయ్యగారి పీకలమీదికి వదిలివేసి బంధువులందరూ చేతులు దులుపుకున్నారు................

శివయ్యగారు తమ యింటికి కొత్తగా వచ్చిన ఈ బాల అతిథినిగూర్చి ఏమీ చికాకూ పడలేదు, సంతోషించనూ లేదు. తన యింటిలో ఎవ రున్నదీ, ఎంద రున్నదీ, ఎందు కున్నదీ. ఆయనకి తెలియదు; తెలియ నవసరంలేదు కూడా. ఎందుకంటే, ఆయన తన ఇంటి యొక్క సర్వహక్కులనూ తన ధర్మపత్ని అయిన కనకమ్మగారికి వదిలిపెట్టేశాడు. కనకమ్మగారు ఈ 'ఆల్ రైట్సు'ను 'రిజర్వ్' చేసుకొని, ఇంటి వ్యవహారమంతటినీ

తనే స్వయంగా నడుపుకుంటున్నాడి. అంచాత శివయ్య గారికి తన ఆఫీసుతప్పితే ఇంటిపూచీ ఏమీ లేదు... ఆయన ఏదో కంపెనీలో గుమస్తా...ఇంటిలో వున్నంతసేపూ ఆయన రమారమి కరక్కాయంత పొగాకు వుండను పదిలంగా బుగ్గకిందికి దోపి, ఆ మత్తులో తన తాతలకాలంనించీ వుంటూన్న ఒక బొక్క కుర్చీలో కూలబడి, ఈ ఐహిక ప్రపంచాన్నే మరచి, తనలో తనే ఏదో గొణుక్కుంటూ వుంటాడు... ఆయనకి ఇప్పుడు నలభయ్యో పడి ప్రవేశించింది. సంతానం నలుగురు. అందరూ ఆడ పిల్లలే. పెద్దపిల్ల అపరంజి - పదమూడేళ్లది. తరువాతిది తాయారు ఆరేళ్లది; మూడవ పిల్ల పూర్ణ, రమారమి మూడు సం.ల పిల్ల. ఆఖరుది, శాంత, సీతయీడుదే... కాని, పిల్లలను ఈ పేర్లతో పిలిచే అలవాటు కనకమ్మగారికి లేనే లేదు. ఆవిడ మొదటి ముగ్గురు పిల్లలను పెద్ద రాక్షసి, చిన్న రాక్షసి, చిట్టిరాక్షసి అని పిలుస్తుంది! ఆఖరుది మాత్రం ఇంకా 'చంటి'దే.

పిల్లలందరూ—పేరుకు తగ్గట్టుగా—గొల్లు చేస్తూ, రోజల్లా అల్లరిపెడతారు; కొట్టుకుంటారు; తిట్టుకుంటారు; లేదా, ఇల్లు పందిరివేస్తారు. చింపిరి జుత్తులతో మట్టిలో ఆడుకుంటారు. రాత్రి అయే సరికి, నేలమీద ఎవరికి తోచినట్లు వారు పడుక్కొని, గురకలుతీస్తారు.

కనకమ్మగారు ఒక్కొక్కప్పుడు పిల్లలని అతి గోముగా ముద్దుచేస్తుంది; మరొకప్పుడు—కోపం వచ్చినప్పుడు—పిల్లలందరికీ నడ్డిమీద వాలుగేసి చరుపులు చరిచి, "పొండిక, తోటలోకి!" అని ఇంట్లోంచి బైటకు తరిమివేస్తుంది. ఇల్లెప్పుడూ చిందరవందరగా అసహ్యంగానే వుంటుంది.

కనకమ్మగారి పిల్లలందరూ ఒకేతీరున వుంటారు. అందరివీ చీపికళ్లు. రాగిరోసాల్లాంటి జానెడు జుత్తును పిలకలవలె జడలు వేసుకుని పీక్కుంటారు.

అపరంజి అయిదవ క్లాసువరకూ చదివి, పెళ్లియీడు రావడంవల్ల చదువుమానేసింది. కాని, ఎవరైనా వచ్చినప్పుడు కనకమ్మగారుమాత్రం "మా అపరంజి రెండవ ఫారం పేసయింది" అని చెప్పుకుంటుంది. అయితే—అపరంజి ఇంతకంటే ఎక్కువే చెప్పుకుంటుంది...ఆమెకు ఇంగ్లీషు, తెలుగు భాషలు, ఛందస్సు, సైన్సు, వైద్యం, నక్షత్రశాస్త్రం, జాగ్రఫీ—ఒకటేమిటి—అన్నీ తెలుసునని చెప్పుకుంటుంది. ఆమెకు ఇవేవీ తెలియవని ఎవ్వరూ అనరాదు. అంటే, ఆమెతో ఎవరూ వాదించేబాధ పడలేరు......... తాయారు ప్రస్తుతం రెండవ క్లాసులో వుంది.

సీత ఆయింటికి వచ్చిననాడు పిల్లలు ముగ్గురూ సీతచుట్టూ మూగి వింతగా చూడ నారంభించారు. ఆతర్వాత ఒకరిమొగం వైపు మరొకరు చూసుకొని, గొల్లుమని నవ్వుకుంటూ బైటికి పోయారు. ఈ నవ్వుల అర్థం వారికి తెలియకపోవడం మాట అటుంచి, కనకమ్మగారికే తెలియదు. పెద్దదైన అపరంజికూడా—ఎప్పుడూ కాకపోయినా—తరుచుగానే, ఈ గొల్లు నవ్వులలో పాల్గొనడం కనకమ్మగారికి వింతకాదు.

ఓ నాడు పొరుగింటావిడతో కనకమ్మగారు అన్నది:

"మా యింటికొచ్చిన సీతాదేవిని చూశారాండీ, అక్కయ్యగారూ? సాక్షాత్తు ఆ సీతాదేవే! మొదట తల్లిని చంపుకున్నాది—ఆతర్వాత తండ్రిని చంపింది. మరోగతిలేక మాయింటికి వచ్చింది!"

కాని, కనకమ్మగారికి మాట్లాడుతూ యాక్షను కూడా చేయడం అలవాటు. అంచాత, ఈ మాటలు అంటూ ఆమె తన కొడవళ్లవంటి వేళ్లతో సీతరెండు బుగ్గలనూ పొడిచింది. సీత కెవ్వున ఏడ్వనారంభించింది. ఈమారు కనకమ్మగారు తనబుగ్గలునే నొక్కుకుంటూ అన్నది:

"చూశారాండీ అక్కగారూ? రోజూ ఇలానే ఏడుస్తుంది—ఎలా భరించడమోగాని—"

'అక్కయ్యగారు' స్వరం సకిలించినట్లుగా ఒక నవ్వునవ్వి వూరుకున్నారు మామూలుగానే!

............సీత వచ్చిన కొద్దిరోజులవరకూ కనకమ్మగారు సీతకు ఆవుపాలు పట్టేది. కాని, ఆ తర్వాత-ఆవుపాలు ఖరీదని వాడుకదానిని మాన్పిం

చేసింది. సీతకి మొదట్లో, గేదెపాలు తాగడంవల్ల శైత్యంచేసింది. కాని, క్రమేపీ అలవాటుపడిపోయింది. కనకమ్మగారు తన పిల్లలెవరికీ కూడా ఆవుపాలు పట్టడం ఎరగదు. అందరూ గేదెపాలే త్రాగేవారు. ఆరో నెల వచ్చిన వెంటనే ఆవిడ పిల్లలందరూ మన్ను తినడం నేర్చుకొనేవారు. తొమ్మిదవ నెల దాటకుండానే అన్నం తినేవారు.

"మా శాంత యిప్పుడు అర్ధపావువిశ్యంఅన్నం తింటున్నాది—ఎలా బతుకుతుందో ఏమిటో! ఈ యీడుకి మా అపరంజి రోజుకు నాలుగు మార్లు అన్నం తినేది" అంటూ వుంటుంది, కనకమ్మగారు అప్పుడప్పుడు.

కనకమ్మగారి పిల్లలందరూ ఇటువంటి మోటు వాతావరణంలోనే పెరిగారు. సీత కూడా ఈ మోటు తనానికి అలవాటుపడిపోయిందనే చెప్పాలి. కాని, చిన్నప్పటినుంచీ, ఆమెలో ఒక ప్రత్యేకత, నాజూకు దనం అందరికీ గోచరించేవి. "మిగతా పిల్లలవలె ఈమె తయారవదు" అని ఇరుగుపొరుగువారనుకొనేవారు. కనకమ్మగారు మాత్రం అప్పుడప్పుడు "ఇది పట్టి పల్లెటూరిపిల్ల" అంటూండేది, సీతని గురించి.

సీతకి మూడవఏడు వచ్చేసరికి మాటలు పూర్తిగా వచ్చేశాయి. పిల్లలు—అందులోనూ 'పల్లెటూరి పిల్లలు'—మూడవ ఏడుకే మాట్లాడడం కనకమ్మగారికి వింతగానే వుంది.

ఇప్పుడు సీత జీవితంలో ఒక సరికొత్త అధ్యాయం తెరువబడింది. ఆ యింటిలోని పరిస్థితులను కొంచెం కొంచెం అర్థం చేసుకుంటున్నాది. ఆమె ఎటువంటి వాతావరణంలో వున్నదీ ఆమెకు తెలిసీ తెలియని విధంగా బోధపడుతున్నాది. సీతకి ఇప్పుడు కొత్త కొత్త డ్యూటీలను కనకమ్మగారు నిర్ణయించారు... వుదయం లేచినవెంటనే సీత కాఫీపెట్టాలి. కాని, సీతకి కాఫీ తయారుచేయడంకంటె, కాఫీ తాగడమే బాగా తెలుసు. ఏమైనా, కొద్దిరోజుల అలవాటుతో, ఆమె ఈ 'కళ'ని అలవర్చుకో గలిగిందనే చెప్పాలి...

ఓనాడు సీత కాఫీ చేస్తూవుండగా, కాఫీ గుండ డబ్బా పడిపోయింది. గుండ అంతా కింద ఒలికి పోయింది. ఇది పెద్ద నేరాల్లో ఒకటని సీతకి తెలుసు! ఈ నేరానికి శిక్షకూడా ఆమె ఎరుగును! అందుచేత, ఎవరూ చూడకుండా, గుండని డబ్బాలోకి ఎత్తివేసి, నేలను తన గౌనుతో తుడిచివేసింది. కాని, కనకమ్మ గారి కళ్లుమాత్రం—ఎంత పాముకళ్లలా వున్నా—నిశిత దృష్టి గలవి గాబట్టి, ఈ 'కుట్ర'ని కనిపెట్టడానికి అట్టే కష్టం అవలేదు. తత్ఫలితంగా సీతకి ఆనాడు బాగా దెబ్బలు పడివాయ్. సీత ఏడుస్తూనే కాఫీ తయారు చేసి అందరికీ ఇచ్చింది.

రోజూ సాయంత్రం తాయారు, పూర్ణ, శాంత కలిసి పొరుగింటి పిల్లలతో ఆడుకుందుకి పోతారు. సీత ఇంట్లోనే వుంటుంది. ఆమె ఎక్కడికీ వెళ్లగూడదని ఆమెకు తెలుసు. ఇంటిపనులలో ఆమెసహాయం కన కమ్మగారికి ఎంతైనా అవసరం వుంది. అపరంజి వంటింటి చీడీలోకూచుని, సీతచేసే పనులలో తప్పులు లేకుండా పర్యవేక్షణ చేస్తూవుంటుంది.

...అపరంజికిప్పుడు పదిహేను ఏళ్ళు వచ్చినయ్. ఏడాదికిందటే పెద్దమనిషయింది కూడాను. అంచాత ఆమె పెళ్లిమాటలు చురుకుగా సాగుతున్నవి. ఈ విష యమై శివయ్యగారేమీ ప్రయత్నించక పోయినా, కనకమ్మగారి తెలివితేటలవల్ల త్వరలోనే ఒక మంచి సంబంధం కుదిరింది. ముహూర్తనిశ్చయంకూడా జరిగి పోయింది.

ఇంట్లో పెండ్లి ప్రయత్నాలు చాలాజోరుగా సాగుతున్నవి. కనకమ్మగారు రోజూ ఇల్లంతా హడా వుడిగా తిరిగేస్తున్నారు. ఇదంతా సీతకు ఒక వింతలా కన్పించింది. ఎల్లప్పుడూ 'యీడురో' మంటూన్న ఈ కొంపను శుభ్రపరిచి, అలంకరిస్తూ వుండడం ఆమెకు ఎంతో ఆనందదాయకంగా వుంది...ముహూర్తం రోజురోజుకీ దగ్గర పడుతున్నాది.

......పెళ్లినాటికి ఇల్లంతా బంధువులతో కిల కిలలాడుతున్నాది. అహోరాత్రాలూ బ్యాండుమేళాలు మ్రోగుతున్నాయి. సీతఆనందానికి మేరలేదు.

ఇదొక వింతపండుగులా వుంది. ప్రతీవారూ ఆనందంగానే కన్పిస్తున్నారు. అన్నిటి కంటె ముఖ్యమైన దేమిటంటే, సీత కిప్పుడు ఇంటిపనులేమీ తగల లేదు. ఆమెతో ఆడుకోడానికి కావలసినంతమంది పిల్లలు దొరికేరు. ఇంతకుముందు తనతో ఆడేవారు ఎవరూ లేరు. శాయూరు, పూర్ణ, శాంత తనతో ఆడేవారే కారు. వారు పొరుగింటికి పోయేవారు. తను ఇంటిపనులకోసం వుండిపోయేది...ఈ పెళ్లిలో ఎంత మంది పిల్లలు వచ్చారు! ఏ వూరినుంచి వచ్చారో! అందరూ మంచివారే...తనకి కావలసినన్ని లడ్డుండలు, అరటిపళ్ళు మొదలయిన తినుబండారాలన్నీ ఇప్పుడు దొరుకుతున్నై! ఈ పెళ్లి మరొక నెల్లాళ్లపాటు జరిగితే బావుండును.........

పెళ్లి మూడు రోజులూ సీతసంతోషానికి అంతు లేదు...ఏదో జెయిలులోంచి తనకు విడుదల దొరికినట్లుంది. విధీ, విరామం లేకుండా, రోజల్లా తనతోడి పిల్లలతో అల్లరిచేస్తూ ఆడుకోడానికి తనకి అవకాశం దొరికింది. పిల్లలందరిలోనూ, సీతతో కలిసి బాగా గొల్లు చేసేవారిలో ముఖ్యుడు రాజు! రాజుకి ఏవేవో తోచేవి కొన్ని వుంటాయి. రోజూ, సామానుకొట్లోకి వెళ్లి, మిఠాయిలు దొంగిలించి పిల్లలందరకూ పంచేవాడు. అందుచేత అతడు పిల్లలందరికీ ఏకైక నాయకుడుగా వుండేవాడు. ఒకొక్కప్పుడు బొమ్మలను తెచ్చేవాడు. మరోఅప్పుడు భయంకరమైన రాక్షసిబొమ్మ వేయబడ్డ అట్టను మొగానికి కట్టుకుని పిల్లలందర్నీ హడలగొట్టేవాడు! అతని జేబులో ఎల్లవేళలా కాణీలు, అర్ధణాలు గలగల మ్రోగేవి.

ఓనాడు రాజుతో సీత కయ్యమాడి, శివయ్యగారితో ఫిర్యాదు చేసింది, రాజు తనను కొట్టేడని.

"ఏమిటమ్మా అంటున్నావూ?" అన్నారు శివయ్యగారు. ఆయన అప్పుడే భోగాకు వేసుకోవడంచాత, సీత ఏడుస్తూ చెప్పేసంగతేమీ ఆయనకు ఎంతమాత్రమూ తలకెక్కిందికాదు.

"ఏమిటి తల్లీ నువ్వు అనేది?" అన్నారు శివయ్యగారు

కాని, యీ లోగా, రాజుకూడా తన తల్లిని వెంటబెట్టుకుని అక్కడకు వచ్చాడు. శివయ్యగారు ఆమెనుచూసి, "ఏమిటి శారదమ్మా! ఇలావచ్చావు?" అన్నారు.

"మా రాజుబాబు సీతకొట్టిందని నాతో ఫిర్యాదుచేసి, ఇక్కడకు లాక్కొచ్చాడు. వెధవ! ఎప్పుడూ ఫిర్యాదులే!"

"రాజే నన్ను కొట్టాడు మొదట" అంది సీత.

శారదమ్మగారు గట్టిగా నవ్వుతూ, రాజుని దగ్గరగా తీసుకుని అంది: "రాజా! సీత ఎవరనుకుంటున్నావ్? మీ సోమనాథం మామయ్య కూతురేనా నాయనా. నీకు పెళ్లాం అవుతుందికదా, అలా కొట్టవచ్చా?"

కాని, యీలోగానే పిల్లలిద్దరిమధ్యా సంధి కుదిరిపోవటంచాత ఇద్దరూకలిసి, పల్లకీవూరేగింపు చూడ్డానికి తుర్రున బైటికి పారిపోయారు. శివయ్యగారు కుర్చీలో వెనక్కిచేరబడి పొగాకుమత్తును అభినందిస్తున్నారు. ఆయన ఈ లోకాన్నే మరిచినట్లుంది. ఈ పరిస్థితిలో ఆయనతో మాటామంతీ ఆడటం కష్టమని శారదకు తెలుసు...ఆమె మెల్లిగా ఇంట్లోకి జారుకుంది!

పెళ్లి అయిపోయిన వారం రోజుల్లోగానే బంధువులందరూ వెళ్ళి పోయారు. రాజుకూడా వెళ్లిపోయాడు. ఇల్లంతా చిన్నబోయినట్లుంది. సీతకి ఒక్కమారు భోరున ఏడవాలనిపించింది. ఆమెతో ఆడ్డానికి ఇప్పుడెవరూ లేరు. తను మళ్లీ యింటి పనులు చేయటం ప్రారంభించాలని ఆమెకు తెలుసు. ఆ బాజాలు, ఆ వైభవం, అలికిడి, పిల్లలు, ఆటలు, ఇంకా ఆమెచెవుల్లో గింగురుమంటున్నయ్...అపరంజి కొద్దిరోజులవరకూ గదిలోంచి పైకివచ్చేది కాదు. కాని, ఆ తర్వాత ఆమె, వంటింటి పీఠీలో తన మామూలుస్థానాన్ని ఆక్రమించి, "సీతా! నీ కేదైనా పని చెయ్యడం తెలియకపోతే నన్నడిగి తెలుసుకో. అంతేకాని, చవటపెయ్యపనులు చేయకు" అంటూ,

తన పూర్వపు అధికారాన్ని తిరిగి దర్శించడం ప్రారంభించింది. సీత ప్రాణం వచ్చిపోయినట్లయింది.

ఓనాటి వుదయం: సీత కాఫీ పట్టుకెళ్లి శివయ్యగారి కిచ్చింది. అప్పుడే శివయ్యగారు ముఖం కడుక్కొని, వాలుకుర్చీలో వాలేరు. కాఫీ ఎవరో ఒకరు తెచ్చియిచ్చేవరకూ ఆయన అట్లానే వుంటాడు. ఇంట్లోకి వెళ్లి కాఫీ అడగడం ఆయనకు అలవాటు లేదు.

శివయ్యగారు కాఫీకప్పు అందుకుంటూ సీతవైపొకమారు చూశారు. ఆయన ఎందుకో కొంచెం ఆశ్చర్యపడ్డాడు. ఆయనజీవితంలో ఇంతవరకూ, తనకు రోజూ కాఫీయిచ్చే వ్యక్తి ఎవరో చూడ్డం అలవాటు లేదు. ఒకవేళ చూసినా కూడా, ఆయన పరధ్యాన్నంగానే వుంటాడు. కాని, యీనాడుమాత్రం ఆయన సీతను తేరిపారచూశాడు......సీత అప్పుడే స్నానంచేసి, కడిగిన ముత్యంలా వుంది. తన పిల్లలు కాని, యిల్లుకాని ఇంత పరిశుభ్రంగా వుండడం శివయ్యగారు ఎరగని విషయం. ఇంటిపనులు చేస్తూండడంవల్ల సీత ఆరోగ్యంగా, బలిష్ఠంగా, బూరె బుగ్గలతో, గుండ్రని దండలతో, ఏపుగా, ఆరేళ్ల పిల్లవలె కన్పిస్తున్నాది. కిటికీలోంచి వస్తున్న సూర్యరశ్మిలో, ఆమె దంతపు బొమ్మవలె మెరిసిపోతున్నది...శివయ్యగారు కాఫీ ఒక్క గుటకలో తాగేసి, సీతతో "ఏదీ చిట్టితల్లీ! ఇట్లా రామ్మా" అన్నారు సీతని తన ఒళ్లో కూచోపెట్టుకుంటూ. శివయ్యగారి వళ్లో కూచుని, సీత గదిచుట్టూ చూస్తున్నాది. ఇటువంటి అభిమానాన్ని, ప్రేమను ఆమె యింతవరకూ చవిచూడలేదు. ఈనాటికి శివయ్యగారికి ఆమెమీద అభిమానం పుట్టుకొచ్చినట్లుంది.

"వెర్రితల్లీ! ఈ రెండుజడలు ఎవరు వేశారమ్మా" అన్నారు శివయ్యగారు ఆమెబుగ్గలు నిమురుతూ.

"నేనే వేసుకున్నాను మామయ్యా! ఇవాళ అపరంజి వెయ్యనంది."

శివయ్యగారికి పొగాకు వేసుకునేవేళ మించిపోతూంది. అదీకాక, ఆయనకి పెద్దలతోనే కాక చిన్నపిల్లలతో మాట్లాడ్డం కూడ తెలియదు. ఆతర్వాత ఏమిటి మాట్లాడాలా అని ఆయన ఆలోచిస్తున్నాడు. ఇంతలో, సీతే అంది:

"మామయ్యా! ఓ టకుగుతాను చెప్తావూ?"

"ఏమిటితల్లీ? ఎందుకు చెప్పనూ."

"మా అమ్మా, నాన్నా లేరుట. నిజమేనా?"

శివయ్యగారికి చిన్నపిల్లలతో మాట్లాడ్డం బొత్తిగా తెలియదని మరోమారు చెప్పాలి. ఎందుకంటే, ఆయన సూటిగా ఇలా అన్నాడు:

"నిజమే తల్లీ! మీ అమ్మా, నాన్నా నీచిన్నతనంలోనే చచ్చిపోయారు. పాపం!"

ఈ 'చచ్చిపోయారు' అన్న ముక్క వినేసరికి సీత గొల్లున ఏడ్వడం ప్రారంభించింది. కన్నీటితో ఆమెబుగ్గలు తడిసిపోతున్నయ్. శివయ్యగారికి ఏమి చెయ్యాలో తెల్పిందికాదు. ఇంతలో, "సీతా" అన్న అపరంజియొక్క కావుకేక వినవచ్చింది. సీత ఒక్క గెంతుగెంతి, రివ్వున ఇంట్లోకి పారిపోయింది. కళ్లు రెండూ గబగబా తుడుచుకుంటూ.

శివయ్యగారు రొండినున్న పొగాకుతీసి, చేతిలో వేసుకొని, నలుపుతున్నారు.

౨

సీత జీవితంలో కొన్ని సంవత్సరాల కాలం గడిచిపోయింది. ఆమె కిప్పుడు ఎనిమిది ఏళ్ళు. ఈ గడిచిపోయిన కాలంలో జరిగిన ముఖ్యవిశేషాలేమిటంటే: అపరంజి కాపరానికి వెళ్లిపోయింది. తాయారుకి పెళ్లి అయిపోయింది. ఆమె ఈ మధ్యనే పుష్పవతి అయింది కూడా. ఆమెకు యిప్పుడు పదమూడేళ్ళు.

పూర్ణకి పది సంవత్సరాలు వచ్చినయ్. ఆమె ఫస్టుఫారం వరకూ చదివి మానేసింది. ఆమెకు కూడా పెళ్ళియీడు వస్తున్నది. అదీకాక, కనకమ్మగారి పిల్లలు పది ఏళ్ల తర్వాత స్కూలుకి వెళ్లడం ఎరగరు.

ఇప్పుడు శివయ్యగారి పొరుగింట్లో శారదమ్మగారు, ఆవిడభర్త శర్మగారు, కొడుకు రాజు వుంటు

న్నారు. శర్మగారికి ఏడాదిక్రితం ఈ వూరికి బదిలీ అయింది. ఆయన ఏదో ఇన్స్యూరెన్సు కంపెనీలో పెద్ద జీతం తెచ్చుకుంటున్నాడు. ఆయన కున్న సంతాన మల్లా రాజా ఒక్కడే. ఇప్పుడు రాజా హైస్కూలులో రెండవ ఫారం చదువుకున్నాడు.

రాజా గారాబంగా పెరుగుతున్న పిల్లాడు. అతడు ఒక్కొక్క మారు దొరపిల్లాడివేషం వేసుకుంటాడు. మరొకప్పుడు పూర్తి ఖద్దరు దుస్తులు వేసుకుని, చక్కటి ఖద్దరు టోపీ ధరిస్తాడు. ఇంకొకప్పుడు ఫార్సీ వేషం వేయమని తల్లిని వేధిస్తాడు. ఆ యింటిలో అతని ఆటలు ఎన్నైనా సాగుతై. అతడు పంద్రెండేండ్ల బాల 'రాజా'.

ప్రతిరోజూ సాయంత్రం వేళ ఒక ముసలి దొర వచ్చి రాజాకి ఒక గంటసేపు ఇంగ్లీషు ట్యూషన్ చెప్తాడు. ఆ దొరగారు శర్మకి స్నేహితుడు. ట్యూషను అయిపోగానే, రాజా కనకమ్మగారింటికి వచ్చి సీతతోను, శాంతతోను తను ఆ వేళ మంచి యింగ్లీషుపాఠం నేర్చుకున్నానని చెప్పి, అందులోని గొప్పలను వారియందు వర్ణిస్తాడు. తను పెద్దవాడయాక, వెయ్యి రూపాయిల జీతాన్ని తెచ్చుకుంటానంటాడు. అతని మాటలను వింతగా ఆలకిస్తుంది సీత.

సీత, శాంత ఇప్పుడు ఆడపిల్లల బడిలో మూడవ క్లాసు చదువుకున్నారు.

బడికివెళ్ళి చదువుకోవడం సీతకి జీవితంలో ఒక క్రొత్త ఆనందాన్ని చేకూర్చింది. ఈ యింటికి, మనుషులకు, పనులకు దూరంగా ప్రశాంతమైన బడిలో స్నేహితులమధ్య కాలం గడపడం ఆమెకు హాయిగా వుంది. తన క్లాసులోని అమ్మాయిలందరితోను ఆమెకు స్నేహమైంది. వారందరూ తనతో చనువుగా మాట్లాడతారు. వారిలో కుళ్ళు, కుట్ర, క్రోధం, అధికారం ఏమీ కన్పించవు. జీవితంలో తనతో సానుభూతితో, చనువుతో, స్నేహంతో మాట్లాడేవారే కరువయారా అనిపించింది సీతకి, స్కూలులో ప్రవేశించేవరకూ... ఈనాటికి ఆమెకు ఆలోటు తీరింది...

తనకు అమ్మా, నాన్నా లేరు అన్న విషయం సీతని యీమధ్య బాధించసాగింది. ఇంతవరకూ, సీత తనకికూడా ఒక తల్లీ, తండ్రీ వుంటే తన జీవితం ఎట్లా వుంటుందో అనే విషయం వూహించుకోనైనా లేదు. తనకు తల్లీ, తండ్రీ లేరన్న విషయం ఆమెకు చాలాకాలం క్రిందటే తెలిసింది. అప్పటికి తను ఇంకా చిన్నపిల్ల. అప్పుడు ఆమె నీ విషయం ఏమీ బాధించలేదు. ఇప్పుడీ క్రొత్తబాధ ఆమె నెట్లా ఆవరించుకుందో ఆమెకు తెలియదు. కాని, ఆమె ప్రతిరోజూ స్కూలు నుంచి వస్తూన్నప్పుడు త్రోవలో, "నాకు కూడా అమ్మా, నాన్నా వుంటే బావుణ్ణు" అనుకొనేది. అప్పు డప్పుడు కనకమ్మగారిని "అమ్మా" అని పిలవాలనే కోరికకూడా సీతకి కలగకపోలేదు......

ఓనాడు పొరుగింటి శారదమ్మగారు ఒక పాత ఫొటో ఒకటి తెచ్చి కనకమ్మగారింట్లో పడేసి చక్కాపోయింది. ఫొటోలో, నడివయస్సులో వున్న దంపతు లిద్దరున్నారు. ఆనాడు సాయంత్రం సీత స్కూలునించి రాగానే ఆఫొటో తన అమ్మానాన్నల దని తెలిసింది. శారదమ్మగారికి ఆ ఫొటో ఏ పెట్టి అడుగునో, ఎట్లానో కన్పించిందట.

ఆ వేళరాత్రి భోజనం అయాక, ఎవరూ చూడకుండా, సీత ఫొటోవద్ద నిలబడి ఒక గంటవరకూ చూచింది. ఆ యిద్దరే తన తలిదండ్రులు! ఎట్లా వున్నారు! తను వారిద్దరినీ ఎప్పుడూ చూచే అవకాశం లేకపోయినా, ఆ యిద్దరూ తనకు ఎంతో ఆత్మీయులవలె, తను ఎరిగున్న వారివలె కన్పిస్తున్నారు. వా రిద్దరూ తనకు తలిదండ్రులన్న భావం ఆమెను వారికి మరీదగ్గరగా తీసుకుపోసాగింది. వారే తనకు అమ్మా, నాన్నా! సీత ఫొటోని మెల్లిగా తడిమింది. ఆ ఫొటోకే ఈ నిముషమందు జీవం వస్తే, తను వారిద్దరికీ ఎన్నెన్నో విషయాలను చెప్పి, తన మనస్సులోని ఏదో అవ్యక్తమైన భారాన్ని తగ్గించుకోదలచుకొంది......ఆమె మనస్సు వింత ఆలోచనలతో కలత చెందిపోయివుంది...తన తల్లి ఫొటో తనవైపే చూస్తున్నది. "అమ్మా" అందామనుకుంది సీత. ఆ ముక్క ఆమె గొంతులోనే వుండిపోయింది......

ఆ వేళరాత్రి సీతకు నిద్రపట్టలేదు. ఆమె ఏమేమో ఆలోచించుకొంటున్నాది. తను అచ్చంగా

అమ్మపోలికే! అమ్మ ఎంత అందంగా వుంది! మళ్లీ, అమ్మే తన రూపంలో ఈ భూలోకంలో పుట్టినట్లుంది...ఈభావం సీత మనస్సుని కొంచెం తేలిక పరచినట్లుంది...ఎందుకో ఆమెకే తెలియదు. అర్ధ రాత్రివేళకి ఆమెకు ఎట్లాగో నిద్రపట్టింది.

మర్నాడుఉదయం అపరంజి అత్తవారింటినుంచి వచ్చింది. ఆమె వచ్చినవెంటనే మగ్గురు చెల్లెళ్లూ ఆమె చుట్టూ ఆప్యాయంగా మూగేరు. వారిని అపరంజి ఎంతో అభిమానంతో, ప్రేమతో పలకరించింది. ద్వారంలో నుంచుని సీత యిదంతా చూస్తున్నది. ఆమెను అపరంజి పలకరించలేదు. కనీసం ఆమెవైపు చూసి నవ్వనైనాలేదు. కాని, అపరంజిమాత్రం సీత వైపు అయిదు నిమిషాలపాటు ఆశ్చర్యంతో చూసింది. సీత ఎంతోమారిపోయినట్లు కన్పించిందామెకు. సీత ఇంత అందంగా తయారవుతుందని ఆమె ఎన్నడూ వూహించలేదు. సీత పొడుగ్గా, బలంగా, పంద్రెండేళ్ల పిల్లవలె వుంది. చారెడేసి కళ్లతో, బంగారుమేని ఛాయతో, ఆమె చిన్న లక్ష్మీదేవివలె వుంది. ఆమె నడుస్తున్నప్పుడు దంతపు విగ్రహానికి ప్రాణం వచ్చినట్లుంది. అన్నిటికంటె సీతలో ఆకర్షణీయంగా వున్నది ఆమె జుత్తు. ప్రవాహంవల్లే అజుత్తు ఆమెపిరుదులను దాటుతున్నది......అపరంజికి తన నెవరో వెక్కిరిస్తున్నట్టయింది.

ఆనాడురాత్రి కనకమ్మగారు అపరంజికి దిష్టి తీసి పారేశారు.

వారంరోజుల తర్వాత ఓనాడు అపరంజి సీత పుస్తకాలను కెలుకుతూ అంది: "ఏమే సీతా! ఈ పుస్తకంలో ఇంగ్లీషుపేర్లు ఎవరా రాశారూ?"

"నేనే రాసుకున్నాను" అంది సీత.

"మీ స్కూల్లో ఇంగ్లీషు నేర్పరని కాంత అంటే?"

"అవి మా స్కూల్లో నెప్పినవి కావు. రాజా దగ్గిర నేను నేర్చుకుంటున్నాను ఇంగ్లీషు."

అపరంజి మరి మాట్లాడలేదు. ఆమె గబగబా పుస్తకంపేజీలను తిరగేస్తున్నది. ఆమెవాలకం సీతకు దిగులుగా వుంది. సీత అక్కడినించి వెళ్లిపోయింది.

అపరంజి మళ్లీ అత్తవారింటికి వెళ్లిపోయే ముందు రోజున ఓ చిన్న గల్లంతు జరిగింది. ఆ వేళ కనకమ్మ గారికి గదిలో లాంతరుచిమ్నీ బద్దలైపోయి వుండడం కన్పించింది. ఆవిడ గట్టిగా "సీతా! ఒసేవ్!" అని అరిచింది. ఇంతలో ఈ అరుపు విని అపరంజి వచ్చి, లాంతరువేపు చూస్తూ, "ఎవరిపనే అమ్మా యిది?" అంది, ఇంట్లోని వస్తువుల జాగ్రత్తవిషయమై తన పూర్తి బాధ్యతను కనపరుస్తూ.

ఇంతలో తాయారువచ్చి ఈ దృశ్యాన్ని చూసింది. "అమ్మా! సీత ఇందాకట్ల ఈ గదిలోంచి వస్తూవుండగా నేను చూశాను" అంది తాయారు. ఇంతలోగా పూర్ణకూడా వచ్చింది. సీత యింకా రాలేదు. కనకమ్మగారు మరోక కేక పెట్టారు. సీత వచ్చేలోగా, ఆమెదే నేరమని కూతుళ్లూ, తల్లీ నిర్ణయించి పారేశారు. సీత వచ్చింది. ఈ దృశ్యాన్ని చూశాక, ఆమెకు అంతా అర్థమైపోయింది. "చిమ్నీ ఎవరు బద్దలుకొట్టేరో నాకు తెలీదత్తా!" అంది సీత తను ఈ విషయమయే పిలవబడ్డదని గ్రహించి.

"చూశావే అమ్మా! మనం ఎవరం బద్దలు కొట్టకపోతే, ఈ యింట్లో మరెవరున్నారూ?" అంది అపరంజి. ఏమైనా సీతమాటల నెవరూ నమ్మలేదు. ఆమెకు బాగా చీవాట్లు అయినవ్. "అపరంజి వేగిరం అత్తవారింటికి పోవాలి దేవుడా" అని సీత వెయ్యి మొక్కులు మొక్కుకుంది.

ఆనాడు సాయంత్రం అపరంజి ప్రయాణం పెట్టుకుంది. కాని, ఆమె వెళ్లే ముందర మరోక చిత్రమైన సంగతి జరిగింది. అరగంటలో అపరంజి బట్కా ఎక్కి వెళ్లిపోతుందనగా—సీత రుబ్బురోలు ముందర కూచుని ఏదో రుబ్బుతున్నది. ఇది ఆమె నిత్యకృత్యాల్లో ఒక చిన్న కృత్యం. అపరంజి వచ్చి "సీతీ! అది వదిలేసి, లే! నేను రుబ్బుతానులే" అంది. ఈ ఆహ్వానం సీతకి వింతగా వుంది. నిజానికి అపరంజి ముఖంలో ఏ మాత్రం సుహృద్భావం కాని, దయ కాని, నిష్కపటం కాని ఆ నిమిషంలో కన్పించి వుండినట్లయితే, సీత తప్పక ఆ పని వదిలేసి ఓ నిమి

మం విశ్రాంతి తీసుకొనేది. కాని అపరంజిముఖంలో యివేవీ లేవు. ఆమెలో ఏదో పట్టుదల, వూహించరాని పంతమూ కన్పిస్తున్నవి. సీత ఆ పని తనే చేస్తానన్నది. కాదు నేనే చేస్తానంది అపరంజి. "అయిపోవచ్చింది. మళ్ళీ మరొకరు చెయ్యిచేసుకోవడ మేమిటి?" అంది సీత. అపరంజి ఒప్పుకోలేదు. ఇద్దరూ కొంతవరకూ ఘర్షణపడ్డారు. ఇంతలో కనకమ్మగారు వచ్చింది.

"అమ్మ చూశావే! దీని మొండితనం? లేవ మంటే లేవకుండా వుంది! ఇక ఇరుగుపొరుగులో తనే ఇంటి పని అంతా చేస్తున్నదని చెప్పుకోడానికి ఈ ఎత్తంతా" అంది అపరంజి. ఈ మాట విని సీతకి ఏడుపు వచ్చింది. ఆమె చేతులు దులుపుకొని దిగ్గున లేచి నుంచుంది. ఆమెకళ్ళల్లో నీరు నిండింది. తన నెందుకు అపరంజి యిట్లా కఠినమైన మాటలు అంటుందో తనకు తెలియదు. ఇరుగుపొరుగుతో తను ఇంటి విషయమై ఏమీ మాట్లాడదు. ఇంతవరకూ, లోకులతో వున్నవీ లేనివీ కబుర్లు చెప్పుకుని మంచి దనిపించుకోవడం తనకి చేతకాదు......లోపల వున్న కుళ్లును కప్పిపుచ్చి, పైకి అభిమానం కనపరుస్తూ, వసకపాటున ఎక్కిరిస్తూ బంధువుల ముందర చాలా మంచివారని చలామణీ అయిపోయే 'అమాయకు' ల యొక్క నటన తనకి యింతవరకూ అలవడలేదు......

అపరంజి అత్తవారింటికి వెళ్లిపోయింది. సీత ఒక్క నిట్టూర్పువిడిచింది. ఆవేళ సాయంత్రం చీకటి పడ్డాక శారదమ్మగారింటికి వెళ్ళి రాజాతో, "రాజా! అపరంజి వెళ్ళిపోయింది" అని చెప్పింది సీత నవ్వుతూ.

"అయితే, రేపటినుంచి నాదగ్గిర యింగ్లీషు నేర్చుకుంటావా?"

"వూఁ! నాకు పెద్దపెద్ద మాటలు నేర్పాలి. అక్షరాలన్నీ చూడు ఎంత వేగిరం వచ్చేశాయో!"

సీత వెళిపొచ్చే ముందర రాజా ఆమెతో మెల్లిగా అన్నాడు—"సీతా! ఇట్లా రా! నీకు మంచి కబురు ప్తాం."

సీత రాజుదగ్గరగా వెళ్ళింది. రాజా ఆమెచెవిలో అన్నాడు: "సీతా! ఎవరితో చెప్పకేం. ఇవాళ పొద్దుట బంతి ఆడుతూ వుండగా మా లాంతరు చిమ్నీ మీద పడింది.......నీకు మాత్రం చెప్తున్నాను........"

"ఔను! చిమ్నీ బద్దలయిపోయింది కూడాను"

"నీ కెట్లా తెలిసింది?"

"అత్తయ్య చూసింది. నేనే బద్దలు కొట్టేనని అపరంజికూడా సాక్షికం చెప్తే, అత్తయ్య నన్ను ఎంతో తిట్టిపోసింది......"

రాజా సీతబుగ్గల్ని తన కుడి చేతి వేళ్ళతో నొక్కుతూ, "మంచిదానివి కావూ, సీతా! చిమ్నీ నేను బద్దలు కొట్టేనని ఎవరితో చెప్పకేం. నువ్వెంతో మంచి సీతవి......అపరంజిఅంత చెడ్డది ఎక్కడా లేదుకదూ?" అన్నాడు ఓదారుస్తున్నట్లుగా.

"వూహుఁ! చెప్పనులే......అపరంజి ఎప్పుడూ నన్ను సాధించడమే......చచ్చేదాన్ని ప్రతిరోజూ"

"పోనీలే! అది వెళిపోయిందికదూ మరి?"

"నాకు లెక్కలుకూడా చెప్పు, రేపట్నుంచి"

"గ్రామరుకూడా చెప్తానులే"

వారంరోజుల తర్వాత, ఓనాడు సాయంత్రం సీత పెరట్లో వుండగా రాజా వచ్చి అన్నాడు:

"సీతా! నేను సినిమాకి వెళ్తున్నాను. నువ్వు కూడా త్వరగా రా!"

సీత ఓ నిముషం ఆలోచించి అంది:

"వుండు, ఇప్పుడే వస్తున్నాను"

"వేగిరం రా! నేను వీధివరండాలో వుంటాను"

"ఇదుగో, బట్టలు మార్చుకుని వచ్చేస్తాను"

అయిదు నిమిషాల తర్వాత సీత వచ్చింది.

"ఛా! ఆ పరికిణీ, జాకెట్టు బాగులేవు! ఎవరన్నా చూస్తే నవ్వుతారు. మనం కుర్చీల్లో కూచుంటాము, తెలుసా? మంచి బట్టలు వేసుకోరాదూ?" అన్నాడు రాజా.

సీత మళ్లీ లోపలికి వెళ్ళి రెండు నిమిషాల్లో బట్టలు మార్చుకువచ్చింది. రాజా ఆమెవేపు అసంతృప్తిగా చూస్తూ అన్నాడు:

"అబ్బే! ఇవీ బాగులేవు. ఇస్త్రీ బట్టలు లేవూ? చూడు, నే నెట్లాంటి బట్టలు వేసుకొన్నానో!"

సీత ఏమో అందా మనుకుంది. కాని, మళ్ళీ లోపలికి వెళ్ళి, మరో జత వేసుకుని వచ్చింది. ఈ మారుకూడా రాజుదృష్టిలో ఆమెబట్టలు ఏమీ బాగులేవు.

"రాజూ! నాకు మరి బట్టలు లేవు" అంది సీత, జాలిగా అతని వేపు చూస్తూ, బ్రతిమాలుతున్నట్లు.

"పోనీ! అట్లానే రా"

సీత మొగం చేటంతైంది. రాజుచెయ్యి పట్టుకుని, "పద వేగిరం" అంది సీత. ఇద్దరూ మెట్లు దిగుతూ వుండగా, "సీతా!" అన్న పెద్ద కేక వినవచ్చింది. ఇద్దరూ ఆగిపోయారు. "అత్తయ్య వచ్చేసినట్లుంది! నేను రాను. నువ్వు ఒక్కడివీ వెళ్ళిపో" అంది సీత......రాజు ఒక్కడూ వెళ్లిపోయాడు. సీతకి కళ్ళనీళ్ళ పర్యంతమూ అయింది.

మర్నాడు సీత బట్టలు వుతుకుతూ వుండగా, రాజు నూతి దగ్గరికి వచ్చాడు:

"సీతా! నిన్న సినీమా ఎంత బావుందనుకున్నావ్! అబ్బ! కొండలు గెంతడం, వురకడం, దెబ్బలాడ్డం! ఇంగ్లీషుఫిల్ము, తెలుసా!" అన్నాడు రాజు.

"ఎక్కడికి వెళ్ళిపోతున్నావని అత్తయ్య అడిగింది నిన్న. సినీమా కన్నాను. చెప్పకుండా, కాంతనైనా తీసుకెళ్ళకుండా ఎందుకు వెళ్ళేవని తిట్టింది"

"ముగ్గురికి టిక్కెట్లు కొనడానికి నాదగ్గిర డబ్బు లేదుగా? వున్నా, నేను కాంతని తీసుకెళ్ళను"

"మరి అయితే ఎట్లా?"

"ఈమారు మీ అత్తయ్య ఎప్పుడైనా హరికథకి గాని వెళ్తే మనం సినిమాకి పోదాం?"

"చూద్దాంలే"

మళ్ళీ, వారం రోజులవరకూ రాజు రావడం మానివేశాడు. ఓనాడు శారదమ్మగారు వచ్చి, రాజుకి జ్వరంగావుందని కనకమ్మగారితో చెప్పి వెళిపోయింది. ఆనాడు సాయంత్రం సీత రాజును చూడ్డానికి వెళ్లింది. రాజు చాలాచిక్కిపోయి వున్నట్లుగా కనిపించాడు. సీతను చూడగానే, రాజు మంచంమీద లేచి కూచుని, "సీతా! నిన్న నే ఎందుకు వచ్చావు కాదు?" అన్నాడు.

"నాకేం తెలుసు? ఇవాళ శారదత్త వచ్చి నీకు ఉష్ణంగా ఉందని చెప్పింది."

"నిన్న నీకోసం ఎంతలా పిలిచాను?"

"పోనీ, ఇవాళ వచ్చానుకదూ? ఇకనుంచీ రోజూ వస్తానులే"

"ఇవాళ మా ఇంట్లోనే వుండిపో! అమ్మతో చెప్తానులే, నువ్వు ఇక్కడే భోంచేస్తావని"

ఆనాడు రాత్రి సీత అక్కడే వుండిపోయింది. ఇద్దరూ రాత్రి చాలా సేపటివరకు కథలు చెప్పుకున్నారు. రాత్రి పది గంటలు అవుతూ వుండగా, పక్క గదిలోంచి శారదమ్మగారు "ఒరే! పిల్లలూ! చాలా రాత్రి అయింది. యిక పడుకోండి" అని కేక వేశారు.

మర్నాడు ఉదయం రాజు బార్లీ తాగుతూ అన్నాడు:

"సీతా! నీకు సిందుబాదు కథ తెలుసా?"

"తెలీదు"

"పోనీ, బ్రహ్మరాక్షసి కథ చెప్పు"

"అదీ నాకు తెలియదు"

"మరేదైనా కథ చెప్పు"

"నాకే కథలూ రావు రాజూ!"

"అయితే నువ్వు మీ యింటికి వెళ్ళిపో"

"నిజంగానేనా?"

"నిజంగానే! వెళ్ళిపో!"

సీత ఏడుపుముఖం పెట్టి, రాజువేపు ఓ మారు చూసింది. ఆ తర్వాత, రివ్వున ఇంట్లోకి పారిపోయింది......రాజు "సీతా!" అని కేక వేశాడు. కాని, ఆమెకు విన్పించలేదు.

రెండు రోజుల తర్వాత రాజుకు జ్వరం తగ్గిపోయింది. ఆనాడు సాయంత్రం శివయ్యగారి ఇంటి

కిటికీవద్ద నిలబడి రాజు, "సీతా!" అని పిలిచేడు. సీత వచ్చింది. "సీతా! కోపం వచ్చిందా?" అన్నాడు. లేదంది సీత.

"మళ్ళీ మా యింటికి వస్తూ వుంటావా?"

"ఊఁ! వస్తానులే"

"ఆ వేళ పూరికేనే నిన్ను ఏడిపించాను, సీతా!" సీత పకపకా నవ్వింది. రాజుకూడా నవ్వేడు.

### 3

సీతకి పదకొండవ ఏడు వచ్చేసరికి పుష్పవతి అయి కూచుంది. భారమైన వదికతో, తీర్చి దిద్దినట్లున్న అద్భుతమైన అంగసౌష్ఠవంతో ఆమె ఒక బంగరు బొమ్మవలె వుంది.

సీతకి యింట్లో ఈమధ్య కొత్తకొత్త సంగతులు వినపడుతున్నయ్. కనకమ్మగారు సీతకి పెళ్ళిప్రయత్నాలు విరివిగా చేస్తున్నారు. తనకి తెలిసిన సంబంధాలన్నిటినీ శివయ్యగారికి వర్ణించి చెప్పి, "ఏకో ఓ సంబంధం వేగిరం సెటిలు చేయా" లని చెప్పింది.

సీత స్కూలు మానివేసి ఆరు నెల్లయింది. రోజూ తన పెళ్ళి విషయమై ఇంట్లో జరుగుతున్న సంభాషణలు అన్నీ ఆమె వింటూనే వున్నది.. ఇంతవరకూ కనకమ్మగారు ఎంచిన సంబంధాలు అన్నీ మూడో పెళ్ళి వాళ్ళవి, నలభై ఏళ్ళవారివి. అందులో ఒక వరుడికి నలుగురు పిల్లలుకూడా వున్నారని తెలిసింది......

ఓనాడు సీతతో కనకమ్మగారే ఆమె పెళ్ళి విషయమై చెప్పింది.

"అత్తయ్యా! ఓ ఏడాది పోయాక నాకు పెళ్ళి చేసుకోవాలనుంది......ఇప్పట్నుంచీ.........." అని ఆగింది సీత, తన మాటలకి తనే ఆశ్చర్యపోతూ. ఎందుకంటే, తన జీవితంలో ప్రప్రథమంగా తన కోర్కెను వ్యక్తపర్చడం ఇదే. ఇంతవరకూ తనకికూడా కోర్కెలు వున్నవనే విషయం సీతకి తెలియదు......

కనకమ్మగారు సీతమాటలకి మొదట ఆశ్చర్యపోయింది. తరువాత తనకి సహజమైన కోపం వచ్చింది.

"ఇదుగో సీతా! నువ్వింకా చిన్న పిల్లవు కావు. మీ తండ్రి ఆస్తి వున్నదేదో నీ కింద ఖర్చు అయిపోయింది...ఇంక, నువ్వు ఒక యింటిదానివై, నీ బతుకేదో నువ్వు చూసుకోవాలి......"

"నా బ్రతుకా?" అంది సీత. కాని, కనకమ్మగారు ఈ మాటలు వినకముందే వంటింటిలోకి వెళ్ళిపోయారు.

ఓనాడు సీత కిటికీవద్ద నుంచుని, మేఘాల వైపు చూస్తూ, ఏదో ఆలోచించుకొంటున్నది. వరండా మెట్లమీదనుంచి రాజు ఎక్కడికో వెళ్తున్నాడు.

"రాజూ" అని పిల్చింది సీత అప్రయత్నంగా. ఎందుకు పిల్చిందో ఆమెకే తెలియదు. చాలారోజులై తను రాజును చూడ్డం లేదు. తను పెద్దమనిషి అయినప్పటినుండి వీధి మొగమే చూడలేదు.

రాజు కిటికీవద్దకి వచ్చి నిల్చున్నాడు. రాజు యిప్పుడు పదహారు ఏళ్ళ యువకుడు. ముఖంలో యింకా చిన్నతనపు చిహ్నాలు కన్పిస్తున్నవి.

"ఎందుకు పిల్చావు, సీతా?" అన్నాడు రాజు.

"ఏ...ఎందుకూ...లేదు...రాజూ!"

"అయితే పోతాను?" అని, రాజు రెండు అడుగులు వేసి, మళ్ళీ వెనక్కి వచ్చి, "సీతా! నీ పెళ్ళట! నన్నుకూడా పెళ్ళికి పిలుస్తావా?" అన్నాడు నవ్వుతూ.

సీత వులిక్కి పడ్డది...ఆ తర్వాత రెండు చేతులతో మొహం కప్పుకుని వెక్కివెక్కి ఏడవటం మొదలుపెట్టింది.

"సీతా! సీతా! ఎందుకలా ఏడుస్తావ్!"

గభ్భున తలెత్తి, సీత తీక్ష్ణంగా అతనివేపుచూసి, "ఛీ! నువ్వుకూడా నా పెళ్ళిమాట అడగడమేనా, రాజూ?" అంది.

"నేనేం చేశాను సీతా! అడగడంకూడా తప్పేనా?"

"ఏమీ తెలియనట్లు అట్లా అడుగుతావేం?"

"నాకేం తెలుసును సీతా!"

"నీ కంతా తెలీదు... తెలుసుంది కూడా, నిద్రలేక, నన్నిట్లా అడుగుతూ, బాధపెడుతున్నావు... నువ్వు పుట్టి మోసకాడివి—నీతో మాట్లాడకూడదు..."

"సీతా! ఏమి టిలా మాట్లాడుతున్నావ్? నా కేమీ అర్థం కాకుండా వుంది"

"ఔను. నీ కేమీ అర్థంకాదు. ఇన్నాళ్ళయినా నీకేమీ అర్థం కాలేదు. అందుకే నీతో మాట్లాడకూడదన్నాను—పో! ఇక్కడనుంచి!"

"సీతా! నీకు వెర్రెత్తిం దేమిటి......ఏమిటి ఈ ఏడుపు, కోపం, ఇదంతా?"

"ఔను, నేను వెర్రిదాన్ని! నేను తల్లిదండ్రులు లేనిదాన్ని...దమ్మిడీ లేని ముష్టిదాన్ని! వెర్రిదానిని కాక ఇంకేమి కాగలను—ఛీ! ఇక్కడినుంచి వేగిరం పో!" అని, సీత ధడాలున రెండు కిటికీ తలుపులు వేసేసి, "ముష్టిదానిపైనా నీ కెందుకు? నువ్వు పట్టి మోసకాడివి......పో! వేగిరం పో" అని రెండు చేతులలో తల పెట్టుకుని వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది.

రెండు నిమిషాల తర్వాత రాజు వెళ్ళిపోతూ వున్న. జోడుచప్పుడు వినిపించింది.

౪

సీత పెళ్ళి ఒక్క రోజులో, నిరాడంబరంగా, అతి సామాన్యమైన విధంలో జరిగిపోయింది. పెళ్ళినాడు సీత ఏడవడం కాని, దుఃఖించడం కాని చేయనందుకు కనకమ్మగారు ఎంతో సంతోషించారు.

సీత యింతవరకూ తన భర్తను చూడలేదు. అతడు ఎలా వుంటాడో, ఎంత వయస్సువాడో చూడాలనే కోరిక కించిత్తూ ఆమెకు కలగలేదు. పెళ్ళినాడు ఆమె మౌనంగా, గంభీరంగా, నిశ్చలంగా, ఒక శాంతమూర్తివలె కన్పించింది.

సీత తన భర్తను చూడకపోయినా, కనకమ్మగారు పెళ్ళి ముందర తనతో చెప్పిన ప్రకారం, తన భర్తను గురించి కొంత తెలుసుకోగల్గింది; అతడు మూడవ పెళ్ళివాడు; ముప్ఫైఅయిదు ఏళ్లు వుంటాయి—అదృష్టవశాత్తు అతనికి పిల్ల లెవరూ లేరు. అతని యింట్లో అత నొక్కడే. అంచాత సీత చాలా సుఖపడుతుందని కనకమ్మగారు అందరితోనూ చెప్పింది. అదీ కాక, సీతమొగుడు బెజవాడలో ఎనభై రూ.ల వుద్యోగం చేస్తున్నాడు...

పెళ్ళి అయిన పదిహేనురోజులకే, సీతభర్త వచ్చి సీతను తనతో కూడా బెజవాడ తీసుకుపోయాడు... కనకమ్మగారు ఇంట్లో వున్న సీత వస్తువులు అన్నీ—అంటే ఒక కర్రపెట్టి, ఏవో గుడ్డలు, పుస్తకాలు, మట్టిబొమ్మలు మొదలైనవి—సీత కిచ్చేసింది. సీత తనకున్న ఆస్తితోసహా, కట్టుకున్న మొగుడితో బెజవాడ వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళేముందర శారదమ్మగారు ఒక నేతచీర, చిన్నఅద్దం, పన్ని కొని సీతకి యిచ్చారు.

బెజవాడలో తమ యింటికి వెళ్ళేక, సీత తన భర్తను—మొదటిసారి—సావకాశంగా తేరిపార చూసింది. అతడు నలభై ఏళ్ళు దాటిన వ్యక్తివలె కన్పిస్తున్నాడు. సామాన్యమైన ఒడ్డూ, పొడుగు; అందగాడూ కాడు, కురూపీ కాడు. అతని ముఖాన్ని చూసి, అతనియొక్క మంచి చెడ్డలను నిర్ణయించడం కష్ట మనిపించింది సీతకి.

బెజవాడ వచ్చిన పది రోజుల వరకు సీతకి నిద్ర పడలేదు. భర్త అడిగినదానికి ఆమె కేవలం సంజ్ఞలతోనే జవాబులు చెప్పింది. ఓ నాడు భర్త అన్నాడు:

"సీతా! ఈ యింట్లో మనిద్దరం తప్ప మరెవ్వరూ లేరు. నీ కోరికలను చెప్పుకోవటానికి అడ్డు సాయం లేనే లేదు. సిగ్గుచేత, నీ మనస్సులోని కష్టసుఖాలను, సాధక బాధకాలను నాతో చెప్పుకోవేమో నని నాకు విచారంగా వుంది...సిగ్గుమాని, నీకు కావలిసింది ఏమేనా వుంటే నాతో చెప్పు......"

"అలాగే" అంది సీత మెల్లిగా.

'అలాగే' అంది కాని, సీతలో ఏమీ మార్పు కన్పించలేదు. సాధారణంగా ఆమె ఏదో ఆలోచిస్తూ వున్నట్లుంటుంది. లేదా, పరధ్యానంగా వుంటుంది. ఎంతో అవసరమైతేనేకాని మాట్లాడదు. ఎవరికీ అర్థం

కాని దుఃఖంతో కుమిలిపోతూవున్న మనిషిలా ఉంటున్నది.

ఓనాడు సాయంత్రం అయిదు గంటలైంది. సీత భర్త అప్పుడే ఆఫీసునుంచివచ్చాడు. సీత గోడకి చేరబడి కూచుని, అరచేతుల్లో చెక్కిళ్ళు వుంచుకొని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నది. ఆమెముఖంలో విషాద రేఖలు స్పష్టంగా కన్పిస్తున్నవి.

పావుగంట తర్వాత, వంటింట్లో ఏదో చప్పుడవగా, సీత ఆలోచనమంచి తేరుకొని, వంటింట్లోకి వెళ్ళింది. అక్కడ తనభర్త కుంపటిముందు కూచుని, టీ చేస్తున్నాడు. సీతకి ఒక్కమారు కళ్ళంట నీళ్ళు వుబికినవి. ఆమె గబుక్కున భర్తచేతిని పట్టుకొని, "వద్దు, మీరు చెయ్యొద్దు. నాకు మతిపోయింది. క్షమించండి" అంది. అతను సీతను దగ్గరగా తీసుకొని, "సీతా! ఇందులో తప్పేమీ లేదు! ఎందు కేడుస్తావు? నువ్వేదో విచారంతో బాధపడుతున్నావు. అంచేత నేనే టీ తయారుచేస్తున్నాను. ఇందులో నీ తప్పేమీ లేదు. నీ బాధను నాతో చెప్పవేం? నీకు సహాయం ఎలా చేయడమో నాకు తెలియకుండా వుంది సీతా!" అన్నాడు. సీత అతని ముఖంలోకి చూచింది. అతని ముఖం కేవలం విషాదమయం! శాంతం మూర్తీభవించి వుంది......

సీత భర్తగుండెలమీద తలవుంచి, "లేదు— నా కేవిచారమూ లేదు. మీరు సుఖంగా వుండడమే నా సుఖం" అంది.

మర్నాడు వుదయం సీత వంటింట్లో పాడుకుంటూ వంటచేసింది. సాయంత్రం భర్త ఆఫీసునుంచి వచ్చేసరికి సీత కాఫీయిస్తూ అడిగింది. "అ కుచ్చిలాల్చీ తొడిగారేం, ఇవాళ?"

"అన్నిలాల్చీలూ మాసిపోయాయి"

"నాతో ఎందుకు చెప్పలేదు? నేను వుతకనను కొనే చెప్పడం మానేశారా?"

అతను పకపకా నవ్వేడు. ఆ నవ్వులో సీతకి పితృవాత్సల్యం వంటిది కన్పించింది. అటువంటి భావం ఎందుకు వచ్చిందో ఆమెకు తెలియలేదు......

రెండు నెలలు గడిచాక, ఓ నాడు భర్త ఆఫీసుకు వెళ్తూ వుండగా, సీత నవ్వుతూ అంది: "ఇవాళ వేగిరం ఆఫీసునుంచి వెళిపోరండి" అని. "ఎందుకు" అన్నాడతను.

"సినీమాకి వెళ్దాం ఇవాళ"

ఆవేళరాత్రి ఇద్దరూ సినీమాకి వెళ్ళేరు. సినీమానుంచి ఇంటికి వచ్చాక, భర్త గట్టిగా దగ్గేడు.

"చూడండి! ఇంత చలిలో సినీమాకి తీసుకు వెళ్ళమని మిమ్మల్ని శ్రమపెట్టేను! ఈ చలివల్లే మీకు శైత్యం చేసింది" అంది సీత.

"పిచ్చి సీతా! చలి అని సినీమాలు మానకుంటారా ఎవరైనా? అజీర్తి చేస్తుందని తిండి తినడం మానేస్తామా?"

ఇట్లా అన్నాడేకాని, మర్నాడువుదయం లేస్తూనే, "తల నొప్పిగా వుంది" అన్నాడతను. "నేను చెప్పాను కాదూ? ఇది నిన్న సినీమావల్లనే" అంది సీత.

ఆవేళ అతను ఆఫీసుకి వెళ్ళలేదు. కుర్చీలో కూచుని ఏదో పత్రిక చదువుకుంటున్నాడు రోజల్లా. సాయంత్రం సీత వంటింట్లోకి వెళ్ళి కాఫీ తెచ్చేసరికి, అతను మంచంమీద పడుకొని, దళసరి కంబళీ కప్పుకుని గజగజా వణుకుతున్నాడు.

"అయ్యో! ఒంట్లో ఎలా వుందండీ"

"అబ్బ! పెద్ద చలి వేస్తున్నాది"

"కాళ్లు పట్టనా?"

"ఒద్దు. మరోక కంబళీ కప్పు!"

రాత్రికి తీవ్రమైన జ్వరం వచ్చింది. పొరుగునే వున్న డాక్టరువచ్చి ఏదో మందిచ్చి వెళ్లిపోయాడు.

మర్నాటి పొద్దున్నకి మనిషి సగం అయిపోయాడు. కళ్లు లోతుగా వెళ్లిపోయాయి. భయంకరంగా తయారయేడు.

వారం రోజులైంది. జ్వరం తగ్గడం లేదు. ఓనాడు సీత వంటింట్లో ఏడుస్తూ కూచుంది. ఇంతలో భర్త పిలిచాడు. ఆమె కళ్లుతుడుచుకొని వెళ్లింది.

"ఏం! పిలిచారు?"

"వెర్రి సీతా! అట్లా వున్నావేం?"

"ఏం లేదు. కళ్లల్లో పొగదూరింది"

"నాకు తెలుసు లే! ఇట్లా దగ్గరగా రా!"

"ఊఁ! చెప్పండి"

"ఒక్క ముద్దియ్యి సీతా!"

ఆమె బుగ్గలని మెల్లిగా తన పెదవులతో స్పృశించాడు. సీత భళ్లున ఏడ్చింది.

"నా అమాయకపు సీతా! ఈపాటిదానికే ఎవరైనా ఏడుస్తారా? కష్టం ఎవరికీ రాకుండా వుంటుందా? నువ్వింకా చిన్న పిల్లవి! ఛీ! వూరుకో—ఒక్కమారు నవ్వు, చూస్తాను!"

అతని మాటల్లో గొప్ప శక్తి ఏదో వుంది. మంత్రించినట్లుగా, సీత కళ్లు తుడుచుకుని, విశాలంగా నవ్వింది.

ఆవేళరాత్రి సీతభర్త విపరీతంగా పలవరించేడు. 'బాధ, బాధ' అని కిరకిర చుట్టుకపోయాడు; పేలాపన ఆరంభించాడు.

అర్ధరాత్రివేళప్పుడు డాక్టరువచ్చి యింజెక్షను యిచ్చి వెళ్లిపోయాడు.

రాత్రి ఒంటిగంట అవుతూవుండగా, పెద్ద అరుపు అరచి, సీతభర్త ఈ లోకాన్ని విడిచి వెళ్లిపోయాడు.

మర్నాడు బంధువు లందరూ వచ్చేరు. కనకమ్మగారు, శివయ్యగారు కూడా వచ్చేరు. ఇల్లంతా ఏడుపులతో, గోల్లుతో నిండిపోయింది.

"అమ్మో! సీతా! నీబ్రతు కింతలా అర్ధానం అయిపోయిందే" అని అందరూ ఏడ్చారు.

"ఔను! నా బ్రతుకు పూర్తి అర్ధానం అయిపోయింది" అంది సీత, తలను నేలకి మొత్తుకొని ఏడుస్తూ.



# ధార్ కమిషన్ నివేదిక

శ్రీ వేమూరి వెంకటరామనాథం

భాషాప్రయుక్తరాష్ట్రకమీషన్ వారి నివేదికలో నూతనరాష్ట్రాల ఆర్థికప్రతిపత్తులు ప్రస్తావింపబడినవి. ఆంధ్రరాష్ట్రార్థికపరిస్థితులదృష్ట్యా ఈ నివేదికలో సూచింపబడిన అంశాలు ఎంతవరకు సమంజసమో తెలుసుకోవడమే ఈ వ్యాసోద్దేశం.

కమీషన్ వారు మద్రాసు ప్రభుత్వాధికారులు ఇచ్చిన ఆదాయవ్యయపట్టికలతోనే సంతృప్తిపడి, వానిని ఆధారంగా తీసుకుని ఈక్రిందిసూచనలు చేశారు:

ఆంధ్రతమిళనాడుల మధ్య, జనాభాను ప్రాతిపదికగా తీసుకుని ఆదాయవ్యయాలను నిర్ణయించారు. దీనికి వారు చెప్పిన సమాధానం—ఆంధ్రరాష్ట్రం వైశాల్యంలో పెద్దది, జనాభాలో చిన్నది; తమిళనాడు వైశాల్యంలో చిన్నది, జనాభాలో పెద్దది.

అప్పుసొప్పులు విభాగించడంలో వారు సూచించినది: ఏయే ప్రాంతాలలో ఏయేమి ఆస్తిపాస్తులు ఉన్నా వాటిని ఆయా ప్రదేశాలలోనే ఉంచి, అప్పటి

## ఆంధ్రరాష్ట్ర ఆదాయవ్యయ పట్టిక

ఆదాయము : (లక్షల రూపాయలు)

| | |
|---|---|
| రెవిన్యూ ... ... ... | ౧౬౫.౪౯ |
| అదనపు సేల్సు టాక్సువల్ల వచ్చిన మొత్తం కలిపి, | ౧౧౦.౦౦ |
| మద్యపాననిషేధంవల్ల కలిగిన నష్టం తీసివేసి, | ౮౯౩.౦౦ |
| యుద్ధానంతర నిర్మాణప్రణాళికల కిచ్చే గ్రాంటులను కలిపితే, | ౬౮.౦౦ |
| మొత్తం | ౧,౨౦౬.౪౯ లేక ౧, ౨౦౭.౦ |

వ్యయం : (లక్షల రూపాయలు)

| | |
|---|---|
| ఖర్చు ... ... ... | ౧,౬౭౮.౩౦ |
| కరువుభత్యం, ఇంటిఅద్దె ఎలవెన్సులను కలిపి, | ౪౦.౦౦ |
| మద్యపాననిషేధసంస్థ కయే ఖర్చును కలిపి, | ౩౨.౦౦ |
| ప్రత్యేకరాష్ట్రనిర్మాణాని కయే ఖర్చులను కలిపి, | ౪౫.౪౦ |
| కొత్త పెట్టుబడినిర్మాణంలో అయే ఖర్చుపై వడ్డీ మొత్తం కలిపి, | ౮౦.౦౦ |
| కొత్త పెట్టుబడి భవనముల, నిర్వహణ కయే ఖర్చు, మొ. కలిపి, | ౨౦.౦౦ |
| యుద్ధానంతరనిర్మాణప్రణాళికల కయే ఖర్చును తీసివేస్తే, | ౬౮.౦౦ |
| మొత్తం | ౧,౭౫౭.౫౨ |
| కొరత : —౬౫౧.౫౨, లేక | —౬౫౨.౦౦. |

మార్కెట్ ధరల ప్రకారం ధవరూపేణా మొత్తంమీద నష్టపడినవారికి ముదరా యివ్వాలి.

ఇవి కాక, మరికొన్ని చిన్న చిన్న సూత్రాలను ప్రాతిపదికగా తీసుకుని, వారు భవిష్యదాంధ్ర రాష్ట్ర ఆదాయవ్యయపట్టికను, ౧౯౫౪-౫౫ లెక్కలను దృష్టిలో పెట్టుకుని తయారుచేశారు.

ఈ పట్టికలను అనుసరించి కమీషన్ వారు నూతనఆంధ్రరాష్ట్రానికి రు. ౬౫.౨ లక్షల కొరత (*Deficit*) "ఆరంభంలోనే" ఉంటుం దని తెలియ జేశారు. "ఇప్పుడు చెప్పగలిగినంతవరకు ఆంధ్రరాష్ట్ర ఆర్థికపరిస్థితి, నిష్కర్షగా చెప్పాలంటే, చాలా ఆందోళనకరంగా ఉంది. దైనందినపరిపాలనానిర్వహణానికి అయే ఖర్చును కొద్దికాలంలోనే, రాష్ట్రం లోని సహజసంపదలను జాగ్రత్తగా ఉపయోగించి సర్దుకున్నంతమాత్రాన సరిపోదు. అసలు ముఖ్యమైన విషయ మేమంటే, అభివృద్ధిప్రణాళికలను ఆచరణలో పెట్టగలిగేందుకు తగినంత సామర్థ్యం ఆర్థికంగా యీ నూతనరాష్ట్రం కలిగియుండాలి" అని కూడా సెల విచ్చారు.

## ౨

ఈ కమీషన్ వారి రిపోర్టు తెలియని వారిని మాత్రం తప్పుదారి కీడుస్తుంది. ఇది వీరి ఆశయం అవునో కాదో మనకు తెలియదు. కాని, ఈ రిపోర్టును ఆసాంతం పరికించి, ఆలోచించినవారికి మొదటగా కలిగే అభిప్రాయం — భవిష్యదాంధ్రరాష్ట్రావతరణం ఆర్థికాపజయపరంపరలకు నాందీవాక్యమే నని. అంతే కాక, తమిళనాడు బహుశః అదనపు ఆదాయం(*Surplus*) కల రాష్ట్రం కావచ్చు నని, ఇంతవరకు తమిళ జిల్లాలే ఆంధ్రజిల్లాలను పెట్టి పోషిస్తున్నాయని, తమ మంచితోనమే ఆంధ్రులు మద్రాసురాజధానిలో ఉండ వచ్చు ననీకూడా అనుకుంటారు.

ఆంధ్రరాష్ట్రావతరణానికి అడ్డంకులు ఏమైనా కావచ్చు కాని, ఆర్థికాయుక్తత ఎంతమాత్రం కారణం కాజాల దని ఆంధ్రులు తెలుసుకున్నారు. బహుళముగా ప్రబలిపోయిన ఈ అభిప్రాయానికి ఆధారాలు ఇవి: ౧౯౩౨-౩౩ లో తెలుగుజిల్లాల ఆదాయం రు. ౬౧౮.౬౪ లక్షలు; వ్యయం రు. ౪౪౪.౪౮ లక్షలు. కొంత పెచ్చు మిగిలిం దని వేరే చెప్ప నక్కరలేదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి ౧౯౩౩ లో ప్రవేశపెట్ట బడిన తీర్మానాన్ని చర్చించే సందర్భంలో ఎకౌంటెంటు జనరల్ తెలియజెప్పినవే యీ అంకెలు. దీని వలన ఆంధ్రజిల్లాలలో వచ్చిన అదనపు ఆదాయం రు. ౧౪౦.౮౯ లక్షలని, మద్రాసు రాజధాని మొత్తం మీద ఆ సంవత్సరంలో అదనపు ఆదాయము రు. ౧౦౧.౦ లక్షలే ననీ; కొంత ఆంధ్ర జిల్లాలధనమే ఆంధ్రేతర రాష్ట్రాలకు తరలివెళ్లిం దనీ తెలుస్తోంది. ౧౯౩౮ లో అసెంబ్లీలో ౧౧ ఆంధ్రజిల్లాల నుంచి వచ్చిన ఆదాయం రు. ౫౭౦.౩౩ లక్షలని, వ్యయం రు. ౪౪౪.౧౦ లక్షలని తెలియజేయబడింది. ఆ సంవత్సరం అదనపుఆదాయం రు. ౧౩౩.౨౦ లక్షలు; మదరాసు రాజధాని మొత్తంమీద రు. ౦.౩౪ లక్షలే. ఈ లెక్కలు కూడా ఆంధ్రేతరజిల్లాలను పోషణం చేయడానికి ఆంధ్రరాష్ట్రధనప్రవాహం ఎంతవేగంగా ప్రవహించిందో తెలియజేస్తున్నవి. ఈ విధంగా యుద్ధానికి పూర్వం ఆంధ్రజిల్లాలు అదనపు ఆదాయం కలిగి ఉన్నవని ప్రభుత్వమే ఒప్పుకుంటోంది. ఈకమీషన్ వారి ఎట్టి తీవ్రమైన ఆర్థికపరీక్షలలోనైనా నెగ్గి, ప్రత్యేకరాష్ట్రంగా ఏర్పడడానికి ఈజిల్లాలు తగినవేనని అంకెలు తెలియజేస్తున్నాయి. అయితే, యిప్పుడు ఈ అంకెలన్నీ అబద్ధాలు చెప్పినవా, లేక అబద్ధాలు చెప్పే వారే ఇంతవరకు అంకెలను తయారుచేశారా? తమిళనాడు ఆర్థికపరిస్థితిని తెలియజేసే ఒక పట్టికకూడా ఇందుతోబాటు ఈ రిపోర్టులో జతపరచి ఉంటే, ఈ అపోహ బహుశా తొలగిపోయేదేమో.

## 3

ఆంధ్రతమిళనాడుల మధ్య ఆదాయవ్యయవిభజనలను చేయడానికి జనాభాప్రాతిపదికను తీసుకోవటం వలన, ఈ కమీషన్ వారు ఆంధ్రరాష్ట్రం ఆర్థికంగా అయుక్తమని నిరూపించడమే కాక, అదేవిధంగా తమిళనాడుకూడా అయుక్త మని, అసలు మద్రాసు రాష్ట్రమే ఆర్థికంగా అతిక్లిష్టపరిస్థితిలో ఉం దనీ తెలియజేసినవారైనారు. వ్యయపట్టికలో నూతన రాష్ట్రనిర్మాణాని కయే ఖర్చులను, క్రొత్త భవనాల

నిర్మాణానికి, వాటి నిర్వహణ కయ్యే ఖర్చుపై వడ్డీ ఛార్జీలను కలపడం, ఆదాయపట్టికలోను, అభివృద్ధి ప్రణాళికలలోనూ మరికొన్ని చిన్నచిన్న సవరణలను చేయడం మినహా, ఈ కమీషను వారు చేసినది కేవలం మద్రాసురాజధాని ఆదాయవ్యయాలను జనాభా ననుసరించి విభాగించటం తప్ప వేరేమీ లేదు.

ఈ పద్ధతివలన భవిష్యదాంధ్రరాష్ట్రఆర్థికపరిస్థితులననుసరించి సరియైన అంచనాలు వస్తాయనుకోవడం పొరపాటు. ఈ సందర్భంలో ప్రభుత్వంవారవలంబించిన పద్ధతే దీనికన్న సరియైనది. ఏ ఆదాయవ్యయాలకు ఏయేవి మూలకారణాలలో వాటినే ప్రాతిపదికగా తీసుకుని, వానిలో ఆంధ్రరాష్ట్రంపాలు ఎంతో లెక్కగట్టితే కొంతవరకు నిజస్థితి తెలుస్తుంది. ఉదాహరణకు: భూమిమీద వచ్చే ఆదాయాల్ని మోటారువెహికిల్సు ఆక్టు ననుసరించి వచ్చే ఆదాయాన్ని, జనాభాప్రాతిపదికపై రాష్ట్రాలమధ్య విభాగించడం సబబు కాదు, అదేవిధంగా, సర్వసాధారణమైన పరిపాలనానిర్వహణఖర్చులు, విద్యుచ్ఛక్తిఖర్చులు విభజించడంకూడా తప్పే. జనాభా ఒకటేదిని ప్రతి ఖర్చుకు, ప్రతిఆదాయానికి మూలకారణం కాదు. కమీషనువారు యీవిధంగా సరియైన పద్ధతి ప్రకారం ఆదాయవ్యయాలను విభజించిఉంటే బాగుండేది; అప్పుడు అందుకు కావలసిన జాగ్రత్త తీసికోవలసి ఉండేది. కాని, పామరునికి విశ్వసనీయమని భ్రమ కొల్పే ఈ అంకములబొంత లెక్కలను ప్రకటించడం ఈ కమీషనువారికి తగిన పని కాదు.

ఈ క్రింద లెక్కలనుబట్టి ఈ కమీషను వారి సెటిల్ మెంటు ఎంత సత్యదూరమైనదో తెలుస్తుంది. పట్టిక ౧ ఆదాయవ్యయాలను ౧౯౪౫-౪౬, ౧౯౪౬-౪౭ ల లోను, ౧౯౪౭-౪౮ (సరిమాడబడినవి) లోను తెలియజేస్తుంది. ఆంధ్రులు మదరాసు రాజధాని జనాభాలో మూడవవంతు ఉన్నారు గనుక, ఈ కమీషను లెక్కల ప్రకారం ఆంధ్రుల వాటా ౩౩%. పట్టిక ౨ ౧౯౩౨-౩౩ నుంచి ౧౯౩౮-౩౯ వరకు గల రాజధాని ఆర్థికపరిస్థితులను, ఆంధ్రుల వాటాను తెలియజేస్తుంది. (ప్రభుత్వంవారి ప్రకటన ననుసరించి) రాజధాని మొత్తంలో ఆంధ్రుల వాటా ఎంతో తెలుస్తుంది. ఈ పట్టికలో. దీనివలన, ఆంధ్రులు మదరాసురాజధాని ఆదాయంలో ఎక్కువ పాలుకు, వ్యయంలో తక్కువ పాలుకు కారణభూతులైనారని తెలుస్తుంది. అంటే, ఆంధ్రరాష్ట్రం సహజంగా అదనపు ఆదాయం రాగలిగిన రాష్ట్రం అని తెలుస్తోంది. కాని, కమీషను వారి లెక్కలన్నీ ఈ సత్యాన్ని మరుగుపరచినవి. పట్టిక ౩ లో అంచనా వేయబడిన ఆంధ్రరాష్ట్రపు ఆదాయం రు. ౧౯౦౦ లక్షలు, వ్యయం రు. ౧౫౯౭ లక్షలు. కమీషను వారి అంకెలతో సరిపోవటం లేదు. ఈవిధంగా కమీషను వారు ఆర్థికకారణాలపై ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి అడ్డు తగులగల అవకాశాలు ఈ నివేదికలో ఉన్నవి.

## రాష్ట్రీయ ఆర్థికస్థితి

పట్టిక ౧ (లక్షలరూపాయలు)

| | ౧౯౪౫-౪౬ | ౧౯౪౬-౪౭ | ౧౯౪౭-౪౮ (స. అం.) | ౩ సం॥ సగటు | కమీషను వారి ౩ సం॥ సగటు. | కమీషను వారి ఆంధ్రులవాటా | ఆంధ్రుల % జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| ఆదాయం | ౪౭,౯౯ | ౫౭,౦౦ | ౫౫,౧౯ | ౫౩,౩౯ | ౫,౦౦౦ | ౧౬,౬౪ | ౩౩ |
| వ్యయం | ౪౭,౯౯ | ౫౬,౯౯ | ౫౫,౧౯ | ౫౩,౩౯ | ౫,౦౫౫ | ౧౬,౮౫ | ౩౩ |

పట్టిక ౨

| | రాష్ట్రీయ ఆర్థికస్థితి. | | ఆంధ్రులవాటా (ప్రభుత్వపు లెక్కలు) | | ఆంధ్రుల % వాటా | |
|---|---|---|---|---|---|---|
| | ౧౯౩౨-౩౩ | ౧౯౩౮-౩౯ | ౧౯౩౨-౩౩ | ౧౯౩౮-౩౯ | ౧౯౩౨-౩౩ | ౧౯౩౮-౩౯ |
| ఆదాయం | ౧౬,౨౩ | ౧౬,౧౩ | ౬౧౯ | ౫౮౦ | ౩౮ | ౩౭ |
| వ్యయం | ౧౫,౨౩ | ౧౬,౧౦ | ౪౪౮ | ౪౪౭ | ౨౯ | ౨౮ |

పట్టిక 3 (పై కాలములను ఉపయోగించి)

| | కమీషన్ వారి 3 సం॥ సగటు | ఆంధ్రుల వాటా |
|---|---|---|
| ఆదాయం | ౫,౦౦౦ | ౧౯,౦౦. |
| వ్యయం | ౫,౦౫౫ | ౧౫,౯౭ |

కమీషన్ వారి ప్రకారం నిజస్థితిని తెలుపు ఈ క్రింది పట్టిక నిజస్థితిని తెలియజేస్తుంది :

రెవిన్యూ ఆదాయం ... రు. ౧,౯౦౦ లక్షలు
అదనపు సేల్సుటాక్సు కలిపి. „ ౧౧౦ „

౨,౦౧౦ „

మద్యపాననిషేధనష్టము ౪౯౩
యుద్ధానంతర అభివృద్ధి ప్రణాళికల గ్రాంటులను తీసివేస్తే ౬౪

౫౫౭

౧,౪౫౩ „

ఖర్చు ... ౧,౫౯౭
అదనపుఖర్చులను కలిపి ౨౩౭

౧,౮౩౪

యుద్ధానంతర అభివృద్ధి ప్రణాళికల గ్రాంటులను తీసివేస్తే ౬౪

౧,౭౭౦

కొరత ౩౧౭ లక్షలు

కమీషన్‌వారు చెప్పిన రు. ౬౫౨ లక్షల కొరత కేవలం గోరంతలు కొండంతలు చేసి చెప్పడమే.

'తాము ఇచ్చేదానికన్న తమకొరకు తక్కువ డబ్బే ఖర్చుపెట్టబడుతోం' దనే ఆంధ్రుల అభిప్రాయానికి కమీషన్‌వారు సరిగా సమాధానం చెప్పలేదు. సుమారు కోటిరూపాయలు ఆంధ్రులనుంచి ఆంధ్రేతరులకై వినియోగింపబడుతున్న వని, కాటకాలకు పెన్నిధియైన రాయలసీమనుంచికూడా, అక్కడ ఖర్చుపెట్టబడే డబ్బుకన్న ఎక్కువ ఆదాయమే సేకరించబడుతోం దని, ౧౯౩౨-౩౩ లో మద్రాసుప్రభుత్వంవారి లెక్కల ననుసరించి, కడప, కర్నూలు, అనంతపూర్, బళ్లారి, చిత్తూరుజిల్లాల నుంచి ఆదాయం రు. ౧౭౪ లక్షలు, వ్యయం రు. ౧౪౦ లక్షలని తెలుస్తోంది.

౪

ఈ కమీషన్ వారి లెక్కల పట్టికలవలన, వీరి నిర్ణయాలవలన తేలే విషయాలు రెండు : ఈ కమీషన్‌వారికి ఆంధ్రరాష్ట్రావతరణంయెడ సానుభూతి లేకనైనా పోవాలి; లేదా, ఇంతటి మహత్కార్యాన్ని నిష్పాక్షికంగా సాధించడానికి తగినంత విశాల దృక్పథం వీరికి లేకనైనా పోవాలి.

మద్యపాననిషేధంవల్ల వచ్చే నష్టాన్ని వ్యయపట్టికలో ఎత్తి చూపడం వీరి సుహృద్భావాన్ని ఎంతమాత్రం తెలియజేయటం లేదు. గవర్నర్‌జనరల్ రాజాజీగారి మాటలలో చెప్పాలంటే, మద్రాసు ప్రభుత్వం "ఎంతఖరైచ్చైనా సరే" మద్యపాననిషేధాన్ని అమలుజరపడానికే నిశ్చయించింది. ౧౭ కోట్ల నష్టం వస్తుందని తెలిసికూడా దీనిని రాజధానిఅంతటా ప్రవేశపెట్టా లని యీ ప్రభుత్వం పట్టుపట్టింది. ఈ మొండిపట్టుదలతోనే ప్రకాశంగారినికూడా అప్పుడు శాసనసభ్యులు ఎదిరించారు. క్రమంగా సేల్సుటాక్సు ఎక్కువచేస్తే ఈ నష్టాన్ని భర్తీచేసుకుందా మనీ, అటు కానిచో దానిని భరిద్దామనీ ప్రభుత్వోద్దేశ్యం. ప్రజాప్రతినిధులైన శాసనసభ్యు లందరూ ఈ విషయంలో అంగీకరించారు. అట్లాంటప్పుడు రు. ౪౯౩ లక్షల నష్టం వస్తుం దని పాట పాడడానికి ఆంధ్ర రాష్ట్రంలోని మద్యపాననిషేధాన్నే కారణంగా తీసుకోవడం, దాని ననుసరించి ప్రబలమైన రు. ౬౫౨ లక్షల కొరత భవిష్యదాంధ్రరాష్ట్రానికి వస్తుం దని లెక్కగట్టటంలో ఉన్న ఆర్థికన్యాయం అగమ్యగోచరం.

మద్యపాననిషేధంవల్ల వచ్చే (సుమారు) రు. ౬ కోట్ల నష్టాన్ని భర్తీచేయడం, దీని నిర్వహణ కర్యేయ ఖర్చును భరించడం అనే సమస్యలను ఆదాయాన్ని బహుళంగా వృద్ధిచేసి, వీలైనంతవరకు మితవ్యయం

చేసుకుంటా మనే సందిగ్ధమైన ప్రణాళికద్వారా ఎదు ర్కోవాలి. మద్రాసుప్రభుత్వంవారు అప్పుడే ఈ రెండు పద్ధతుల్ని ఆచరణలో పెట్ట మాస్తున్నారు. భవిష్యదాంధ్రరాష్ట్రంకూడా ఇదేవిధంగా ఈ సమ స్యను ఎదుర్కోగలదు.

౫

రాష్ట్రనిర్మాణం కారణంగా కలిగే ప్రతి ఖర్చునూ బహుజాగ్రత్తగా వ్యయపట్టికలో చేర్చ డంలోమాత్రం కమీషన్ వారు అతిశ్రద్ధ చూపారు. రాష్ట్రనిర్మాణానికయే ఖర్చులు,వడ్డీఛార్జీలు, భవనముల నిర్వహణ ఖర్చు—అన్నీ కలిసి సంవత్సరానికి దాదాపు రు. ౧౩౬ లక్షలు. ఇట్లాంటి ఖర్చులన్నీ చేరితేనే 'కమీషన్ వారి రు. ౬౫౦ లక్షల కొరత' ఏర్పడ్డది. నూతనరాష్ట్రంలో ఈ ఖర్చు తప్పనిసరి అని మనం ఒప్పుకుంటాం. కాని, ఈ సందర్భంలో చెప్పదగిన అంశాలు రెండు ఉన్నవి. ఒకటి-ప్రస్తుతం ఉమ్మడిగా ఉన్న రాజధానిపట్టణం మద్రాసులో ఏదీ కూడా ఆంధ్రతమిళనాడులకు సంక్రమించేదిగా కమీషన్ వారు ఎన్నలేదు. మద్రాసు విడిగా ఉంటుం దని తెలుస్తూ, నూతనరాష్ట్రాలు తమ ప్రత్యేకరాజధానీనగరాల నిర్మా ణం కోసం కేంద్రప్రభుత్వంనుంచి గ్రాంటును ఆశించ వచ్చు. నూతనరాష్ట్రాలలో ఏదీ కూడా, ఇంతవరకు ఉపయోగించుకున్నట్టుగా ఇకముందు మద్రాసులోని భవనాలను ఉపయోగించుకో వీలు లే దనటంతో, మద్రాసు భవిష్యత్తు ఏమైనా సరే, భవిష్యదాంధ్ర (లేక తమిళ) రాష్ట్రానికి క్యాపిటల్ గ్రాంటు తప్పక రావల్సి ఉంది; రెండవది-నూతన రాజధానీ నగరనిర్మా ణము వల్ల వచ్చే లాభాలు సుగమం; వాణిజ్యరీత్యా ప్రాముఖ్యం వహించే రాజధానీనగరంవల్ల ఏదోరీతిగా ఆదాయం నూతన రాష్ట్రానికి వస్తుంది (కొంత రాష్ట్ర ప్రభుత్వానికి, కొంత లోకల్ బోర్డులకు).

వడ్డీ మొదలుగా గల ఛార్జీలనన్నిటిని పూరాగా వ్యయపట్టికలో లెక్కించుటలో శ్రద్ధ చూపిన ఈ కమీ షన్ వారు. ఈ రెండు అంశాలను ఎందుకు స్మరిం చారో అనూహ్యం.

౬

ఈ కమీషన్ వారి స్టేట్ మెంటులు అసం పూర్ణము లని చెప్పడానికి మరి రెండు విషయాలు చెప్పాలి. ౧౯౫౨-౫౩ సంవత్సరములలో వచ్చిన మద్రాసు రాజధాని ఆదాయం భావిఆదాయమును పూర్తిగా సూచించదు. ప్రభుత్వీకరింపబడిన మోటారు రవాణావ్యాపారం ఇప్పటికే లాభకరంగా ఉంది. మరొక ఐదు సంవత్సరాల్లో యీవ్యాపారం పూర్తిగా ప్రభుత్వపర మవుతుంది. కీ. శే. డేనియల్ థామస్ జనవరి ౧౯౫౩ లో మద్రాసు ప్రభుత్వరాకపోకల సౌక ర్యాల ఫలితంగా రు. ౫౫ లక్షలు లాభం వచ్చిం దని తెలియజేశారు. దరిమిలా ఈ సౌకర్యాలు అభివృద్ధి చెందినవి. దానితోబాటు లాభాలుకూడా వృద్ధిచెంది నవి. పైగా నవంబరునుంచి బస్సురేటులు రేషనలైజు చేయడంవలన రు. ౩.౬ లక్షల అదనపు ఆదాయం లభించిం దని ఆర్థికశాఖామంత్రిగారు తెలియజేశారు. ఈ అంకెలు నమ్మదగినవే అయితే మద్రాసు రాజ ధానికి మరి ఐదు సంవత్సరాల్లో దాదాపు కోటిరూపా యల ఆదాయం అ ద న ం గా వస్తుంది. అందులో ఆంధ్రుల వాటా గణించతగింది. అదే విధంగా, జమీం దారీల రద్దువలన వచ్చే కోటిరూపాయల ఆదాయంలో ఆంధ్రులపాలు గమనించతగింది. తమిళనాడులోకన్న ఆంధ్రరాష్ట్రంలోనే జమీందారీప్రాంతం ఎక్కు వన్న విషయం మనం గుర్తుంచుకుంటే, తత్ఫలితంగా వచ్చే ఆదాయంకూడా ఆంధ్రుల కెక్కువే నని తెలుస్తుంది. అదేవిధంగా, వ్యవసాయాదాయపు పన్నువల్ల అదనపు ఆదాయం వస్తుంది. ఇవి, తదితరములు భవిష్యదాంధ్ర రాష్ట్రఆదాయవ్యయపట్టికలో తప్పక చేర్చబడవలసి నవి. వీటిని కమీషన్ వారు విస్మరించడం, వారి నివే దికను అసంపూర్ణంగా వదలివేయడమే అయింది.

౭

ఇంతవరకు లెక్కలనుబట్టి కమీషన్ వారి ప్రక టనలలోని సబబును, సమగ్రతను విచారించాము. రు. ౬౫౦ లక్షలుగా చెప్పబడిన కొరత బూటక మని తెలియజెప్పాను. మద్యపాననిషేధంవల్ల నష్టాన్ని, రాష్ట్రనిర్మాణాని కయ్యే ఖర్చులను వదిలితే, యీ

కొరత సుమారు రు. ౯౦ లక్ష లవుతుంది. మోటారు ట్రాన్సుపోర్టులాభమును, భూమిపన్ను ఆదాయమును కలిపితే ఈ కొరత పూర్తిగా పూర్ణానుస్వార మవుతుంది.

ఇక, ఒక నూతనరాష్ట్రపు ఆర్థికపరిస్థితులను నిర్ధారణ చెయ్యడంలో కేవలం పాతలెక్కల్లోనే దృష్టి నిలపడం సమంజసమా? భవిష్యదాంధ్రరాష్ట్రం ఒకటి రెండు సంవత్సరాలనుచ్చుట కాదు. అది చిరకాలం ఉండవలసినది కనుక రాబోయే ఒకటి రెండు దశాబ్దాలలో దాని ఆర్థికపరిస్థితులు ఎలా ఉంటవో గమనించవలసిఉంది. అభివృద్ధి చెందడానికి అవకాశాలు ఆంధ్రరాష్ట్రంలో అనేకం ఉన్నవి. అందుకు ముఖ్యకారణం, యింతవరకు మద్రాసురాజధానిలో ఆంధ్రరాష్ట్రం విస్మరింపబడిన ప్రాంతం కనుకనే. ఇంకా సాగుచేయబడవలసిన పది మిలియన్ల ఎకరాలు ఆంధ్రరాష్ట్రంలో బంజర్లుగా ఉన్నవి. రామపాద సాగరం ప్రాజెక్టు ౨౧ మిలియన్ల యకరాల కొత్త భూమిని, ౨ మిలియన్ల యకరాల పాతభూమిని సాగులోకి తెస్తుంది. వ్యవసాయికమైన ఈ మహత్తరాభివృద్ధి, ఆహారధాన్యాలలో బోనసులను తదితరఖర్చులను తప్పక తొలగించి, అదనపు పంటను తెచ్చి, రాష్ట్రాదాయాన్ని వృద్ధిచేస్తుంది.

పైగా, ఆంధ్రరాష్ట్రంలో జలవిద్యుచ్ఛక్తికి కావలసినన్ని అవకాశాలు ఉన్నవి. మద్రాసు ప్రభుత్వం ఇంతవరకు ఆంధ్రజిల్లాలను త్రోసిపుచ్చి, తమిళనాడులో దీనిని అభివృద్ధిచేసింది. ఆంధ్రేతర జిల్లాలలో విద్యుచ్ఛక్తికోసం రు. ౫౬౦ లక్షలు ఖర్చు పెట్టబడితే, ఆంధ్రప్రాంతంలో రు. ౫౦ లక్షలే వినియోగింపబడినవి. చవకగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి ఆంధ్రాలో తగినంత అవకాశం ఉంది.

పారిశ్రామికంగాకూడా ఈ రాష్ట్రం అభివృద్ధి చెందడానికి అనేకఅవకాశా లున్నవి. ముఖ్యంగా రాయలసీమలో యాజ్ బెస్టస్, గ్రాఫైట్, బారైట్స్, భవననిర్మాణపరికరములు, ప్రత్తి, నూనెగింజలు దొరకడం వల్ల అచ్చట పారిశ్రామికాభివృద్ధికి అవకాశాలు ఉన్నవి. నికరాదాయాన్ని ఇవి చాలావరకు వృద్ధిచేస్తయ్యని చెబితే కాదనగలవా రెవరు? ఆంధ్రరాష్ట్రఆర్థికపరిస్థితిని పరిశీలించేటప్పుడు వీటిని విస్మరించడానికి వీలు లేదు.

౮

ఆంధ్రరాష్ట్రానికి తాము లెక్కకట్టిన కొరతపైన ఈ కమీషనువారు తెగ వ్యాఖ్యానం చేశారు. అది దుర్భర మని, ఆందోళనకర మని సెలవిచ్చారు. అసలు బడ్జెటులో 'కొరత' అనేది కేవలం ఒక్క ఆంధ్రరాష్ట్రపు దురదృష్టమే కాదు. ఇండియా లో యిదే పరిస్థితిలో కావలసినన్ని రాష్ట్రా లున్నవి. ౧౯౩౮-౩౯ లో బొంబాయి, బెంగాలు, పంజాబు సి. పి., అస్సాము రాష్ట్రాలు కొరతరాష్ట్రాలు. యు. పి. మాత్రం యించుమించుగా ఆదాయవ్యయాలను సరిపెట్టుకుంది. మొత్తంరాష్ట్రాల కొరత ఆ సంవత్సరంలో రు. ౧౦౨ లక్షలు. ౧౯౪౮-౪౯ బడ్జెటుప్రకారం కూడా భారతదేశంలో 'కొరతరాష్ట్రాల'కేం కొరత లేదు. యుద్ధంమొదటలో తప్ప, తరువాత తరువాత మదరాసు రాజధానిలోమాత్రం నికరాదాయం నామమాత్రమే నని ఈ దిగువ పట్టికవలన తెలుస్తుంది.

| | | | |
|---|---|---|---|
| ౧౯౩౮-౩౯ | రు. | ౩.౭ | లక్షలు |
| ౧౯౩౯-౪౦ | ... | ౨౮.౫ | ,, |
| ౧౯౪౦-౪౧ | ... | ౫౨.౮ | ,, |
| ౧౯౪౧-౪౨ | ... | ౮౮.౦ | ,, |
| ౧౯౪౨-౪౩ | ... | ౧౨౫.౬ | ,, |
| ౧౯౪౩-౪౪ | ... | ౦.౦౬ | ,, |
| ౧౯౪౪-౪౫ | ... | ౦.౫౫ | ,, |
| ౧౯౪౫-౪౬ | ... | ౦.౧౫ | ,, |
| ౧౯౪౬-౪౭ | ... | ౦.౬౪ | ,, |
| ౧౯౪౭-౪౮ | ... | ౦.౪౧ | ,, |
| | (సరిచూడబడిన అంచనా) | | |
| ౧౯౪౮-౪౯ | ... | ౦.౭౧ | ,, |
| | (బడ్జెటు అంచనా) | | |

ఈ వరుసన తమిళనాడుకూడా ఆంధ్రరాష్ట్రం వలెనే 'కొరత' రాష్ట్రమే అయితీరుతుంది.

'కొరతలు' భారతదేశంలో రాష్ట్రాల ఔచిత్యానికి కారణాలై, థార్ కమీషన్ సూత్రాలు మక్కికిమక్కి ఆచరణీయము లైతే, ఇప్పు డున్న

బొంబాయి, అస్సాములవంటి పెద్దపెద్ద రాష్ట్రాల మనుగడకే ఆస్కారం లేదు.

పైగా రాష్ట్రాలలో మనం ఎదుర్కొనే ఈ విషమఆర్థికపరిస్థితి ప్రస్తుతం మనం జీవిస్తున్న కాల పరిస్థితులతో సంబంధం కలిగి ఉంది. అధికమైపోయిన కరువుభత్యాలు, విస్తరింపబడిన పరిపాలనానిర్వహణ శాఖలు, శాంతిభద్రతల నిమిత్తం వృద్ధిచెందే ఖర్చులు, తక్షణం ఫలవంతం కాని ఇళ్లు మొదలుగా గల ప్రయత్నాలపై ఖర్చులు-ఇటువంటివన్నీ కలిసి రాష్ట్రప్రభుత్వాల ఆర్థికపరిస్థితిని క్లిష్టం చేస్తున్నవి. ఈ అఖిలభారతసమస్యలను కేవలం ఆంధ్రరాష్ట్రపు ప్రత్యేక దురదృష్టంగా పేర్కొనడం తప్పు.

అసలింతకూ, ఆదాయవ్యయపట్టిక తయారు చేయడం భవిష్యదాంధ్రరాష్ట్రప్రభుత్వం చేతులలోనే ఉంది గదా. పన్నులు, అప్పులు మొదలుగా గల పద్ధతులతో, సాధ్యమైనట్లుగా ప్రభుత్వం ఆదాయ వ్యయాలను సరిపెట్టుకుంటుంది. పరిమితమైన ప్రయోజనం గల లెక్కల పట్టికలను ప్రయోగించి రాష్ట్రావతరణానికి ఆటంకం కల్పించడం కేవలం భవిష్యత్తుపై అధికంగా, అనవసరంగా అధికారం చెలాయించడమే!

౯

అప్పు సొప్పుల విభజనసందర్భంలో, తాము ప్రకటించిన సూత్రాల ననుసరించే, 'భవిష్యదాంధ్రరాష్ట్రం అభివృద్ధిప్రణాళికలను నిర్వహించలే' దనే కమిషన్ వారి అభిప్రాయం కేవలం అపోహమాత్రమే నని తెలుస్తుంది. నిస్సందేహంగా మద్రాసుప్రభుత్వపు పెట్టుబడి ఆంధ్రరాష్ట్రంలోకంటే ఆంధ్రేతరప్రాంతాలలో ఎక్కువ. దామాషాఅంచనాలప్రకారం [illegible] వంతు ఫలప్రదమైన ఆస్తిపాస్తులన్నీ (సుమారు రు. ౫౦ కోట్లు) ఆంధ్రేతరప్రాంతాలలోనే ఉన్నవని తెలుస్తోంది. వీటన్నిటినీ గణిస్తే, ఆంధ్రరాష్ట్రానికి, విభజనలో చెప్పదగినంత మొత్తం ముదరా వస్తుంది. ఇంతవరకూ జాగిలం చేయబడిన అనేకములైన అభివృద్ధి ప్రణాళికలను ఆచరణలో పెట్టడానికి ఆ ధనం వినియోగించవచ్చు. రు. ౧౦౦ కోట్లు ఖర్చుఅయే రామపాదసాగరం ప్రాజెక్టువంటి పెద్ద ప్రయత్నాలను ప్రభుత్వం ప్రజలవద్దనుంచి అప్పులు తెచ్చి నిర్వహించవచ్చు.

౧౦

భవిష్యదాంధ్రరాష్ట్రం ఆర్థికంగా అయుక్తమనే కమిషన్ నిర్ణయాన్ని తిరస్కరిస్తూ, ఆర్థికంగా ఆంధ్రరాష్ట్రం ఎలా యుక్తమో ఈ క్రింద తెలియ జేయబడింది:

(౧) ౧౯౩౨-౩౩లో వలె జిల్లాలవారీగా అంచనాలు తయారుచేసి, పై చెప్పిన విషయాలను గణించి, సమగ్రమైన ఆదాయవ్యయపట్టికను తయారు చేస్తే ఆంధ్రరాష్ట్రం 'లోటు' రాష్ట్రం కాదు.

(౨) ప్రాంతీయంగా యీ ౧౧ ఆంధ్రజిల్లాలు అభివృద్ధిచెందడానికి, ముఖ్యంగా రాయలసీమ అభివృద్ధిచెందడానికి ఆంధ్రరాష్ట్రమే ప్రాతిపదిక.

(౩) ఆంధ్రజిల్లాలకు చెందవలసిన ఆర్థిక అవకాశాలను కారణాంతరాలవల్ల ఆ యాంధ్ర జిల్లాలు తిన్నకుపోకుండా ఉండటంకోసం ఆంధ్రరాష్ట్రం అత్యవసరం.

(౪) వివిధరాష్ట్రాలకు సహాయం జరిగినప్పుడు ప్రత్యేకప్రాంతంగా ఆంధ్ర రాష్ట్రం గుర్తింపబడుతుంది. ఈ విషయంలో ఇప్పటికే ఆంధ్రులు చాలా నష్టపడ్డారు. ఉదాహరణకు: మద్రాసురాజధానికి వచ్చిన నేతమగ్గములలో ఆంధ్రప్రాంతాలకు ముట్టినది బహుస్వల్పము. చిన్నదైన ఒరిస్సాకు ప్రత్యేకంగా ముట్టినవి ఎక్కువ. అదేవిధంగా కేంద్రప్రభుత్వం రాష్ట్రాలవారీగా పరిశోధనకేంద్రాలను ఇస్తుంటే, ఆంధ్రప్రాంతాలలో ఒక్క పరిశోధనకేంద్రమైనా నెలకొల్పబడలేదు.

(౫) ఆంధ్రజిల్లాలు తమపై వెచ్చింపబడేదానికన్న ఎక్కువధనాన్ని ఇస్తున్నయ్. ఇది అరికట్టబడాలి. ఈ అభిప్రాయం నిజం కాకపోతే, ఆంధ్రులవల్ల ఆంధ్రేతరులు నష్టపడట మెందుకు! వారే శ్రమపడి మనకు ఆంధ్రరాష్ట్రం యిప్పించవచ్చు.

౧౧

ధార్ కమిటీని వేదికలోని మూడవభాగంలో ఆంధ్రరాష్ట్రం ఆర్థికంగా అయుక్త మని చెప్పబడింది. అది కేవలం అపోహ అని చెప్పడానికే ఈ వ్యాసం ఉద్దేశింపబడింది, ఈ పరిశీలనలో రాజకీయాల జోలికి పోకుండా జాగ్రత్త తీసుకోబడింది. సమాన హోదాలో, సమానంగా సంతృప్తి లభించే సరియైన వ్యవస్థలో భాషాప్రయుక్తరాష్ట్రాలు ఈదేశంలో సాంస్కృతికాభివృద్ధికి, జాతీయైక్యమునకు సాధనాలుగా ఉపకరిస్తాయని చాలామంది అభిప్రాయపడుతున్నారు. భాషాప్రయుక్తత కేవలం 'హిట్లరిజం' వంటిదే నని, అది కేవలం జాతీయైక్యతావిచ్ఛిన్నతకే దారితీస్తుం దని ఉద్ఘాటించేవారూ ఉన్నారు. పరిస్థితుల ప్రాబల్యంవల్ల, వ్యక్తుల ఉనికివల్ల క్షణక్షణం మారే రాజకీయాలలో యిదమిత్థ మని మంచిచెడుగులను తేల్చి చెప్పడం కష్టం. కాని ఆర్థికములైన సత్యాలు మరుగపరచబడలేవు; అవి పరిస్ఫుటములు. అయితే, ఒక రాష్ట్రావతరణ ఆదిలోనే దెబ్బతీయడానికి అవి ఎంతవరకు ఉపయోగపడగలవో అంతవరకు ఈ నివేదికలో అంకెలు ఉపయోగించుకోబడినవి. అందుచేతనే యీ పరిశీలనావశ్యకత. ఇది కేవలం ధార్ కమిషన్ వారి నివేదికలోని మూడవభాగానికే ఉద్దేశింపబడినది కాని, అంత రిపోర్టునుగురించి అసలు చర్చించలేదు.

---

# రాలినపూలు

శ్రీ నాళము కృష్ణరావు

కన్నెయామని సిరులకు వన్నె పెట్టు
మవ్వ మగు చిన్ని చిన్నారు పువ్వులార!
ఏల రాలెద రక్కటా! నేలమీద?
ఏమి తొందర వచ్చె మీ కింతలోన?

ఏల పుట్టించె దేవు డీ యిలను మిమ్ము?
మింట తళు కని మెఱసెడి మెఱపుల గతి
మూడు నాలుగు గడియల మురువు జూపి
అంత తటుకున మటుమాయ మగుట కొరక?

మంచివారలు తాము జీవించియున్న
స్వల్పకాలములోననె వారి సుగుణ
సౌరభంబుల వెదచల్లి చనెద రనుచు
మీదు చరితంబు జగతికి బోధచేయు.

పగలు వికసించి దిన మెల్ల సొగసు లీని
రాత్రి యైనంత నేలపై రాలు గాక!
లీల దా నున్న యా యల్పకాలముననె
కమ్మతావుల విరజిమ్ము గాదె సుమము?

---

# కలగూరగంప

## "అలంకారశాస్త్ర ఆవశ్యకత"

గత ఫిబ్రవరి భారతిలో శ్రీ జి. వి. కృష్ణారావుగారు 'అలంకారశాస్త్ర ఆవశ్యకత' అని చక్కటి వ్యాసమును వ్రాసియున్నారు. 'కళారంగములోని అవ్యవస్థ తొలగుటకు సమగ్రమైన అలంకారశాస్త్ర నిర్మాణము ఆవశ్యకము' అని వారు నిర్ణయించిన నిగమనమును ఎల్లరును అంగీకరింతు రనియే విశ్వసించుచున్నాను.

కాని, వారు ౪౪ వ పుటలో 'తాత్త్విక కారణాలు' అను శీర్షిక క్రింద జ్ఞానమునుగురించి దర్శనముల అభిప్రాయమును దీకరించిన తీరు వివాదాస్పదముగ నున్న దేమో యని భయపడుచున్నాను. రెండవ పేరాలో వారు జ్ఞానములో గల ద్వివిధ అంతస్తులను అంతగా గమనించనట్లు తోచుచున్నది.

వారు మొదటి వాక్యములలో దేనిని జ్ఞానముగ గ్రహించినారో అది నిశ్చయముగ పరావిద్య.

ఇక ఏ జ్ఞానము అభివృద్ధినంద దని భయపడుచున్నారో అది అపరావిద్య.

దార్శనికులు వేదప్రామాణ్యమును ప్రాచీనతను శాస్త్రగ్రంథములను అనుల్లంఘనీయముగను పరమ ప్రామాణ్యముగను, శిరసా పరిధార్యముగను గ్రహించినది ఈ పరవిద్యానూచితమైన ఆత్మజ్ఞానవిషయమునసే.

ఇట్లు స్వీకరించుట చారిత్రాత్మకజ్ఞానమునకును, జ్ఞానాభివృద్ధికిని అడ్డుపడుచున్నదని శ్రీకృష్ణారావుగారి నింద. కాని దీనికి తావు లేదు. ఏలయన: ఈ జ్ఞానము నిశ్చయముగ అపరావిద్యాశబ్దసూచితమైన లౌకికజ్ఞానము. అయినా విషయముల చర్చ అటనట వేదములలో నున్నను దార్శనికులు ఈసందర్భమున వేదమునే పరమప్రామాణమనలేదు. అపరావిద్యను బోధించుటకు వేద మక్కరలేదు. సామాన్యులగు మానవులే దీనిని తెలియచెప్పగలరు.

నూరు వేదవాక్యములు కలిసినను ఘటమును పటముగ మార్చజాల వని వాచస్పతి. అలౌకికమగు ఆత్మవిషయమునసే వేదము ముఖ్యముగ తెల్పుచున్నదని సాయనులు. లౌకికసందర్భ మేమైన వేదములో నున్నయెడల అది ప్రాప్తానువాదము మాత్రమే; దానిని ఉపదేశించుట వేదాభిప్రాయము కాదు.

కనుకనే వేదముకాని, వేదోక్తజ్ఞానముగాని లౌకికజ్ఞానమును చరిత్రాత్మకజ్ఞానమును ఏ రీతిగను కుంటుబడజేయజాలదు. లేక లౌకికజ్ఞానాభివృద్ధికి అటంకమును కాదు.

శ్రీ రావుగారు నుడివినట్లు పరజ్ఞానములో మార్పు, అభివృద్ధియును ఉండిన దానిని ఎన్నడును ఎవరును ఇదమిత్థముగ తెలిసికొనజాలరు. అస్తు. పరాపరవిద్యల విభాగమును మనస్సులో నుంచుకొననందువలన ఈ తికమక ఏర్పడిన దని స్పష్టము.

ఈరీతిగ ౪౫ వ పుటలో పరజ్ఞానవిషయమున దర్శనశాస్త్రము లొనర్చిన దోషములను జూపి, మరల ౫౪ వ పుటలో 'తత్త్వశాస్త్రం శాస్త్రానికి శాస్త్రం అవుతుంది' అని అంగీకరించినారు. గొప్పగ ప్రశంసించినారు.

శ్రీరావుగారి దృష్టిలో దర్శనశాస్త్రతత్త్వ శాస్త్రములు వేరువేరు శాస్త్రములా? ఈ రెండును ఒకటి కాదా?

ప్రామాణికులైన దర్శనశాస్త్రజ్ఞులు 'కళాచర్చ' చేయలేదని శ్రీ రావుగారు విస్తుపోయినారు.

“కావ్యాలాపం వర్జయేత్” అను గోత్రమునకు చెందిన భారతీయదర్శన (తత్త్వ)శాస్త్రజ్ఞులు కళా చర్చ చేల కొనర్పవలెను? కళలకు మత దర్శనములు ఉత్సాహము కొన్ని క్షేత్రములలో నగపడ వచ్చును. దానిని చర్చించుట కళావేత్తకార్యము కాని దర్శనకారునిది కాదు.

పైన చూపిన పక్షములు మావి భ్రమజనితములైన శ్రీ రావుగారు చూపబోవు వరువడిలో దిద్దుకొనుటకు మా కెట్టి అభ్యంతరమును లేదు. జ్ఞానమును ప్రతివారును అభివృద్ధి నందజేసికొనవలెను కదా!

శ్రీ నిర్వికల్పానందస్వామి

---

# పూనా ఆంధ్రుల కవితాదరణ

పూనాలోని ఆంధ్రాఅసోసియేషన్, తెలుగు లైబ్రరీనిర్వాహకులు ఈ సంవత్సరాదిని ఉభయభాషా ప్రవీణ శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారిని పిలిపించి, కవితాగానం చేయించి, వారిని యథోచితంగా సత్కరించినారు. ఇటువంటి సత్కారములు చేయుట స్వస్థానవేషభాషాభిమానులైన వారికి చిరకాలముగా పరిపాటి అయిపోయినది. ఈ సత్కారసందర్భములో శ్రీ శాస్త్రిగారినిగురించి వి. వి. యస్. ఆర్. హనుమంతరావుగారు ఈ క్రింది గేయము పాడి వినిపించిరి:

పలుకు పలుకున
తేనె లొలుకుచు
మధుర మొప్పెడి
తెలుగుభాషను
కవితకన్నెకు
అలంకారము
పూర్వకవితయు,
నవ్యకవితని
క్రొత్త కవితను
హారమందున
జిగ్గు జిగ్గున
మెరసిపోయెడి.
మణులయందలి
వరసలోపల
నీకు తానము
వున్నదో కవి.
పిలచినంతనె
టక్కు టెక్కులు
చేయకుండా
మాదు కోరిక
స్వీకరింపుచు
మాదుకడకూ
వేంచేస్తివో
పండితాగ్రణీ!
శీతకరునికి
నూలుపోగును
ఇచ్చు కరణిని
ప్రేమతోడుత
మేము నీకిదు
అంజలిదిగో
అందుకొను మో
ఆంధ్రకవివర.

---



# విమర్శనము



## కామేశ్వరి కథ

టోర్గెనావ్ కథకు అనుసరణ. రచయిత: రాంషాగారు. కళాకేళీప్రచురణ పిఠాపురం. వెల రూపాయి పావులా.

ప్రేమికుడు రామ్మూర్తి 'కామేశ్వరికథ'ను వినిపిస్తున్నాడు.

కామేశ్వరి—'ఆలస్యంగా సంస్కారం పొందిన గులాబి; పులుస్తూ పులుస్తూ ఉన్న ద్రాక్షాసవం;' కల కల నవ్వే వనలక్ష్మి; మళ్లీ శోకంతో క్రుంగి కృశించే ఎలతీగ; ప్రపంచాన్ని నిర్లక్ష్యంగా చూసే రణపెంకి; కాని తన్ను తానే నమ్మలేని చేల—ఇలా నడిచింది కామేశ్వరిప్రవృత్తిచిత్రణ.

లోతుగా తరచి చూస్తే—తన పుట్టుకలోని తక్కువతనాన్ని వెల్లడిచేసే ధైర్యం ఆమెకు లేదు; చెప్పివేయా లన్న ఉబలాటం లేకపోలేదు. శారీరకంగానూ, మానసికంగానూ అద్భుతశక్తులను ప్రదర్శించింది కామేశ్వరి. కాని ఇవన్నీ తన కులీనతలోని హైన్యాన్ని కప్పిపుచ్చి, గొప్పహుంధాను ప్రదర్శించా లన్న అపోహతోనే కాని సహజంగామాత్రం కాదు. (ఇటువంటి ప్రవర్తననే మన శాస్త్రవేత్తలు *Defence Mechanism* అంటారు.) అందుచేతనే దూరపు శిఖాలాలలో మేకపిల్లలా గెంతగలిగినా, నదీగర్భంలో యీదగలిగినా, విశాలవినిర్మలఆకాశంలో స్వేచ్ఛగా, సహజంగా ఎగరలేక కూలిపోయింది.

ఇక కథకుడు రామ్మూర్తి! చీకటిలా తన్ను ఆక్రమించుకొని, ఒక సిక్కు సోల్జరుకోసం మెరుపులా మాయమైన తవమణి అతని జీవితపుపరిధిలోకి తొంగి చూడటం అతని తొలిఅనుభూతి. దీనివల్లనే అతనికి స్త్రీ అంటే భయం ఏర్పడింది. అందుచేతనే చెల్లాయమ్మకూతురైన కామేశ్వరిచేత ఆకర్షింపబడా లన్న కోర్కె అతనిలో ఎంత బలంగా పాదుకొనిపోయినా, వివాహానికికూడా అంత విముఖు డయాడు. ఈ మన స్తత్వాన్ని అర్థంచేసుకుంటేనే, తన దుట్టకుదినిర్ణయాన్ని ప్రకటించడానికి అతడు ఒకరోజు వాయిదా వేయడంలోని ఔచిత్యం స్పష్టపడుతుంది.

మిగిలింది శైలి: కథకూ, కథాగమనానికీ అనుకూలవాతావరణాన్ని ఏర్పరచే భాషావిశేషమే శైలి అని అంగీకరిస్తే, 'కామేశ్వరికథ'లోని శైలి మంచిదనే చెప్పాలి.

ఇదీ కథ: ఇక ముద్రారాక్షసాలనుంచీ, భౌగోళికశాస్త్రపరిజ్ఞానకూన్యాన్ని ప్రదర్శించడం వరకూ, శల్యపరీక్షకూ, చికిత్సకూ బోలెడంత అవకాశం ఉంది. యీ 'కామేశ్వరికథ' అనబడే నవలలో కథకుడు గొప్ప ప్రయోజనాన్ని దేన్నీ సాధించలేదని అన్న 'ముందుమాట'లోని సోమసుందర్ తీర్పుకు రచయిత బద్ధుడవాలి.

కాగా, కామేశ్వరికథలోని పరమసత్యం మన స్తత్వం: ఇదే ప్రతీచదువరినుంచీ ఒక్క నిట్టూర్పును రాబట్టుతుంది.

'మధుపం'

---

## ఆత్మభారతము

రచయిత: చిట్టా అంజనేయులుగారు, తాటికొండ, గుంటూరుజిల్లా.

మహాభారతమును ఆద్యంతముగా పరిశీలన చేసి, ఆత్మపరముగా దానిని సమన్వయించుటకు చేసిన విపుల విమర్శ యిది. దాదాపు ౮౦౦ పుటల ఈ గ్రంథములో అంజనేయులుగారి శాస్త్రపరిశ్రమ, అనేక గ్రంథపరిశీలన, విమర్శనవివేచనములను పాఠకులు సులువుగా అవగాహన చేసుకోగలరు.

# గ్రంథ స్వీకారము

## తానీషా : అక్కన్నమాదన్నలు

రచయిత : వేదము వేంకటరాయశాస్త్రిగారు. ప్రకాశకులు : వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్, ౪, మల్లికేశ్వరగుడిసందు, లింగిచెట్టివీథి, మద్రాసు ౧. వెల ౨ రూ.

## రాష్ట్రపతి పట్టాభి

జీవితచరిత్ర. 'శశభిష' ఆంగ్లరచనకు 'సింగరాచార్య' గారి అనువాదము. ప్రకాశకులు : జాతీయజ్ఞాన మందిరము, మద్రాసు ౧౪. వెల ౧ రూ.

## క ళా జీ వి

ఖండకావ్యసంపుటి. రచయిత : బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు, తలమర్ల, అనంతపురము జిల్లా. వెల లేదు.

## మహాత్మాజీ విజయయాత్ర

లఘుకావ్యము. రచయిత : మల్యాల జయరామయ్యగారు, సాహితీసభ, పెద్దాపురము. వెల ౧ రు.

## రాయల నీతికథలు

మూడవ భాగము. రచయిత : గిడుగు సీతాపతిగారు. ప్రకాశకులు : రాయలు అండు కో., కడప. వెల ౬ అ.

## అ వ్వ కి పో టీ

చిన్నపిల్లల కథ. వల్లియప్పరచనకు గిరిధర్ అనువాదము. ప్రకాశకులు : బాలకార్యాలయము, ౪, రట్లండ్ గేట్ కాలనీ, కతీడ్రల్, మద్రాసు ౬. వెల ౨ అ.

## జై హిం ద్

నాటకము. రచయిత : యరగుడిపాటి రామయోగిగారు. ప్రకాశకులు : త్రివేణీపబ్లిషర్స్, మచిలీపట్టణము. వెల ౧౨ అ.

## ఆంధ్రకవితరంగిణి

మూడు, నాలుగు సంపుటములు. కర్త : శ్రీ చాగంటి శేషయ్యగారు. వెల చెరి ౩ రూపాయలు. ప్రాప్తిస్థానము : ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్, కపిలేశ్వరపురము, తూర్పుగోదావరి.






Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press' No. 7. Thambu Chetty St., G. T., Madras. Editor— S. Sambhu Prasad.